విడిప్రతి రు. 3 00
సంవత్సర చందా రు. 65.00
జన్మదిన ప్రత్యేక
సంచిక వెల రు: 6/-

సంపాదకవర్గం
బొజ్జా తారకం
కె. బాలగోపాల్
డి. నరసింహారెడ్డి
కె. ఐలయ్య
సిరిల్‌రెడ్డి
వి.ఎల్. విశ్వేశ్వరరావు
ఆర్. అఖిలేశ్వరి

సంపాదకుడు
బొజ్జా తారకం

ఉప సంపాదకులు
ఎస్.జయ
ఎస్. జగన్ రెడ్డి

రూపకల్పన
ఎ. షరీఫ్
ఆర్ట్ వర్క్
నారు
కవరుపేజీ ఫోటోలు
అలిశెట్టి ప్రభాకర్
యు.ఎన్.ఐ. (సౌజన్యంతో)

ప్రచురణ, ముద్రణ
హైదరాబాద్ బుక్ ట్రస్ట్ తరుపున సిరిల్ రెడ్డి

అక్షరాలు
ఓం సాయి లేజర్ గ్రాఫిక్స్
నారాయణగూడ.

అచ్చు :
హైదరాబాద్ ప్రింటర్స్
హైదరాబాదుకుగాను,
గాయత్రి ఎంటర్ ప్రైజెస్, హైదరాబాద్.

సర్క్యులేషన్ మేనేజర్
శరత్‌చంద్ర
'నలుపు' పక్ష పత్రిక
ఇం నెం. 1-1-342/బి, వివేకనగర్
హైదరాబాద్ - 500 020
ఫోన్ నెంబర్ 67412

ప్రజల పక్ష పత్రిక

సంపుటి : 1 సంచిక 19, 20 & 21 ఏప్రిల్ 1-30, 1990

## లోపలి పేజీల్లో

# గూడులేని పక్షులు

ఎక్కడైనా గుడిసెలు ఎందుకు మొలుస్తాయి
బతకొచ్చిన తనమో
పల్లెల్లో బతకలేనితనమో
కొందరి జేబులు నింపడానికో
కొందర్ని నాయకులు చేయడానికో
అక్కడ గుడిసెలు మొలుస్తాయి
వాటినక్కడ మొలవనిస్తారు
పట్టాల ఎరలు చూపి మా చెమటకుప్పతో
మీ జేబులు నింపుకుంటారు, ఓట్లు కొనుక్కుంటారు
పిడుగు పడేముందు ఆకాశం గర్జిస్తుంది
లావా విస్ఫోటనం చెందే ముందు
భూమి కంపిస్తుంది
కాని మీరు మాత్రం
ఎలాంటి సంకేతం లేకుండా దాడి చేస్తారు
మీ నగరం మొఖమ్మీద స్ఫోటకం మచ్చల్లాగా వున్న
మమ్మల్ని ప్లాస్టిక్ సర్జరీ చెయ్యడానికి
మాకు మత్తుమందైనా ఇవ్వకుండా
మా మీద మీ గునపాల్ని పొడుస్తారు
మా గుడిసెల కప్పుల్ని
నేలమట్టం చేస్తారు

మా ముసలి ముతకని పిల్లాజెల్లల్ని
నిర్దాక్షిణ్యంగా త్రోసివేస్తారు
అర్ధరాత్రి నిద్రలో వచ్చిన వరదలా మీరు -
మా బొల్లు బానసన్లని చూసుకోమా
మా అవ్వని అమ్మాయిల్ని చూసుకోమా
మా ఇటుకల్ని ఇల్లాల్ని చూసుకోమా
మా కళ్ళముందే మీ గునపాలకి కరిగి నీరవుతున్న
మా కాలనీని చూసుకోమా
మీ కార్పోరేషన్ ట్రాక్టర్లమీద పయనిస్తున్న
మా వస్తువుల్ని చూసుకోమా
మీ గునపాలకి ఎదురొడ్డమా
మండుటెండలో మా ఏడ్పులు
మా ఒడార్పులు నేలపాలైన పాలలాంటి మా పిల్లలు
ఏవీ మీ గునపాల్ని ఆపలేకపొయ్యాయి

మీ గునపాలు బుల్డోజర్లుకదా
మెతుకు మెతుకునీ పోగు చేసుకున్నట్టు -
ఇక ఇటుక ఇటుకని పోగు చేసుకోవాలి

అవును
మీరు మీ లారీలు కదిలించలేదు
తుపాకులను మెదిలించనూ లేదు
చేతులు కట్టుకునే నిల్చున్నారు
పుట్టల్లోంచి చీమలు వచ్చినట్టు
వ్యాన్ల నుంచి వచ్చి, ప్లాటూన్ల కొద్దీ వచ్చి
మా చుట్టూ ప్రహరా కాశారు
అవును
మీరు మమ్మల్ని ఏమీ అనలేదు
మా అసంసిద్ధతనీ, మా కోపాన్నీ
మా ఆవేశాన్నీ మా అశక్తతతన్నీ, మా ఆక్రోశాన్నీ
మా అందరిల్లోంచి ఉబికివస్తున్న దుఃఖాన్నీచూస్తూ
మా చుట్టూ ప్రహరా కాశారు

అమ్మా
ఓ రెండురోజులే తల్లీ
అంతదాకా కాస్త ఓపిక పట్టుతల్లీ
ఆ తర్వాత మీ ఇంటి ముందు ఉండమన్నా ఉండం తల్లీ
ఎక్కడో ఏ పాడుబడ్డ స్థలమో దొరికేంత వరకే తల్లీ

అవును ఇది దుర్ఘటన కాదు
నగరానికి ప్లాస్టిక్ సర్జరీ
అంతా కుమ్మక్కు
అందుకే సానుభూతి పవనాలు వీచవు
ఎవరూ మాకు నీడ కల్పించరు
ఏ పక్షమూ
మా పక్షము కాని వాళ్ళం కదా
మా ఆవేశాన్ని మెతుకుల్ని చేసి
నేల మీద విసిరేసామనుకుంటున్నారు కదూ-
కానీ
మీరు విసిరింది మెతుకుల్ని కాదు పక్షుల్ని

— జింబో

# ప్రజల గెలుపు – నలుపు గెలుపు !

"నలుపు" పత్రికకు ఒక ఏడాది నిండింది. ఒక పత్రిక జీవితకాలంలో ఒక సంవత్సరం కాలం అసలు ఏమీకాదు. పత్రిక మంచి చెడ్డలను ఎంచుకోవటానికి కూడా ఈ సమయం సరిపోదు. కాని "నలుపు" వంటి పత్రికకు ఒక ఏడాది కాలం ఎక్కువే. పాఠకులు నలుపును ఆదరించి తెలుగు పత్రికారంగంలో ఒక విశిష్టస్థానాన్ని అందుకోవటానికి చేయూతనిస్తున్నం దుకు నలుపు సంపాదక వర్గం, నిర్వహణ విభాగమూ పాఠకులకు ఈ సందర్భంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాయి.

లేచి నిలవగలిగినపుడు ఒక కాలు మరొక కాలు తీసుకుంటూ అడుగులో అడుగు వేసుకుంటే నడవటానికి ప్రయత్నిస్తూ నడువగలిగినపుడు పసివాడు ఎంత సంబర పడిపోతాడో, ఎంత ఉత్సాహంతో అడుగులు వేస్తాడో నలుపు పత్రికకు ఈ క్షణంలో ఆ ఆనందమూ సంబరమూ ఉన్నది.

ఎన్నో ఆటుపోట్లను తట్టుకొని, ఎన్నో ఇబ్బందులకు లోనయి, ఆశించిన స్థాయికి తగ్గకుండా, పాఠకులలో ఆసక్తి తగ్గిపోకుండా నలుపును నడుపుకుంటూ వచ్చాము. ఈ బాధలన్నీ మీతో చెప్పటం ఎందుకంటే మీరు ఆదరిస్తున్నారు కనుక.

తెలుగు పత్రికారంగంలో నలుపు వంటి పత్రిక ఎంతో అవసరం అనుకున్నాం. చాలమంది ఇతరులు ఆ అవసరాన్ని గుర్తించారు. అవసరం అయితే ఉన్నది కాని దానిని తీసుకురావలసిన అవసరాన్ని కూడా పాఠకులు గుర్తించాలి.

వ్యాపార రంగంలో విలువలకోసం ప్రయత్నించటం, వాటిని నిలుపుకోవటానికి ఆరాటపడటం చాల కష్టంతో కూడుకున్నపని. పెట్టుబడి దారీ వ్యవస్థలో పోటీయే ముఖ్యం, ముందు ఉండగలగటమే కావలసినది. ఎలా అన్నది అనవసరం. ఎలా అయినా సరే అగ్రగామిగా ఉన్నావా లేదా అనేదే సమస్య. ఈ వ్యాపార రంగంలో వ్యక్తి విలువలు, కుటుంబ విలువలు, సామాజిక విలువలు నలిగిపోతాయనేది మనం నిత్యం చూస్తున్న విషయమే.

అయితే "నలుపు" ఆ పరుగులోకి వెళ్లదు. ఆ దిగదు. ముందు నిలబడటానికి పాఠకులను దివిం–సుకు నడిపించుకు పోవటానికి సిద్ధమవుతుంది కాని ణం విలువలను పణం పెట్టదు. అందుకోవటానికి కొంత ఆలస్య ాని మతుంది గాని దారి మాత్రం చాల పదిలంగా, స్పష్టంగా ుకుంటుగా వేసుకుంటూ వస్తున్నది.

ఎక్కడ విన్నా ఈరోజుల్లో పత్రిక అంటే దిగ్భ్రాంతి గొలిపించేదిగా ఉండాలి, కళ్లు మిరుమిట్లుగొల్పేదిగా ఉండాలి. మానవులలోని బలహీనతలను రెచ్చగొట్టేదిగా ఉండాలి. తీరని కోర్కెలు తీర్చేదిగా ఉండాలి. అలా ఉండకపోతే ఆదరణ ఉండదు అని అంటుంటారు. అందుకే ఇంచుమించు అన్ని పత్రికల నిండా సెక్స్‌కు సంబంధించిన కథలు, విషయాలు వాటికి తోడు ఉద్రేకాలను రెచ్చగొట్టే బొమ్మలు

కాదంటే హత్యలు, బిభత్సం, రౌద్రం, హింస, ఈ రెండింటినీ పక్కపక్కనే పోషించుకుంటూ మూడోదానిని కూడా ప్రవేశపెడుతున్నారు. అది మంత్రతంత్ర మాయాజాలం, భూతప్రేత పిశాచాల ఘీంకారం. వీటి అన్నిటికీ దూరంగా ఉంటున్నది నలుపు.

ఒక తరగతి ప్రజలకు భాషను దూరం చేసి, ఆలోచన లేకుండా చేసి, భావాన్ని అందకుండా చేసి ఊహాలోకాల్లోకి మాయా లోకాల్లోకి లాక్కొని వెళ్లిపోవటం నేటి పాలకులకు అవసరం. ఆ పనిని చాల పత్రికలు చాల విశ్వాసంతో పనిచేస్తున్నాయి. ఇటువంటి పత్రికలు, సినిమాలు పాఠకున్ని, ప్రేక్షకుణ్ణి ఆలోచించనీయకుండా ఒక మత్తులో ముంచెత్తు తుంటాయి. ఆ మత్తునే కోరుకొనేలా చేస్తాయి. అంతేకాని తన చుట్టూ ముళ్లకంచెలా పేరుకుపోతున్న, ఉరితాడులా బిగుసుకుపోతున్న సమస్యలు ఏమిటో తెలుసుకొని వాటికి పరిష్కారం ఆలోచించే ప్రయత్నం మాత్రం చేయనివ్వటంలేదు. ఈ ప్రయత్నం జరగకుండా ఉండటం పాలకులకు అవసరం. అందుకనే పాలకవర్గం పత్రికలు నడుపుతుంది, సినిమాలు తీస్తుంది. వీటికి పోటీగా ప్రజలు కూడా కొన్ని పత్రికలు నడుపుతుంటారు. అందుకనే అన్నీ విడిపోయినట్టు పత్రికలూ విడిపోయాయి. కొన్ని పాలకవర్గంవైపు, కొన్ని ప్రజలవైపు.

ప్రజలవైపున నిలిచిన పత్రిక నలుపు. నలుపు నిలబడటం ప్రజల విజయానికి పట్టుదలకూ నిదర్శనం. నలుపు నిలబడిందంటే ప్రజలు నిలబడ్డారన్న మాట. ప్రజలు గెలిచారంటే నలుపు గెలిచిందన్నమాట. ప్రజలకు గెలుపు అవసరం. అందుకు నలుపును ఆదరిస్తూ మీమధ్య ఉంచుకుంటున్నందుకు మరోసారి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.



ఇది డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ శతజయంతి సంవత్సరం. అంటే అంబేద్కర్ పుట్టి వచ్చేఏడాదికి వంద సంవత్సరాలు అవుతుంది. ''బాబాసాహెబ్'' అని ఎంతో అప్యాయంగా పిలుచుకొనే అంబేద్కర్ శతజయంతిని ప్రజలు ఎంతో ఘనంగా జరుపుకోవటానికి సన్నాహాలు చేసుకుంటున్నారు. ప్రభుత్వం కూడా జరుపుతుందో లేదో చూడాలి. డాక్టర్ అంబేద్కర్ పుట్టి వందో ఏడు నడుస్తున్న సందర్భంలో ఒకసారి డాక్టర్ అంబేద్కర్ కృషి, ఆయన ఆశయాలు, కోర్కెలు, సిద్ధాంతాలు, ప్రణాళికలు, ఆశలు ఆకాంక్షలు- వీటన్నిటిని వెనక్కి తిరిగి చూసుకోవలసిన సమయం ఇదే అనుకుంటాను.

ఆయన ఏమి జరగాలనుకున్నాడో, ఎలా జరగాలనుకున్నాడో తలచుకొని, ఇపుడేం జరుగుతున్నదో, ఎలా జరగటం లేదో చూసుకుంటే ఎక్కడ లోపం జరుగుతున్నదో అర్థం అవు తుంది. అపుడు దానిని పూరించుకోవ టానికి లేదా సరిదిద్దుకోవటానికి అవకాశం దొరుకుతుంది.

డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ అంటే అందరికీ అర్థమయేది ఆయన అంటరాని కులంలో పుట్టాడని, కాదంటే దళిత నాయకుడు అని, కొంతమందికి ఆయన నవభారత రాజ్యాంగ నిర్మాతగా పరిచయం అవుతాడు. అయితే ఈ దేశానికి రాజ్యాంగం రాసినాయన అనుకుంటారు. మరికొంతమందికి ఈయన ఒక సాంఘిక సంస్కర్తగా కనిపిస్తాడు. ఇంకొంతమందికి ఈయన సామాజిక విప్లవకారుడుగా కనిపిస్తాడు. వేరే మందికి ఒక న్యాయవాదిగా, న్యాయశాఖా మంత్రిగా కనిపిస్తే మరికొంత మందికి మంచి రచయితగా కనిపిస్తాడు. కొంత మందికి హిందూ మతాన్ని సంస్కరించటానికి ప్రయత్నించిన వ్యక్తిగా కనిపిస్తే మరికొంతమందికి ఆ మతాన్ని తిరస్కరించిన నవబౌద్ధునిగా కనిపిస్తాడు. కొంతమందికి విగ్రహాలను, ఛాందసాన్ని పగలగొట్టే తిరుగుబాటు దారునిగా కనిపిస్తే, మరికొంతమందికి అంటరానితనం నుంచి తన ప్రజలను స్వేచ్ఛలోకి నడిపించిన మోజెస్‌లా కనిపిస్తాడు. కొంతమందికి కులాలు పోయి అందరూ సమానులు కావాలని ఆశించే ఒక మానవతా వాదిగా కనిపిస్తాడు. కొంత మందికి బ్రిటిషు ఏజెంటులా కనిపిస్తే మరికొంత మందికి గొప్ప దేశభక్తుడిలా కనిపిస్తాడు. కొంత మందికి ఏవో పాక్షికమైన ప్రయోజనాల కోసం పోరాటం చేసిన వ్యక్తిలా కనిపిస్తే మరికొంత మందికి మొత్తం సమాజాన్ని సమూలంగా పెకలించి వేసి నూతన సమాజాన్ని నిర్మించాలని ప్రయత్నం చేసిన ఒక ద్రష్టగా కనిపిస్తాడు. అందరి దారి వేరు అంబేద్కర్ దారి వేరు.

భారతదేశ రాజకీయాలలో అంబేద్కర్ స్థానమేమిటో పరిశీలకులు గుర్తించలేదు. ఆయన గురించిన సరైన పరిశీలన పరిశోధనాలేదు. ఆయన కృషిని సరిగ్గా అంచనా వేయటానికి కూడా ప్రయత్నించలేదు ఎవరూ. ఆయనకు ఇవ్వవలసిన స్థానం భారత దేశం ఇవ్వలేదు. ఆయన గురించి పరిశోధన చేస్తే భారతదేశం గురించే పరిశోధన చేసినట్టు అవుతుందని చాలమంది అనుకోలేదు. ఆయన సూచించిన మార్గాలను అనుసరిస్తే భారత దేశంలోని జాడ్యానికి మందు దొరికినట్లే అని చాలమంది అనుకోలేదు. ఆయన్ను సరిగ్గా ఎవరూ పట్టించుకోలేదు. కావలసి కొందరు ఆయన గురించి తలంచలేదు, మరికొందరు పక్కకునెట్టేశారు. దానికి కారణం ఒకటే- అది ఆయన పుట్టిన కులం. ఆ కులంలో కాకుండా వేరే కులంలో పుట్టి ఉండి ఉంటే అంబేద్కర్ చరిత్ర మరోలా ఉండేది. కులాలపట్ల సమాజం పెంచుకున్న ఏహ్యభావమే ఆయనలోని గొప్పతనాన్ని గుర్తించలేకపోయింది.

ఏ వ్యక్తి గురించి అయినా సరే అంచనా వేయవలసి వచ్చినపుడు ఆనాటి సాంఘిక పరిస్థితులను పరిశీలించకుండా ఒక సరియైన నిర్ణయానికి రాలేము. అందులోనూ భారతదేశం లాంటి దేశంలో ఇది మరీ అవసరం. మనిషి ప్రతిభను ఈ దేశంలో అతను సాధించిన దానిని బట్టికాక, అతను అందుకున్న స్థాయిని కాక అతను పుట్టిన కులంతో కొలవటం జరుగుతున్నది కాబట్టి ఈ నిచ్చెనమెట్ల సమాజంలో పైకి వెళ్ళే కొలదీ పూజ్యభావమూ, క్రిందికి వెళ్ళే కొలదీ ఏహ్యభావమూ కలుగుతూ ఉంటుంది. తన కవిత్వంలోని గొప్పతనాన్ని ప్రతిభాపాటవాన్ని చూసి మెచ్చుకొని ''సెభాష్'' అంటే తలలూపిన వాళ్ళే తనదే కులమో తెలుసుకున్న తర్వాత అక్కడ ఉంచి లేచి వెళ్ళిపోయినపుడు తనకు గుండెల్లో లాకుతో కుమ్మినట్లవుతుందని జాషువా కవి వెలిబుచ్చిన బాధను ఇక్కడ మనం గుర్తుంచుకోవాలి.

గాంధీ కూడా అంబేద్కర్ చాలకాలం వరకూ తనలానే ''అగ్రకులంలో పుట్టి అంటరాని వారికోసం సానుభూతితో ఏదో పనిచేస్తున్నాడు పాపం'' అనుకున్నాడు. అంబేద్కర్ ఫలానా అని తెలియగానే ఆయన పద్ధతి మారిపోయింది. అప్పటివరకూ ఉన్న మంచి అభిప్రాయమూ, మెచ్చుకోలు కాస్తా తగ్గిపోయింది. వాస్తవానికి అంబేద్కర్ కృషిని చూస్తూ ఆయన ఫలానా కులంవాడు అని తెలియగానే ఆయనపట్ల అభిప్రాయం పదిరెట్లు పెరగాలి కాని దిగిపోకూడదు. కాని భారతదేశంలో అలా జరగలేదు, పైగా వందరెట్లు కిందికి జారిపోతుంది.

అదే విధంగా ఇతర నాయకులతో పోల్చి చూసినపుడు వారు ఏఏ సాంఘిక పరిస్థితుల్లో నాయకులు

# డా॥ బి. ఆర్. అంబేద్కర్ - ఒక పరిశీలన

కాగలిగారో, ఎటువంటి పరిస్థితులు వారికి దోహదం చేశాయో, సహకరించాయో, ఎత్తి లేపాయో తెలుసుకున్నప్పుడు అంబేద్కర్ పట్ల గౌరవం ఇంకా పెరుగుతుంది. సహకరించే ఏ పరిస్థితీ లేకుండా ఆ స్థితికి చేరటం పైగా ప్రతికూల పరిస్థితులను జయించుకుంటూ రావటం చూస్తే ఆయన్ను కొనియడకుండా ఉండలేము.

గాంధీ భారతదేశానికి రావటమే ఒక 'హీరో' (కథానాయకుడు) లా వచ్చాడు. దక్షిణాఫ్రికాలో తెల్లదొరలకు వ్యతిరేకంగా సత్యాగ్రహం చేసి వారిని గజగజలాడించాడని కథలు కథలుగా చెప్పుకున్నారు. ఆ కృషి ఆయన చేయలేదని కాదు, ఆయనకు ముందుగానే ఆయన కీర్తి భారతదేశంలో వ్యాపించి ఉన్నదని చెప్పటమే దీనిలో ఉద్దేశం. ఆయన స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించినపుడు ఆయనకు అన్నివిధాలా సహాయం చేయటానికి ఎంతో మంది ముందుకు వచ్చారు. ఆర్థిక సహాయం అందచేయటానికి బిర్లా ఉండనే ఉన్నాడు. ఆయన్ని మహాత్ముణ్ణి చేసి దేశమంతా తిప్పటానికి కావలసినంత శిష్యగణం ఏర్పడి ఉన్నది. రాజకీయంగా తిరుగులేని పట్టును సంపాదించాడు. అన్నిటికి మించి ఆయన్ను కీర్తించే పత్రికలు ఉన్నాయి. ఆయనకు తోచిందే నిర్ణయం, అది అమలు జరిగితీరాల్సిందే. పెద్ద పెద్ద రాజకీయ నాయకులు, పెద్ద పెద్ద భూస్వాములు, జమీందార్లు, ఇంకా పెద్ద పారిశ్రామిక వేత్తలు ఆయన వెంట ఉంటే సామాన్య జనం ఆయనకు నీరాజనం పట్టక ఏం చేస్తుంది?

ఇక నెహ్రూ అయితే కాంగ్రెసు పార్టీలోకి యువరాజుగా ప్రవేశించాడు. అప్పటికే పెద్ద పలుకుబడి సంపాదించాడు ఆయన తండ్రి మోతీలాల్. పైగా విపరీతంగా డబ్బు కూడా గడించాడు. గాంధీ అయితే ఆయన్ను తన వారసుడిగా ప్రకటించుకున్నాడు. భావి ప్రధాన మంత్రిగా జనానికి ఆయన్ను పరిచయం చేస్తూ వచ్చారు. నెహ్రూ పట్ల ఏ వ్యతిరేకత వచ్చినా గాంధీ సహించేవాడు కాదు, గాంధీ సహించటం లేదంటే దేశమంతా సహించనట్టే అని అనుకొనేవారు. ఆఖరికి ప్రత్యర్థి నాయకత్వాన్ని కూడా సహించలేకపోయారు. పట్టుపట్టి సుభాష్‌చంద్రబోస్‌ని ప్రత్యామ్నాయంగా రానీయకుండా చేసి, ఆయనకు కాంగ్రెస్ పార్టీలో ఊపిరాడనీయకుండా చేసి ఆయన బయటకు వెళ్ళి పోయేటట్టు చేశారు. కులమూ, ధనబలమూ, పలుకుబడీ గాంధీ ఆశీస్సులు నెహ్రూకు పెట్టని కోటలయ్యాయి. స్వతంత్రం వచ్చిన తర్వాత ప్రధాని కాక ఏమవుతాడు?

ఈ నేపథ్యంలో అంబేద్కర్‌ని పరిశీలిద్దాం. గాంధీకి లేదా నెహ్రూకు ఆ మాటకు వస్తే దాదాపు అందరు రాజకీయ నాయకులికి దొరికిన ప్రోత్సాహమూ, పునాది బలమూ, నవాకార ప్రోత్సాహాలు ఏవీ అంబేద్కర్‌కి లేవు. అంతేకాదు, వారికెవ్వరికీ లేని అనర్హతలు ఈయనకు ఉన్నాయి. మొదటిది - ఆయన అంటరాని కులంలో పుట్టడం. రెండోది - కులవ్యవస్థకు, హిందూమతానికి వ్యతిరేకంగా ఆయన జరిపిన పోరాటం. మూడోది - కాంగ్రెస్ పార్టీని, గాంధీని వ్యతిరేకించటం. నాలుగోది - డబ్బు లేకపోవటం. అయిదోది - ఆయన్ను అర్థం చేసుకొని, అనుసరించే కార్యకర్తలు లేకపోవటం. ఆరోది - బ్రాహ్మణీయతపై ఆయన జరిపిన పోరాటం. ఏడోది - పత్రికలతో ఆయన పోరాటం.

ఇన్ని వ్యతిరేకమైన శక్తుల మధ్య అంబేద్కర్ ఒక్కడూ ఏకైక పోరాటం చేసి ఆ స్థాయికి వచ్చాడని తెలిసినపుడు సహజంగానే ఆయన మీద గౌరవం పెరుగుతుంది. మామూలుగా అందరూ సంపాదించుకున్న అర్హతలు లేకపోవటమే కాకుండా ఎవరి విముక్తి కోసమైతే తాను పోరాటం చేస్తున్నాడో వారి చేతనే "అంబేద్కర్ మా నాయకుడు కాద"ని చెప్పించారు. మరోపక్క దేశంలో "అంబేద్కర్ బ్రిటిషు ఏజెంటు"ని ప్రచారం చేయించారు. అంబేద్కర్ ఎంత ఆవేదన చెంది ఉంటాడో ఒకసారి ఆలోచించండి.

అంబేద్కర్ కాలంనాటి సామాజిక పరిస్థితులను పరిశీలిస్తే ఎంత ప్రతికూలమైన వాతావరణంలో ఆయన పోరాటం చేయవలసి వచ్చిందో మనకు తెలుస్తుంది. ఆయన పుట్టిన కులం అంటరాని కులం అని చెప్పుకున్నాం. ఆనాటి పరిస్థితి ఎలాంటిదంటే అంటరానివారు మూతికి ముంత, ముడ్డికి అమ్ కట్టుకొని తిరగాలి. వారిని బహిరంగ ప్రదేశాల్లో అందరిలా తిరగనిచ్చే వారుకాదు. ఊరవతల వారి నివాసం. ఆస్తిపాస్తులు ఉండటానికి వీల్లేదు, అవకాశం లేదు. చదువు సంధ్యలు లేవు. చెరువుల్లో బావుల్లో నీళ్లు తీసుకొనిచ్చేవారు కాదు. వాహనాలలో ప్రయాణించటానికి వీల్లేదు. ఒకరకమైన వస్త్ర ధారణ చేయాలి. ఒక్క మాటలో చెప్పాలంటే వారిని మనుషులుగా చూసేవారు కాదు. అటువంటి అనర్హతలు, అయోగ్యతలు కలిగిన సామాజిక స్థాయినుంచి ఆయన వచ్చాడు.

డాక్టర్ అంబేద్కర్ తండ్రి మిలటరీ సర్వీసులో ఉద్యోగం చేసి ఉండటం వల్ల తన కొడుకును చదివించుకోవాలనుకున్నాడు. ఎంతో పట్టుదలతో, ఎన్నో కష్టాలు కోర్చి ఎన్నో బాధలు పడి, డబ్బుకోసం ఎంతో అవస్థపడి కొడుకును చదివించాడు.

అంబేద్కర్‌కు చిన్నతనంలో నుంచే ఎన్నో చేదు అనుభవాలు ఎదురయ్యాయి. అయన్ను పాఠశాలలో తరగతి గదిలో విద్యార్థుల సరసన కూర్చోనిచ్చే వారు కాదు. ఎడంగా ఒక్కడూ కూర్చుని ఉండాలి. ఉపాధ్యాయుడు అయన్ని తాకేవాడు కాదు, అఖరికి బెత్తం మైలపడి పోతుందని కొట్టేవాడు కాదు. పిల్లలు కూడా అయన తాకితే మైలపడి పోతామని దూరందూరంగా ఉంటూ దగ్గరకు రానిచ్చేవారు కాదు. మంచి నీళ్లు అందరిలో తాగనిచ్చేవారు కాదు, దాహంతో ఒక రోజు ఒక తల్లిని మంచి నీళ్లు అడిగితే ఆమె చెంబుతో నీళ్లు తెచ్చి నీళ్లు అడిగిన వాడు అంటరాని కులం అని తెలియగానే నీళ్లు వెనక్కి పట్టుకెళ్ళి పోయి మురికి గుంటలో ఉన్న నీళ్లు తాగమని చూపించింది. ఆ సన్నివేశం పసివాని హృదయంలో ఎంతో తీవ్రమైన ముద్రవేసి ఉంటుందో మనం ఊహించుకోలేం. అలాగే, మరొకసారి అంబేద్కర్ తన అన్నతో కలిసి సెలవులకు ఇంటికి వెళ్తూ బండి బాడుగకు అడిగి ఎక్కి కూర్చున్నారు. కొంచెం దూరం పోయాక వారు అంటరాని వారని తెలియగానే బండి నుంచి వారిని కిందికి నెట్టేశాడు. ఇది కూడా అంబేద్కర్ మనసుపై చెరగని ముద్ర వేసి ఉన్నది.

ఎన్నో కష్టాలు పడి, ఎన్నో అవమానాలు భరించి చదువుకొని బరోడా మహారాజు ఇచ్చిన స్కాలర్ షిప్పుతో విదేశాలకు వెళ్లాడు చదువుకోవటానికి. ఉన్నత విద్య సంపాదించి తిరిగి భారతదేశం వచ్చే సరికి మళ్లీ అదే పరిస్థితి. బరోడా మహారాజు కొలువులో ఉన్నత పదవిని చేపట్టినా నాల్గోతరగతి ఉద్యోగి అయనకు ఫైళ్లు తీసుకువెళ్లి ఇచ్చేవాడు కాదు, టేబులుపైకి విసిరేవాడు. అఫీసులో తాగటానికి మంచి నీళ్లు దొరికేవి కాదు. ప్రత్యేకంగా ఒక కూజ (సురాయి) ఉంచేవారు. అఖరికి ఆయనకు ఉండటానికి ఇళ్లు లేకుండా చేశారు. అవమానాలమీద అవమానాలు వచ్చి పడుతుంటే ఆయన అలోచించాడు. దీనికి ముక్తి మార్గం ఏమిటని. ఇక్కడే అంబేద్కర్ అద్భుతమైన పాత్ర వహించింది. ఒక వ్యక్తిగా తాను విముక్తి పొందే కంటే తను పుట్టిన సమాజానికి విముక్తి కలిగించలేనా? అని ఉద్యమం చేపట్టాడు. ఒక వ్యక్తిగా తాను విముక్తుణ్ణి అవ్వటం కంటే మొత్తం సమాజానికి విముక్తి కలిగించాలని ఆయన ధ్యేయం. అదిశలోనే ఆయన జీవితమంతా పోరాటం సలిపాడు.

ఈ వాతావరణంలో సమాజంలో ఉన్న దుర్మార్గ పద్ధతిని, అణచివేతను సాక్షాత్తు పరిశీలించాడేమో, చాల దగ్గరగా కూర్చుని ఆ వ్యవస్థను అంచనా వేశాడేమో చాల స్పష్టంగా ఈ వ్యవస్థను అర్థం చేసుకున్నాడు, పరిష్కారం కూడా అలోచించి పెట్టాడు. తనను నెన్నంటి వస్తూ ఉన్న ఈ అవమానాన్ని వివిధంగా హతమార్చాలో నిర్ణయం చేసుకొనే ఉన్నాడు. తను అనుభవిస్తున్న అన్ని అవమానాలకూ కుల వ్యవస్థ ఒకటే కారణమనుకున్నాడు. మొత్తం భారత జాతినే ఒక జాతిగా కాకుండా చీల్చి నడిపిస్తున్నది ఈ కులవ్యవస్థ అని కూడా ఆయన గ్రహించాడు.

భారతదేశంలోని సామాజిక అర్థిక పరిస్థితిని అర్థం చేసుకోవటానికి కావలసిన పరిశోధనలు చేశాడు. పరిశోధనాసారాన్ని పుస్తకాలుగా రాశాడు. ఆయన ఎంచుకున్న విషయాలు కూడా చాల క్లిష్టమైనవి. "అంటరాని తనం అంటే ఏమిటి? వారు అంటరానివారెలా అయ్యారు?" అనేవి, శూద్రులెవరు? కులనిర్మూలన, పాకిస్థాన్ చాల ముఖ్యమైన గ్రంథాలు, ఏ భారత రచయిత కూడా సాహసించని అంశాల మీద పుస్తకాలు రాశాడాయన. "కాంగ్రెసు- గాంధీ అంటరాని వారికోసం ఏమి చేశారు?" అనే గ్రంథం అప్పటి రాజకీయ రంగంలో పెద్ద సంచలనాన్ని రేపింది. ఆ పుస్తకాన్ని ఖండిస్తూ రాజగోపాలచారి మరో 'పుస్తకం రాయాల్సి వచ్చింది. భారతదేశంలోని రచయితలు సామాజిక శాస్త్రవేత్తలు "కులం" గురించి పరిశోధనలు చెయ్యలేదు, పుస్తకాలూ రాయలేదు. కులం పుట్టుపూర్వోత్తరాల గురించి పాశ్చాత్యులు పరిశోధన చేసి పుస్తకాలు రాశారు తప్ప భారతీయులు మాత్రం ఎవరో ఒకరో ఇద్దరో తప్ప - ఎక్కువ మంది కృషి చేయలేదు. అందులో 'అంటరానితనం' గురించి అలోచించిన వారే లేరు. అంటరాని తనం ఎలా వచ్చింది? ఎప్పుడొచ్చింది?' అని పరిశీలించినవారే లేరు. అదేదో చాలా సహజమైన విషయంగా, అందులో పరిశీలించ వలసిన విషయం ఏమీ లేనట్టుగానే పరిశోధకులు, ప్రవర్తించారు. డాక్టర్ అంబేద్కర్ ఒక్కడే 'అంటరానితనం' గురించి పరిశోధన చేసి దాని మూలంలోకి వెళ్లి దాని కాలాన్ని నిర్ణయించాడు. అదే విధంగా కుల వ్యవస్థ దాని పుట్టుక, నిర్మాణం గురించి పరిశోధనా వ్యాసం రాశాడు. కుల వ్యవస్థకు వ్యతిరేకంగా మా అంటరానితనం నిర్మూలనకూ మహాత్మా జోతిరావ్ పూలే అద్భుతమైన కృషి చేశాడు. ఆయనా ఒక్కడే. ఆయనదీ ఒంటరి పోరాటమే. దాని నుంచి స్ఫూర్తిని తీసుకొని డాక్టర్ అంబేద్కర్ కుల నిర్మూలన కోసం కృషి చేశాడు. దానికి కొంచెం ముందుకు వెళ్లి శాస్త్రీయమైన, చారిత్రకమైన అధారాలు తీశాడు.

## కులవ్యవస్థ — అంటరాని తనం

ఈ రెండు విషయాలనూ పరిశీలించేటపుడు మనకు ఇద్దరు వ్యక్తులు గుర్తుకు వస్తారు. ఒకరు గాంధీ మరొకరు అంబేద్కరు. భారత దేశంలో అయితే అంటరానితనం గురించి మాట్లాడేటపుడు ఒక గాంధీయే గుర్తుకొస్తాడు. అంబేద్కరు చాలమందికి గుర్తుకురాడు. ఈ విషయంపై వీరిద్దరిలో చాల ప్రధానమైన తేడా ఉన్నది. అంటరాని తనానికి మూలం కులవ్యవస్థ అన్నాడు అంబేద్కర్ అంటరానితనం పోవాలంటే కులవ్యవస్థ కూలిపోవాలి అన్నాడాయన. గాంధీ అలాక్కాదు. అంటరాని

తనం వేరు కులం వేరు అన్నాడు. అంటరాని తనం పోవాలి కాని కులం మాత్రం ఉండాలన్నాడు గాంధీ. 'చెడు వాసన పోవాలంటే పెంట తీసెయ్యా' లన్నాడు అంబేద్కర్. 'పెంట అలానే ఉండాలి చెడువాసన పోగొడదాం, కొంత ఫినాయిల్ చల్లండి' అన్నాడు గాంధీ. ఇది వీరిద్దరికీ ఉన్న తేడా. పైగా కుల వ్యవస్థ చాల మంచిది అన్నాడు గాంధీ. శాస్త్రీయమైన ఏర్పాటు అన్నాడు. దీనివలన సమాజానికి ఎంతో మేలు జరుగుతున్నదన్నాడు. అంబేద్కర్ అలాకాదు. కులవ్యవస్థ చాల హానికరమైనది అన్నాడు. మనుషులు ఒకరి నొకరు కలవకుండా చీల్చి వేస్తున్నది, మానవత్వాన్ని హరించి వేస్తున్నది, భారతీయులంతా ఒక జాతిగాఆవిర్భవించటానికి పరిణతి చెందటానికి అడ్డం వస్తున్నది అంటాడాయన.

కులవ్యవస్థలో కేవలం కులాలు ఉండటమే కాదు. అందులో వ్యత్యాసం ఉన్నది. హెచ్చు తగ్గులున్నాయి. ఉచ్చనీచ భావాలున్నాయి. పైకి వెళ్ళే కొలదీ పూజ్యభావము, కిందికి వచ్చే కొలదీ అసహ్యభావమూ కలిగిస్తుంది అన్నాడు అంబేద్కర్. ఈ నిచ్చెన మెట్ల వ్యవస్థ నిలవునా సమాజాన్ని చీల్చేసింది అంటాడు.

భారత దేశంలోని కమ్యూనిస్టులు, సోషలిస్టులూ గమనించని ఒక గొప్ప విషయాన్ని డాక్టర్ అంబేద్కర్ గమనించాడు. ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ శ్రమవిభజన మాత్రమే ఉన్నది, భారతదేశంలో మాత్రం శ్రామికుల విభజన ఉన్నది అని చెప్పాడు. ఈ శ్రామికులను కులం విభజించి వారు ఏకం కాకుండా చేస్తున్నది. భారతదేశంలో శ్రామికులంతా ఒక వర్గంగా ఏర్పడ లేకపోవటానికి ఈ కులం అడ్డం వస్తున్నది. కాబట్టి దానిని ముందు నిర్మూలించాలి అని చెప్పాడు.

## పోరాటాలు

భారతదేశంలో అంటరానివారు అందరిలా మంచినీరు తాగే హక్కు లేదు. అందరికీ మంచినీరు తాగే హక్కు ఉన్నపుడు అంటరాని వారికెందుకు ఉండకూడదని "మహద్ చెరువు" పోరాటం సాగించాడు. వేలాది మంది అంటరాని వారిని మహద్ గ్రామంలో ఉన్న మున్సిపల్ చెరువు దగ్గరకు నడిపించి వారిచేత నీళ్లు తాగించాడు. ఏదో అమృతాన్ని తాగుతున్న అనుభవం ఆనాడు అంటరాని వారికి వచ్చిందని అంటారు. దేవాలయాలలోకి కూడా అంటరాని వారిని రానీయరు. విచిత్రమేమంటే అంటరాని తనం దేవుళ్లకు కూడా అంటించారు. అగ్రకులాలకు ఒక దేవుడు, అంటరాని వారికి మరొక దేవుడు. అగ్రకులాలకు ఒక దేవత, అంటరాని వారికి మరొక దేవత. అగ్రకులాల దేవుళ్లకు ఒక రూపమూ, అంటరాని వారి దేశుళ్ళకు మరొక రూపమూ. దేవుణ్ణి దర్శించుకొనే హక్కు మానవులందరకూ ఉన్నప్పుడు అంటరాని వారికి ఎందుకు ఉండకూడదని కాలారాం దేవాలయ పోరాటం చేశాడు. వేలాదిమంది స్త్రీలు పురుషులతో రోజుల తరబడి దేవాలయం ముందు బైఠాయింపు సమ్మె చేశారు. అంటరాని వారు వస్తున్నారని దేవాలయం తలుపులు మూసేశారు. దేవుడున్నాడా లేడా అనేది కాదు, ఒక మనిషిని లోపలికి రానివ్వాలి అనే సంస్కారం మీలో ఉన్నదా లేదా ఆలోచించుకోండి అని అగ్రకులాలకు ఒక సవాలు విసిరాడు. నేను జోక్యం కల్పించుకొని సమస్యను పరిష్కరిస్తానని పోరాటాన్ని విరమింపచేశాడు గాంధీ. కాని దానిని పరిష్కరించలేకనే పోయాడు. కాలారాం దేవాలయం తలుపులు అంటరానివారి కోసం తెరుచుకోలేదు. ఇప్పటికీ వేలాది దేవాలయాల తలుపులు అంటరాని వారికోసం మూసివేసే ఉంటాయి.

మనిషిగా బ్రతికే హక్కు అంటరానివారికి లేని సమాజంలో వారికి ఆర్థిక హక్కులూ ఉండవు, రాజకీయ హక్కులూ ఉండవు. దేశమంతా స్వతంత్రం కోసం పోరాటం చేస్తున్నపుడు అంబేద్కర్ ఒక్కడూ అంటరానివారికి మనిషిగా బ్రతికే హక్కు ముందు ప్రసాదించండి అని అడిగాడు. అధికారాన్ని భారతీయులకు అప్పగించి పోదాం అని బ్రిటిషువారు అనుకున్నపుడు రాజ్యాధికారంలో మా వాటా ఎంత అని ప్రశ్నించాడు. అధికారాన్ని హిందువులు, ముస్లింలు, పార్సీలు, తమలో తాము పంచుకుంటుంటే మరి మావాటా ఏదని అంటరానివారి తరఫున ప్రశ్నించాడు. అంటరాని తనం నిర్మూలన సమస్య వచ్చినపుడు ఈ సమస్యను మేము స్వతంత్రం వచ్చిన తర్వాత పరిష్కరించుకుంటాం, అని బ్రిటిషు వాళ్లతో చెప్పాడాయన. "వీరికి ప్రత్యేకమైన హక్కులు, ప్రత్యేకమైన వాటా అవసరం లేదు, వీరు హిందువులలో భాగమే, వారికీ నేను ప్రాతినిధ్యం వహిస్తున్నాన" న్నాడు గాంధీ. మరి మేము హిందువులలో భాగమయితే మమ్మల్ని ఎందుకు ముట్టుకోరు? మమ్మల్ని మీ గుడుల లోనికి ఎందుకు రానీయరు? మీ బావులు, చెరువులు ఎందుకు ముట్టనీయరు?" అని ఎదురు ప్రశ్న వేశాడు అంబేద్కర్. దానికి సమాధానమే గాంధీ లేవదీసిన "హరిజనోద్ధరణ". అంటరానితనం నిర్మూలించే వరకూ స్వరాజ్య పోరాటం వాయిదా వేస్తాను అని ప్రకటించాడు గాంధీ. అన్ని దేవాలయాల తలుపులు తెరవండి" అని ఆజ్ఞాపించాడు. పాడుపడిపోయి, ఎవరూ సందర్శించని దేవాలయం తలుపులు తెరిచారు. అంటే అంటరాని తనం పోయింది, స్వరాజ్యం మాకిచ్చేయండి అన్నాడు గాంధీ. ఇందులోని మోసాన్ని ఒక్క అంబేద్కరే బయటపెట్టాడు. రౌండ్ టేబుల్ సమావేశాల్లో గాంధీతో ఢీకొని అంటరాని వారికి రాజకీయ హక్కులు కావాలన్నాడు. అంటరానివారికి ప్రత్యేక నియోజకవర్గాలు కల్పించి, వారి ప్రతినిధులను వారే ఎన్నుకొనే పద్ధతికి బ్రిటిషు ప్రధానమంత్రి చేత ఒప్పించాడు. కాని గాంధీ దానికి ఒప్పుకోలేదు. అవసరమైతే ప్రాయోపవేశం చేస్తాను గాని దీనికి ఒప్పుకోనన్నాడు గాంధీ. అంటే అవసరమైతే చావనన్నా చస్తాను కాని అంటరాని వారికి రాజకీయ హక్కులు కల్పించటానికి ఒప్పుకోను అన్నాడు గాంధీ. బ్రిటిషువారు చివరకు అంటరాని వారికి రాజకీయ హక్కును కల్పించటానికి సూత్రప్రాయంగా అంగీకరిస్తే

నిజంగానే గాంధీ అమరణ నిరాహార దీక్షకు పూనుకున్నాడు. గాంధీ ఎన్నోసార్లు సత్యాగ్రహాలు చేశాడు. అమరణనిరాహారదీక్ష ఎప్పుడూ చెయ్యలేదు. అంటరానివారికోసం అసలు చెయ్యలేదు, కాని వారికి రాజ్యాధికారంలో కొంత వాటా లభించే సమయంలో మాత్రం దానిని రాకుండా చేయటానికి గాంధీ అమరణ నిరాహార దీక్షకు తలపడ్డాడు. మొదట్లో "నన్ను దగ్గర ఉన్న దీపస్థంభానికి ఉరి తీయండి కాని నా ప్రజల హక్కుల విషయంలో రాజీపడను" అని డాక్టర్ అంబేద్కర్ అన్నాడు కాని గాంధీ చచ్చిపోతాడని, అతని ప్రాణాన్ని కాపాడమని దేశంలో అనాటి రాజకీయ నాయకులందరూ అంబేద్కర్‌ని కోరినపుడు మానవతా దృష్టితో గాంధీ ప్రాణాలు కాపాడాడు, తన ప్రజలకు దొరికిన రాజకీయ హక్కుల విషయంలో కొంత రాజీ పడ్డాడు.

స్వాతంత్రం రాబోతున్నదన్న సందర్భంలో రాజ్యాధికారం ఎలా ఉండాలి అని పథకాలు వేస్తున్న సందర్భంలో భారతదేశానికి ఒక రాజ్యాంగాన్ని అంబేద్కర్ రూపకల్పన చేశాడు. అదే "స్టేట్స్ అండ్ మైనారిటీస్" అనే గ్రంథంగా తర్వాత బయటకు వచ్చింది.

డాక్టర్ అంబేద్కర్‌ని నవభారత రాజ్యాంగ నిర్మాతగా కీర్తిస్తారు గాని నవభారత రాజ్యాంగ రచనా సభకి మాత్రం మొదట్లో ఆయన ఎన్నిక కాకుండా ఓడించింది కాంగ్రెస్ పార్టీ బెంగాల్ నుంచి ముస్లింల మద్దతుతో రెండోసారి ఎన్నికయ్యాడు. రాజ్యాంగ రచన సందర్భంలో మరుగుతున్న చర్చల్లో పాల్గొన్నపుడు ఆయనకున్న అపారమైన ప్రజ్ఞాపాటవాలు ప్రతిభా విశేషాలు బయటపడ్డాయి. ఇక ఆయనను ఎవరూ ఆపలేకపోయారు. పిలిచి రాజ్యాంగ రచనను అప్పగించారు. అయితే ఆయన ఆశించిన విధంగ రాజ్యాంగాన్ని రచించనివ్వలేదు. ఆపని ఆయన ఎంతో అయిష్టంగానే చేశాడు. ఆస్తి హక్కు ప్రాథమిక హక్కుగా ఉండకూడదని ఆయనవాదం. అదే విధంగా పనిచేసే హక్కు ప్రాథమిక హక్కుగా ఉండాలని ఆయన వాదం. ఈ రెండింటినీ నెహ్రూ నాయకత్వంలోని ప్రాథమిక హక్కుల ఉపసంఘం అంగీకరించలేదు. అదే విధంగా ఇతర అంశాలు చాలా. అయితే తను కావాలని కోరుకున్న సిద్ధాంతలను రెండింటిని రాజ్యాంగంలో ఆయన పెట్టగలిగాడు ఒకటి "స్వాతంత్రం-సమానత్వం-సౌభ్రాతృత్వం" అనే త్రిసూత్రాల ప్రాతిపదికను రాజ్యాంగ పునాదికి జోడించటం, రెండోది అంటరానితనాన్ని నిర్మూలించటం, ఏ రూపంలో దానిని పాటించినా దానిని శిక్షార్హం చేయటం.

తన సిద్ధాంతాలను అంగీకరించరని తెలిసే తాను ఆశించిన రాజ్యాంగాన్ని ముందే రాసి పెట్టుకున్నాడు. అందులో ముఖ్యమైనది భూమి భారీ పరిశ్రమలు జాతీయ చేయటం, జీవిత భీమా జాతీయం చేయటం, భూమిని కమతాలుగా విభజించి ప్రభుత్వ యాజమాన్యంలో సేద్యం చేయించటం, నీరు, ఎరువులు ప్రభుత్వమే సరఫరా చేయటం. భూమిని జాతీయం చేయటమనే విప్లవాత్మకమైన ప్రతిపాదన అంబేద్కర్ చేశారు. ఒక స్పష్టమైన ఆర్థిక వాదాన్ని ఆయనస్టేట్స్ అండ్ మైనారిటీస్ అనే గ్రంథంలో చూపించాడు. అంత స్పష్టమైన సిద్ధాంతాలు ఆయననకు ఉన్నాయి కాబట్టే ఆస్తిని ప్రాథమిక హక్కుగా ఉంచకూడదని పోరాటం చేశాడు. చివరకు ఒక మాట అన్నాడు ఆయన "ఆస్తిహక్కు ప్రాథమిక హక్కుగా ఉంచటవల్ల ఈ రాజ్యాంగం పెద్ద తిరోగమనమైనటు వంటిదయింది. అందుకు దీనిని కాల్చే వాడిలో నేను మొదటి వాణ్ణవుతాను" అని

## హిందూమత సంస్కరణ

హిందూ మతాన్ని సంస్కరించాలని డాక్టర్ అంబేద్కర్ చాల ప్రయత్నించాడు. హిందువులకు తమ మతాన్ని బాగు చేసుకోమని చాల సూచనలు కూడా చేశాడు. అయితే ప్రాథమికంగా హిందూమతం అసమానతపై ఆధారపడి ఉండటం వల్ల అది సాధ్యం కాలేదు. మానవత్వ వికాసానికి దోహదం చేసే అంశాలు అందులో చాల తక్కువగా ఉన్నాయని గ్రహించాడు. ముఖ్యంగా వ్యక్తి జీవితానికి కుటుంబ వ్యవస్థకు, స్త్రీ జీవితానికి, కులవ్యవస్థకు సంబంధించిన నియమాలలోని అమానుషత్వాన్ని, అసమానత్వాన్ని ఆయన గ్రహించాడు. అందుకే హిందూ చట్టాలను (ధర్మం పేరుమీద చెలామణీ అవుతున్న వాటిని) సవరించాలని ఆయన ఒక సమగ్ర పథకాన్ని "హిందూ కోడ్" పేరు మీద తయారు చేశాడు. వివాహాలకు సంబంధించి, స్త్రీ జీవన వికాసానికి సబంధించి, ఆస్తిలో స్త్రీకి హక్కుకు సంబంధించి ఎన్నో విప్లవాత్మకమైన మార్పులు ప్రతిపాదించాడు. హిందూ సమాజం అందుకు అంగీకరించలేదు. పైపై మెరుగులకు అందరూ అంగీకరించారు కాని మానవత్వాన్ని ప్రతిష్ఠించటానికి మౌలికమైన మార్పులు తీసుకు రావటానికి మాత్రం అంగీకరించలేదు. సమానతను సాధించటం హిందూ మతంలో సాధ్యం కాదని మానవత్వం సమానత్వం ప్రాతిపదికగా ఉన్న బౌద్ధమతం ఆయన స్వీకరించాడు.

## మానవతావాది

డాక్టర్ అంబేద్కర్ తన జీవితమంతా పోరాటం చేస్తునే ఉన్నాడు. అంటరానితనం పోవాలని, కులవ్యవస్థ నిర్మూలనకావాలని, మనుషులందరూ సమానంగా ఉండాలనీ, సాంఘికంగా ఆర్థికంగా దోపిడికి గురి అవుతున్న దళిత వర్గాలకు సాంఘిక ఆర్థిక సమానత్వంతో పాటు రాజ్యాధికారంలో సరియైన భాగం కావాలనీ ఆయన పోరాటం చేశాడు. పోగొట్టుకున్న హక్కుల్ని బిచ్చమెత్తిగాని బేరమాడి గాని సాధించలేమని ఆయన చేసిన హెచ్చరికలో పోరాటానికి ఆయన ఇచ్చిన ప్రాధాన్యం మనకు తెలుస్తుంది. ఎందరో సాంఘిక సంస్కర్తలు, మత గురువులు మానవుల పట్ల ప్రేమ, దయతో కొన్ని సంస్కరణలు తలపెట్టారు. ఎక్కువగా అవన్నీ పాక్షికమైనట్టివే. ఉదాహరణకు రాజా రామ్మోహన్‌రాయ్ తలపెట్టిన సతీ సహగమనం ఉద్యమం కులీన వంశస్థులైన స్త్రీలకు సంబంధించినది.

బ్రాహ్మణ, క్షత్రియ స్త్రీలు మాత్రమే సహగమనం చేసేవారు. వారి సమస్య దేశ సమస్యే అయినా చాల తక్కువ శాతానికి సంబంధించినది. కోట్లాది స్త్రీలకు ఆ సమస్యతో అసలు సంబంధమే లేదు. ఆ సమస్య మొత్తం స్త్రీ సమస్యతో ముడిపడి ఉండలేదు. అదే విధంగా బాల్యవివాహాలు, వితంతు వివాహా లకు సంబంధించిన ఉద్యమాలు. స్త్రీ విద్య కావాలని, ఆచార వ్యవహారాల పేరిట స్త్రీని హింసిస్తున్న విధానం పోవాలని, స్త్రీకి సమానహక్కు కావాలని మహాత్మా జ్యోతిరావ్ పూలే నడిపిన ఉద్యమం మొత్తం స్త్రీ జాతి విముక్తికి సంబంధించినట్టిది.

అదే విధంగా అంటరానితనం పేరిట నాగరికతకు సభ్య సమాజానికి దూరంగా వెలివేసి ఉంచిన మనిషిని, రోడ్ మీదికి తీసుకు వచ్చి అతనికి బట్టకట్టి, ఒక గుడిసె నిర్మించి, ఒక పని కల్పించి, ఇంత చదువు చెప్పించి, సమాజ నిర్మాణంలో, పరిపాలనా వ్యవహారంలో కొంత భాగం కల్పించి ఆ బానిసను మనిషిగా తీర్చిదిద్దాలనే ప్రయత్నం ఏదో పాక్షికమైనది కాదు, సంపూర్ణమానవ వికాసానికి సంబంధించినది. సమాజంలో ఏర్పడిన కుష్ఠును తొలగించటం రోగికి ఒక్కనికే కాదు మేలు చేయటం మొత్తం సమాజానికే మేలు. అదే విధంగా అంటరానితనం పోగొట్టటం, కుల నిర్మూలన గావించటం అనేది జరిగితే భారతీయులంతా నవమానవులవుతారు. ఉచ్చనీచ భేదాలుండవు, హెచ్చు తగ్గులుండవు, అది దేశానికి ఎంత మంచిది! ఈ దిశకేని అంబేద్కర్ పోరాటం చేశాడు.

అందుకనే అంబేద్కర్‌ని ఒక మానవతావాదిగా మనం చూడ గలుగుతాం. ఆయన సమాజంపై తిరుగుబాటు చేసినా, అంటరాని వారి హక్కుల కోసం పోరాటం చేసినా, హిందూమతాన్ని నిరసించినా, కాంగ్రెస్‌ని ఖండించినా, బ్రాంహ్మణీ యత మత మౌఢ్యాలపై తిరుగులేని పోరాటం చేసినా ఎగుడు దిగుడుల సమాజాన్ని సమం చేయటానికే అని మానవ మర్యాదకు దూరమైన కోట్లాది భారతీయులకు మానవ జీవితాన్ని అందించటానికే అని మనకు కనిపిస్తుంది. మహాత్ములు వచ్చారు, మహాత్ములు వెళ్ళిపోయారు. ధూళిరేపి వెళ్లిపోయారు గాని ఎగుడు దిగుడులను సమతలం చేయలేదు" అని ఆయన బాధపడ్డాడు. ఆయన జీవితమంతా ఈ ఎగుడు దిగుడులను సమం చేయటానికే! ఆయన పార తీసుకున్నా పలుగు తీసుకున్నా నేలను సమం చేయటానికే నూతన సృష్టి చేయటానికే తప్ప దేనినీ కేవలం ధ్వంసం చేయటానికి కాదు. "తత్వవేత్తలు ఇంతవరకూ సమాజాన్ని వ్యాఖ్యానిస్తూ వచ్చారు, మనం ఇపుడు చేయవలసింది సమాజాన్ని మార్చటం" అనే సూక్తిని డాక్టర్ అంబేద్కర్ అమలు చేయటానికి నిరంతరంగా కృషి సల్పాడు.

ఆయన మొత్తం కృషి ఫలితంగా ఒకటి మాత్రం అర్థం అయింది. భారతదేశాన్ని మార్చాలంటే అంబేద్కర్‌ని చదవకుండా అన్వయించకుండా మాత్రం సాధ్యం కాదనేది!

**బొజ్జా తారకం**

# సోషలిస్టు దేశాల్లో వస్తున్న పరిణామాలు కొన్ని - గుణపాఠాలు

**సో**షలిస్టు సిద్ధాంతము ఒక సంక్షోభాన్ని ఎదుర్కొంటున్న రోజులివి. రష్యా, చైనా, తూర్పు యూరపు దేశాల్లో వస్తున్న మార్పులు మార్క్సిజానికి ఒక అగ్ని పరీక్షను పెడుతున్నాయి. రష్యాలో గోర్బచేవ్ ముందుకు తెచ్చిన పెరిస్త్రాయికా, గ్లాస్ నాస్ట్ సూత్రాలు మార్క్సిజానికి పదును పెట్టబోతున్నాయా, దాన్ని పతనం చెయ్యబోతున్నాయా అనే ప్రశ్నలు ప్రపంచమంతటా చర్చనీయాంశం అయింది. పెట్టుబడివారి దేశాల్లోని పత్రికలు రష్యాలో ముఖ్యంగా - తూర్పు యూరపు దేశాల్లో వస్తున్న మార్పులను చూసి ఆనందిస్తున్నారు. పెట్టుబడిదారులు వేడుకలు చేసుకొంటున్నారు. పెట్టుబడిదారి వ్యవస్థ మద్దతు దారులైన మేధావులు కమ్యూనిజానికి కాలం చెల్లిందని ఈలలు వేస్తున్నారు.

మనదేశంలోని పెట్టుబడిదారులు, వారి పత్రికలు ఇక ఈదేశంలో విప్లవం వచ్చే అవకాశాలు తగ్గిపోయాయని సంబరపడుతున్నారు. ప్రజాస్వామ్యానికి, సోషలిజానికి మధ్య జరిగిన పోటీలో సోషలిజం ఓడిపోయిందని కేరింతలు కొడుతున్నారు. మతోన్మాదులైతే మతం ఇంకా సుదీర్ఘ కాలం బతికి బట్ట కడుతుందని ఆనందిస్తున్నారు. పెట్టుబడిదారుల బందీఖానాలో ఉన్న పూజారులంతా దోపిడీ కలకాలం చెయ్యొచ్చని గుడిగంటలు మోగిస్తున్నారు. ఈ వాతావరణంలో ప్రాణాలకు తెగించి దశాబ్దాల కొద్ది విప్లవం కోసం కృషిచేస్తున్న కార్యకర్తలు నిరుత్సాహానికి గురౌతున్నారు. మూడవ ప్రపంచ దేశాలలోని ప్రజలు సోషలిజం పై పెట్టుకొన్న ఆశలపై సడలింపు కనిపిస్తున్నది. నిరాశ కనిపిస్తున్నది. కనుక రష్యాలో, చైనాలో, తూర్పు యూరపు దేశాల్లో వస్తున్న మార్పులను జాగ్రత్తగా పరిశీలించి అర్థం చేసుకోవలసి ఉంది. సోషలిస్టు సిద్ధాంతం, మార్క్సిజం ఈ అగ్ని పరీక్షను ఎలా తట్టుకోగలవో తేల్చుకోవాలి. ప్రవాహంలో వచ్చిన సుడిగుండాలు ప్రవాహాన్నే ఆపెయ్య గలవా అనే కీలకమైన ప్రశ్నకు సమాధానం వెతుక్కోవాలి.

మార్క్సిజం కేవలం ఒక సిద్ధాంతం మాత్రమే కాదు. చరిత్ర క్రమంలో వచ్చే మార్పులను అర్థం చేసుకునే 'పద్ధతి' అది. ఒక 'పద్ధతి' చరిత్ర క్రమంలో జరిగే ప్రతి మార్పును ఆ మార్పు ఎట్లా, ఎందుకు జరుగుతుందో తిరిగి చెప్పగలిగే సాధనం కూడ. కనుక సోషలిస్టు దేశాల్లో వచ్చే మార్పులను మార్క్సిస్టు పద్ధతిని తిరిగి అనువదించడం వల్లనే సరిగ్గా అర్థం చేసుకోగలం.

ప్రపంచంలో సోషలిస్టు దేశాలుగా చెప్పుకోబడుతున్న అన్ని దేశాల్లో విప్లవాల ద్వారా సోషలిజాన్ని స్థాపించ లేదు. ఒక దేశంలో విప్లవం జరుగుతున్న క్రమంలోనే పాత సమాజపు పునాదులు కుదుపబడుతాయి. విలువలు, సంస్కృతి మార్చడానికి బీజాలు పడుతాయి. ఇప్పుడు మార్పులు సంభవిస్తున్న అన్ని దేశాలతో పోలిస్తే కేవలం రష్యా, చైనా దేశాల్లో మాత్రమే సమాజపు పొరలను కుదుపుకుంటూ విప్లవాలు వచ్చాయి. తూర్పు యూరపులోని అన్ని దేశాల్లో రెండవ ప్రపంచ యుద్ధం తరువాత సోషలిస్టు వ్యవస్థను పైనుండి దిగుమతి చేశారు. స్టాలిన్ నాయకత్వంలోని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఈ పనిని జయప్రదంగా చేసింది. అప్పటికి ఆయా దేశాల్లో ఉన్న కమ్యూనిస్టు పార్టీలు ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని అధికారంలోకి వచ్చాయి. అంటే సోషలిస్టు దేశాలుగా పిలువబడుతున్న దేశాల్లో రెండు రకాలు ఉన్నాయి. అందులో రష్యా, చైనా దేశాలు అంతర్గతంగా విప్లవాలు వచ్చిన సోషలిస్టు దేశాల క్రిందకి వస్తే తూర్పున యూరపు దేశాలు విప్లవాన్ని సోషలిజాన్ని పైనుంచి రుద్దిన దేశాల క్రిందికి వస్తాయి. అంటే అక్కడ సోషలిస్టు స్థాపనకు కావలసిన పునాదులు కూడ పడలేదు.

అయితే సోషలిస్టు లక్ష్యాలను సాధించే క్రమంనుండి రష్యా, చైనా దేశాలు కూడ వెనక్కి పోతున్నాయనేది వాస్తవమే. ఈ క్రమంలో ఈ దేశాలు ఒక్కొక్క అడుగు వెనక్కి వేస్తున్నాయి. సోషలిస్టు ఆచరణకు వ్యతిరేకంగా ఇంత బలమైన ఎదురు గాడ్పులు వీస్తున్నా లెనిన్, మావోలు తమ తమ దేశాల్లో నాటిన బలమైన విప్లవ మొక్కల వల్ల రష్యా, చైనా దేశాల్లో మార్పులు చిన్నగా వస్తున్నాయి. అదే తూర్పు యూరపు దేశాల్లో అయితే అక్కడి వ్యవస్థలు పేకమేడల్లా కూలిపోతున్నాయి. అక్కడి ప్రజలు ప్రజాస్వామ్యం కోసం ధర్నాలు, ఊరేగింపులకు దిగారు. అసలు కమ్యూనిస్టు పార్టీ, ఏకపార్టీ పరిపాలనను వ్యతిరేకిస్తున్నారు. రుమేనియాలో సుసెస్కో నియంతృత్వానికి వ్యతిరేకంగా తీవ్రమైన సాయుధ పోరాటం జరిగింది. సైన్యం లోని తిరుగుబాటుదారులు ప్రజల పక్కన చేరగా, సుసెస్కో అనుచరులు ప్రజలపై కాల్పులకు దిగారు. ఈ కాల్పుల్లో వేలాదిమంది ప్రజలు చనిపోయినట్లు వార్తలొచ్చాయి. సుసెస్కో అధికారమంతా తన గుప్పిట్లో పెట్టుకోవటమే కాకుండా పెద్ద ఎత్తున ధనార్జనకు, శత్రునిర్మూలనకు పాటుపడ్డాడని కూడ

వార్తలొచ్చాయి. సుసెస్కొ సోషలిస్టు దేశాలు సృష్టించిన నియంతకు ప్రతీకగా ఉంటాడని పెట్టుబడిదారీ దేశాలు పెద్ద ఎత్తున ప్రచారం చేస్తున్నాయి. స్టాలిన్ గురించి చేసిన ప్రచారం కన్నా, పాల్‌పాట్ గురించి చేసిన ప్రచారం కన్నా (కంబోడియా కమ్యూనిస్టు పార్టీ నాయకుడు) సుసెస్కొ గురించి వస్తున్న వార్తలను అన్ని దేశాల ప్రజలు నమ్ముతున్నారు.

పొయ్యారని విన్నాం. కొంతమందిని పాల్పాటే స్వయంగా చంపాడని విన్నాం. కాని స్టాలిన్ గురించి గాని, పాల్పాట్ గురించి గాని పెద్ద ఎత్తున ఆస్తులు సంపాదించారని, బంగ్లాలకు బంగారం పొదిగారని మనం వినలేదు. పెట్టుబడి దారీ దేశాల్లోని ప్రచార కేంద్రాలు కూడా వారి గురించి అలా చెప్పలేదు. అంటే సుసెస్కొ గురించి ఇంతకు ముందు ఏ కమ్యూనిస్టు నాయకుని గురించి వినని

సోషలిజం వైపు పయనించిన దేశాలు. అంటే సోషలిస్టు వ్యవస్థ నిర్మాణ ప్రయత్నం పెట్టుబడి దారి వ్యవస్థ అనే సముద్రంలో కొన్ని ద్వీపకల్పాల్లో మాత్రమే సాగనారంభించింది.

నాలుగు వందల సంవత్సరాలుగా ఉనికిలో ఉంటున్న పెట్టుబడి దారీ వ్యవస్థ బలమైన దోపిడీ ఉత్పత్తి సంబంధాలను ఏర్పరచడమే కాక చాల బలమైన సాంస్కృతిక సంబంధాలను

తినన్మేన్ స్క్వేర్ వద్ద ప్రతిష్ఠించిన "ప్రజాస్వామ్య దేవత"

సుసెస్కొ గురించి వచ్చే ఈ వార్తల్లో సత్యం ఉన్నదనేది మనం ఒప్పుకోవాలి.

సోషలిస్టు వ్యవస్థల నిర్మాణ క్రమంలో తప్పులు చేసిన నాయకులు చాలమంది ఉన్నారు. ఆ వరుసలో మనకు తటస్థించే పేర్లలో స్టాలిన్, పాల్‌పాట్ గురించి మనం చాలసార్లు విన్నాం. స్టాలిన్ నియంతృత్వ ధోరణులతో వ్యవహరించాడని విన్నాం, చదివాం. పాల్‌పాట్ పట్టణాలనుండి పల్లెలకు జనాన్ని తర్లిపొమ్మని జారీ చేసిన ఆర్డర్లను బలవంతంగా అమలు చెయ్యడం వల్ల ఎంతో మంది చని

స్వార్థం, సంపాదన, దోపిడీ గురించి వింటున్నాం. ఈ వార్తల్లో నిజమున్నదనే అవగాహనతో బయలు దేరే మనం సోషలిస్టు దేశాల గురించి అర్థం చేసుకోవడానిని ప్రయత్నిద్దాం. వాస్తవాలు పక్కకు పెట్టి ఆ దేశాలను అర్థం చేసుకోవాలని చూసినా మనం పక్కదారి పడతాం.

అంతర్గత విప్లవాల వల్ల సోషలిస్టు నిర్మాణానికి పూనుకున్న దేశాలు ప్రపంచంలో కొన్ని మాత్రమే ఉన్నాయని మనం చెప్పుకున్నాం. అందులో రష్యా, చైనా, ఒక మేరకి క్యూబా కూడ అంతర్గత విప్లవం వల్ల

కూడ ఉనికిలోకి తెచ్చింది. అందులో చాల ముఖ్యమైనది 'భోగ భాగ్యాల సంస్కృతి' (కన్స్యూమర్ కల్చర్) ప్రపంచంలోని శ్రామిక వర్గాన్ని పీడించడమే కాకుండా, సోషలిస్టు దేశాలలోని ప్రజలను కూడ ఈ భోగభాగ్యాల సంస్కృతి పట్టి పీడిస్తున్నది. సోషలిస్టు దేశాలను ఎప్పుడు కూలగొట్టాలని (సాయుధంగా) ప్రయత్నించడంతో పాటు ఈ భోగ భాగ్యాల సంస్కృతి'ని ప్రవేశ పెట్టడం ద్వార కూడ సోషలిస్టు వ్యవస్థలను తలక్రిందులు చెయ్యొచ్చని పెట్టుబడిదేశాలకు తెలుసు. ఈ

క్రమం నుండి సోషలిస్టు దేశాలను రక్షించుకునేందుకు స్టాలిన్ వంటి నాయకులు చేసిన తప్పులను మనం వేరుగా అర్థం చేసుకోవాలి. కావాలని నియంతృత్వ ధోరణులను ప్రవేశ పెట్టిన సుసెస్కో వంటి వారిని వేరుగా అర్థం చేసుకోవాలి. స్టాలిన్ వంటి నాయకులు పెట్టుబడిదారులు పన్నిన విషవలయానికి బలై తప్పులు చేస్తే సుసెస్కో వంటి వారు సోషలిస్టు వ్యవస్థల్లో పుట్టుకొచ్చిన పెట్టుబడి దారులు. ఇలాంటి వారు కమ్యూనిస్టు పార్టీల నాయకులై పరిపాలన మొదలెట్టాక అక్కడ ఉన్న ఏక కేంద్ర పరిపాలన వల్ల వారికి అదుపు అజ్ఞలు ఉండవు. నిజానికి సుసెస్కోకు రుమేనియా ప్రజలు చెప్పిన బుద్ధి ఏదేశంలో కమ్యూనిస్టు పార్టీలో అలాంటి నాయకుడు పుట్టినా అలానే చెప్పాలి. సుసెస్కో వంటివారు కమ్యూనిస్టు పార్టీలో ఎలా పుట్టగలిగారు. ఈ వ్యవస్థలన్నీ ఇలా వెనక్కిపోవడానికి మూలం ఎక్కడుంది అనే అంశాన్ని కూడ మనం పరిశీలించాలి.

మనం గుర్తుంచుకోవాల్సిందేమంటే ఈనాడు పెట్టుబడిదారి దేశాల్లోని పత్రికలు చెబుతున్నట్లు ఈ దేశంల్లో సోషలిస్టు వ్యవస్థలు దెబ్బ తినడమంటే సోషలిజం, కమ్యూనిజం పూర్తిగా విఫలం చెందడమేనా? పెట్టుబడిదారి దేశాల్లో గగ్గోలు పెడుతున్న వారంతా ప్రజాస్వామ్య దేశాల చరిత్రను మరిచిపోతున్నారు. ప్రజాస్వామ్య విప్లవాలు యూరపులో ప్రబద్దలైనంక, పార్లమెంటరీ ప్రభుత్వాలు అక్కడ స్థాపించినంక ఆదేశాలు మళ్ళీ రాజరికం చేతిలోకి లేదా నియంతృత్వం చేతిలోకి పోయాయి. ఉదాహరణకు 1688లో బ్రిటన్‌లో క్రామ్‌వెల్ నాయకత్వంలో విప్లవ మొచ్చాక ఆదేశం మళ్ళీ రాజుల చేతిలోకి పోయింది. 1789లో ఫ్రెంచి విప్లవమొచ్చి అక్కడ పార్లమెంటును స్థాపించాక అక్కడ నెపోలియన్ మళ్ళీ నియంతృత్వాన్ని స్థాపించాడు. ఈనాటికి బ్రిటన్‌లో రాజకుటుంబమే ప్రభుత్వ అధినేతగా ఉంటున్నది. ఈ పరిణామాల్ని చూపించి ఆనాడు ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు కాలం చెల్లిందని చెప్పుకున్నారా? అలా చెప్పలేదే. అక్కడ ప్రజాస్వామ్యాన్ని అమలు చేసిన శక్తులు దెబ్బతిన్నందు వల్ల తిరిగి రాజరికంలో, నియంతృత్వాలో వచ్చాయని మాత్రమే చెప్పారు. నెపోలియన్ ఫ్రెంచి విప్లవ ఫలితాలను వెనక్కి తన్నాక కూడా ఫ్రెంచి విప్లవంలో ముందుకొచ్చిన 'స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం' అనే నినాదాలు ఆదర్శవంతమవ్వక పోలేదు కదా! కనుక ఒక్కమాటలో చెప్పాలంటే ఇప్పుడున్న సోషలిస్టు వ్యవస్థలన్నీ తిరిగి పెట్టుబడిదేశాలుగా మారినా సోషలిజం, కమ్యూనిజం సిద్ధాంతాలు ప్రపంచ ప్రజలకు ఆదర్శవంతంగా ఉండకపోవు. సోషలిస్టు విప్లవాలు ఇతర దేశాల్లో రాకపోవు. ఒక చారిత్రక దశనుంచి మరో చారిత్రక దశకు ప్రపంచం మారుతున్నప్పుడు ఒక శతాబ్దంలో వచ్చే ఆటుపోటులు నూతనంగా ప్రారంభమయ్యే చారిత్రక దశలను ఆపలేవు కనుక ఆదేశాల్లో వస్తున్న మార్పులన్నీ సోషలిస్టు వ్యవస్థలను నిర్మించే ప్రపంచ శ్రామిక వర్గానికి గుణపాఠాలుగానే ఉంటాయి. పోరాటం ప్రతివైరుధ్యాన్ని పరిష్కరించే కీలకమైన సాధనం.

సోవియట్ యూనియన్‌లో గోర్బచేవ్ తెచ్చిన గ్లాస్‌నాస్ట్, పెరిస్ట్రాయికా నినాదాలు రెండు ముఖాలకు ప్రతిబింబాలుగా ఉంటాయి. అందు ఒకటి కృశ్చేవ్ మొదలెట్టిన పెట్టుబడిదారి విధానానికి ప్రతిబింబంగా ఉంటే రెండవది సోషలిస్టు వ్యవస్థ నిర్మాణ క్రమంలో ప్రజా స్వామ్యాన్ని అణగదొక్కి నియంతృత్వా లను స్థాపించిన శక్తులను బయటికి లాగేదిగా ఉంది. కనుక గోర్బచేవ్ నూతన అధ్యాయాన్ని ప్రారంభించిన వాడౌతాడు. ఈ క్రమంలో చైనాలో వచ్చిన తిరుగుబాట్లు, సోవియట్ యూనియన్‌లో జాతుల స్వయం ప్రతిపత్తికోసం వస్తున్న తిరుగుబాట్లు ఇప్పటివరకు సోషలిస్టు వ్యవస్థల నిర్మాణాల్లో జరిగిన పొరపాట్లనే ఎత్తి చూపుతున్నాయి.

ఈ దేశాల్లో వస్తున్న మార్పు లన్నిటిని ఉత్పత్తిశక్తుల కుటుంబాలకు, ఉత్పత్తి సంబంధాల అభివృద్ధికి మధ్య వస్తున్న వైరుధ్యంగా పరిశీలించడం తెలిసిందే. అంటే కుంటుబడుతున్న ఉత్పత్తికి తీవ్రంగా పెరుగుతున్న ప్రజల అవసరాలకు మధ్య వైరుధ్యం తీవ్రమై ప్రజలు ప్రభుత్వాల మీద తిరగబడుతున్నారని దాని అర్థం.

కాని ఇక్కడ మనం చూడాల్సిందేమంటే ఈ ప్రజల "అవసరాలు" ఏ కోవకు చెందినవి? అవి ప్రాథమిక అవసరాలతో ముడిపడి ఉన్నవా లేక పెట్టుబడిదారిదేశాల్లో ఉనికి లోకి వచ్చిన "సామ్రాజ్యవాద మధ్య తరగతి" (ఇంపీరియల్ మిడిల్ క్లాస్) అనుభవిస్తున్న సుఖాలు తమకూ కావాలని కోరుకోవడమా? రష్యా, చైనా వంటి సోషలిస్టు దేశాలు ప్రాథమిక అవసరాలను తీర్చేస్థితికి ఎప్పుడో చేరుకున్నాయి. కాని సాంస్కృతిక రంగంలో ప్రజల్లో మార్పు రానందువల్ల - సోషలిస్టు సంస్కృతిని సృష్టించ నందువల్ల ఇక్కడి ప్రజలు కూడా సామ్రాజ్య వాద దేశాల్లోని "సామ్రాజ్య వాద మధ్య తరగతి" అనుభవించే సుఖాలు మాకు కావాలని కోరుకోవడం వల్ల కొన్ని సమస్యలు తలెత్తుతున్నాయి. సామ్రాజ్యవాద దేశాలు ప్రపంచ ప్రజల్ని దోచుకోవడం వల్లనే ఈ దేశాలలో ప్రజలు ఈ సుఖాల్ని అనుభవించగలుగుతున్నారని సోషలిస్టు దేశాల్లోని ప్రజలు గుర్తించక పోతే వచ్చే సమస్యలివి.

పోతే ఈ స్థితిని నిరంతర పోరాటాల వల్ల మార్చాల్సి ఉండే. ఈ ప్రయత్నం సోవియట్ యూనియన్‌లో అసలు జరుగ లేదు. చైనాలో మావో నాయకత్వంలో ఒక మేరకు జరిగి ఆగి పోయింది. ఐతే విప్లవ పోరాటాలకు నాయకత్వం వహించిన నాయకులు చనిపోగానే ఆదేశాల్లో సోషలిస్టు నిర్మాణమే పక్కదారి పట్టడానికి కూడ మనం కారణాలు వెతకాల్సి ఉంది. స్టాలిన్ తరువాత సోవియట్ యూనియన్, మావో తరువాత చైనా తిరోగమనం వైపుకు ఎందుకు పోనారంభించాయి అనికూడ మనం ప్రశ్న వేసుకోవల్సి ఉంది. మార్క్స్,

ఎంగెల్స్‌లు నిరంతర పట్టుదలతో సోషలిస్టు వ్యవస్థ నిర్మాణానికి, ఆ తరువాత కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాణానికి కావలసిన సిద్ధాంత పునాదిని ఏర్పరిచారు. బూర్జువా హక్కులను అధిగమించి (సోషలిస్టు హక్కులోకి ఆ తరువాత కమ్యూనిస్టు హక్కులోకి) సమాజం ఎదగడానికి మానవుల సంపూర్ణ అభివృద్ధితో ముడిపడి ఉత్పత్తి శక్తులు పెరగాల్సి ఉందని మార్క్స్ గోథా ప్రోగ్రామ్‌లో స్పష్టంగానే చెప్పాడు. అప్పుడే "పనికి దగ్గ ఫలితం'' నుండి సమాజం "అవసరాలకు దగ్గ ఫలితాల'' వైపుకు పయనిస్తుంది. ఈ మార్పు ప్రజలకు నాయకత్వానికి జరిగే నిరంతర ఘర్షణ వల్ల మాత్రమే సాధ్యమౌతుంది. అంటే ప్రజలు సోషలిస్టు లక్ష్యాల వైపు వెళ్లకపోతే నాయకత్వం, నాయకత్వం సోషలిస్టు లక్ష్యాల నుండి ఈ వ్యవస్థను పక్కదారి పట్టిస్తే ప్రజలు ఒకరితో ఒకరు పోరాడ గలగాలి. ఈ పోరాటం ఎక్కువగా భావజాలంలో జరగాలి. ఇదెప్పుడు సాధ్యమౌతుంది? సోషలిస్టు నిర్మాణక్రమంలో ప్రజలకు నాయకత్వానికి మధ్య బూర్జువా ప్రజాస్వామ్యాన్ని మించిన సోషలిస్టు ప్రజాస్వామ్య సంబంధాలు ఉండాలి. అయితే సోషలిస్టు ప్రజాస్వామ్యం బూర్జువా ప్రజాస్వామ్యపు తలమీద నిలబడుతుందే కాని అది స్వతహాగా భూమినుండి పుట్టుకరాదు. బూర్జువా ప్రజాస్వామ్యానికి సోషలిస్టు ప్రజాస్వామ్యానికి మధ్యన ఉన్న ఈ చారిత్రక అభివృద్ధి కార్యక్రమ సంబంధాన్ని మనం గమనంలో ఉంచుకోవాలి. అంటే సోషలిస్టు హక్కు బూర్జువా హక్కును సాధించి, దాన్ని దాటిపోయే క్రమంలో మాత్రమే సాధించబడుతుంది. సోషలిస్టు వ్యవస్థ నిర్మాణ క్రమం ఆరంభ దశనుండి వర్గ సంబంధాల మూల బీజాలైన అన్ని సంస్థల్ని అమర్చడానికి ఒక పథకం ఉండాలి. ఉదాహరణకు దోపిడీ రాజ్యాంగానికి మూల బిందువైన కుటుంబ వ్యవస్థను మార్చే ప్రయత్నం చెయ్యకుండా నూతన మానవుల అభివృద్ధి జరగడం అసంభవం. అంటే దోపిడీ వ్యవస్థ ఉనికిలోకి తెచ్చిన 'ఏకభర్త కుటుంబ సంబంధాలు మార్చడానికి ఒక నిర్దిష్టమైన పథకం ఉండాలి. ఆ ప్రయత్నాల్ని చూచాయగా లెనిన్, కొంతవరకు నిర్దిష్టంగా మావో చేశారు. ఆ తరువాత ఆ ప్రయత్నాలు ఆగిపోయాయి. ఫలితంగా ఇప్పుడు కొద్దిపాటి సోషలిస్టు దేశాలలోని కుటుంబ సంబంధాలకు, పెట్టుబడి దారి దేశాలలోని కుటుంబ సంబంధాలకు పెద్ద తేడా లేకుండా పోయింది. ఇక్కడే పెట్టుబడి దారి దేశాలలోని భోగభాగ్యాల సంస్కృతి, దోపిడీ సంస్కృతి సోషలిస్టు దేశాల్లో కూడ చాల బలంగా కొనసాగుకుంటూ వస్తున్నది. రెండవది పునాదికి, ఉపరితల నిర్మాణాలకు మధ్య ఉన్న సంబంధాన్ని పునఃపరిశీలించాలి కూడ. ఉదాహరణకు 70 సంవత్సరాల తరువాత రష్యాలో ప్రజలు మళ్ళీ మతంవైపుకు పోతున్నారు. అంటే ఆర్థిక సంబంధాల్లో కొంత మౌలిక మార్పు సాధించినా, భావజాల రంగంలో మౌలిక మార్పులు వాటంతట అవే రావడం లేదు. కనుక భావ జాల రంగంలో కూడ నిరంత



పోలీసులు చూస్తుండగానే కొందరు చారిత్రాత్మక బెర్లిన్ గోడ దూకుతున్న దృశ్యం .

పోరాటం చెయ్యాల్సి ఉంది. రష్యాలో ఈ నిరంతర పోరాటం అసలు మొదలెట్టక పోవడానికి, చైనాలో మొదలెట్టి మధ్యలోనే ఆపడానికి (లేదా కొన్ని శక్తులు బలవంతంగా దాన్ని నిలిపి వెయ్యడానికి) మూల కారణం ఆర్థిక రంగంలో మార్పులొస్తే భావ జాలం కూడ మార్పు సహజంగా వస్తుందనుకోవడంలో ఉంది. తూర్పు యూరపు దేశాల్లో ఈ అంశాలను చర్చించడానికి కావలసిన సిద్ధాంత శక్తులే ఎదుగలేదు.

ఇటువంటి చాల అంశాల మీద సోషలిస్టు దేశాల్లో చర్చ జరక్క పోవడానికి మరో మూలకారణం ఉంది. అది కమ్యూనిస్టు పార్టీతో కేంద్రీకృత ప్రజాస్వామ్యంతో ముడిపడి ఉంది. రష్యాలో విప్లవానికి ముందు అన్ని యూరపు కమ్యూనిస్టు పార్టీల్లో ప్రజాస్వామ్యం ఎలా ఉండాలి అనే దాని మీద కొంత చర్చ జరిగింది. ముఖ్యంగా రోజాలక్జంబర్గ్ పార్టీలో 'నిలువు' 'అడ్డం' (horizontal and vertical) ప్రజాస్వామ్యం ఉండకపోతే పార్టీల్లో నియంతృత్వం ఏర్పడుతుందనే అంశాన్ని లేవనెత్తింది. లెనిన్ దాన్ని సూత్రరీత్యా అంగీకరించినప్పటికీ విప్లవ పోరాటాల క్రమంలో అన్ని అటు, పోటులను - ముఖ్యంగా నిర్బంధాన్ని తట్టుకోవడానికి ఏకశిల సదృశ్య నిర్మాణం అవసరం గురించి నొక్కి చెప్పాడు. ఈ చర్చను లోతుగా పరిశీలించాలి అనాడు లెనిన్ వాదన ఏమైనా విప్లవాలు జయప్రదమైన దేశాల్లో ఒక గుణాత్మక మార్పు జరిగింది. రాజ్యాంగయంత్రం కమ్యూనిస్టు పార్టీ చేతిలోకి రావడం అక్కడెచ్చిన ఒక గుణాత్మక మార్పు. దోపిడీ వర్గం చేతిలో అధికారం ఉన్నప్పుడు విప్లవాన్ని జయప్రదం చేసే లక్ష్యాన్ని సాధించేందుకు, దోపిడీ రాజ్యాంగ యంత్రపు అణచివేత నుండి నిర్మాణాన్ని కాపాడుకునేందుకు అనువుగా ఏర్పరుచుకున్న కేంద్రీకృత ప్రజా స్వామ్యం విప్లవానంతరం కూడా యథా తథంగా కొనసాగడం వల్ల కొన్ని ఊహించ చనటువంటి పరిణామాలు వచ్చాయి.

రాజ్యాంగ యంత్రం కమ్యూనిస్టు పార్టీ చేతిలోకి వచ్చాక ఉనికిలో ఉన్న దోపిడీ వ్యవస్థను రద్దు చేసి సోషలిస్టు వ్యవస్థను నిర్మించేందుకు 'శ్రామికవర్గ నియతృత్వం' అనివార్యం. ఐతే అది కొంతకాలం కొనసాగే దశమాత్రమే. ఆదశలో అంతకు ముందు అధికారంలో ఉన్న పాలకవర్గం మీద కమ్యూనిస్టు పార్టీ నియంతృత్వం, ప్రజలకు నిజమైన ప్రజాస్వామ్యం నెలకొల్పడం దాని ఉద్దేశం. కాని బాగా చైతన్యవంతులైన లెనిన్, మావోల వంటి వారి చేతిలో నాయకత్వం ఉన్నంతకాలం ఈ శ్రామిక వర్గ నియంతృత్వం సూత్రీకరణ ప్రకారం రష్యాలో, చైనాలో అమలు జరిగింది. లెనిన్, మావోలు ఆయా దేశాల పార్టీలను విప్లవం వైపుకు నడిపిన సిద్ధాంత వేత్తలు, చాల దూరదృష్టిగల తత్వవేత్తలు కూడ. కాని వారి మరణానంతరం ఆ రెండు దేశాల్లో నాయకత్వాల ఎన్నిక ప్రజా స్వామ్య పద్ధతిలో పరిష్కరించబడ లేదు. రష్యాలో స్టాలిన్, ట్రాట్స్కీ తీవ్ర సంఘర్షణ జరిగితే, చైనాలో డెంగుకు, చియాంగ చింగ్ ఆమె అనుచరులకు పోరాటం జరిగింది. ఐతే చాల పొరపాట్లు చేసినప్పటికీ అధికారంలోకి వచ్చాక స్టాలిన్ సోషలిస్టు వ్యవస్థ రక్షణకు, అభివృద్ధికి తీవ్రమైన కృషి చేశాడు. డెంగ్ మాత్రం అతి త్వరలోనే సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధి క్రమాన్ని వెనక్కి మళ్ళించాడు. సాంస్కృతిక విప్లవ ఫలితాలను కూడ దారుణంగా వెనక్కి నెట్టగలిగాడు. రష్యాలో స్టాలిన్ తరువాత అధికారంలోకి వచ్చిన కృశ్చెవ్, బ్రెజ్నేవ్, గోర్బచేవ్ అందరూ ఒక్కొక్క అడుగు వ్యవస్థను నెట్టుకుంటూ వస్తున్నారు. వీరందరిలో గోర్బచేవ్ చాల విచిత్రమైన పాత్ర నిర్వహిస్తు న్నాడు. ఆయన పెరిస్త్రోయికా, గ్లాస్‌నాస్ట్ సూత్రాల పేరున 'పెండోరా బాక్స్'ను తెరిచాడు. దీనిలో ఇప్పుడు రష్యాలో స్వంత ఆస్తి, దేశం జాతుల సమస్యపై విడిపోవడం, చైనాలో తిరుగుబాటు, తూర్పు యూరపు వ్యవస్థలన్నీ కూలి పోవడం, తూర్పు పశ్చిమ జర్మనీల ఏకీకరణ (బెర్లిన్ గోడను కూలగొట్టడం), ఈ అన్ని దేశాల్లో బహు పార్టీల వ్యవస్థలు అన్నీ వస్తున్నాయి. ఐతే ఈ క్రమంలో గోర్బచేవ్ పాత్ర కృశ్చెవ్ వారసత్వాన్ని కొనసాగించేదే అని అర్థమౌతున్న ప్పటికీ ఆయనపై ఒక సమగ్రమైన అంచనా, రావడానికి ఇంకొంత టైము పడుతుంది.

ఈ మొత్తం క్రమంలో జరిగేదే మంటే పార్టీలలోనూ, దేశాలలోను ప్రజా స్వామ్యం లోపించడం వల్ల కమ్యూనిస్టు పార్టీల నాయకత్వం 'ఏకవ్యక్తి' పరిపాల నలుగా మారాయి. అధికారంలో ఉన్న ప్పుడు కూడా కేంద్రీకృత ప్రజాస్వా మ్యాన్ని (ఏకశిలా సదృశ్యంగా) వుంచడం వల్ల పార్టీలో క్రియాశీలత నశించి బూర్జుకసీ ఉనికి లోకి వచ్చింది. శ్రామికవర్గ నియంతృత్వం పాత పాలక వర్గం మీద నియంతృత్వంగా మాత్రమే ఉండక ప్రజల మీదికి కూడ నియంతృత్వం సారించబడింది. ఫలితంగా వార్తా పత్రికలన్నీ ప్రజల ప్రజాస్వామ్యాన్ని ప్రతిబింబించేవిగా ఉండక పార్టీ సభ్యులు మాత్రమే అందించిన వార్తలను ప్రచురించేవిగా తయారైనాయి. పార్టీ, ప్రభుత్వం అధీ నంలో నడుస్తున్న పత్రికలు 'సంపాదకీ యాల' ద్వారా పార్టీ అభిప్రాయాల్ని చెప్పి, వార్తల్లో ప్రజాభిప్రాయాన్ని స్వేచ్ఛగా వ్యక్తం కానివ్వాలనే మౌళిక అంశం పక్కకు నెట్టివేయబడింది. అంటే బూర్జువా ప్రజాస్వామ్యం తలపై నిలబడి సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని ఆచరణలో పెట్టాలనే అంశం పక్కకు నెట్టబడింది. మావో చైనాలో ఇటువంటి ప్రయత్నం సాంస్కృతిక విప్లవం ద్వారా చేసినా అక్కడి పార్టీలోని బూరకాక్రటిక్ శక్తులు సులభంగా సాంస్కృతిక విప్లవాన్ని అడ్డుకోగలిగారు. ఈ స్థితిలో మావో పార్టీ నిర్మాణంలోనే కొన్ని మౌళికమైన మార్పులు తెచ్చి 'సోషలిస్టు ప్రజాస్వామ్య' విలువల్ని అభివృద్ధి చెయ్యడానికి చర్య తీసు కోవలసి ఉండింది. ఆ పని జరుగ లేదు. అలా జరక్క పోవడానికి పార్టీలో ఉన్న నియంతృత్వశక్తులు, బూరా క్రటిక్ శక్తులు ఆయన్ని బలంగానే అడ్డుకొని ఉంటాయి.

దీనికితోడు ఇంకొక సమస్య కూడా ఎదురైంది. విప్లవాలు జయ ప్రదమైన అన్ని దేశాలు (అంటే రష్యా,

చైనా, క్యూబా, వియత్నాం మొదలగు దేశాలు) అప్పటి వరకు అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలు కావు. కనుక అక్కడ భూస్వామ్య పితృస్వామ్య భావాలు బలంగా ఉనికిలో ఉన్నాయి. ఇటువంటి దేశాల్లో సోషలిస్టు వ్యవస్థను నెలకొల్పాలంటే చాల అదనపు జాగ్రత్తలు అవసరమౌతాయి. (భారతదేశం వంటి కుల వ్యవస్థ, వెర్రి తలలు వేసిన పితృస్వామ్య వ్యవస్థ ఉన్న దేశంలో ఇప్పటినుండే ఈ సంస్థలకు వ్యతిరేకంగా పోరాడవలసి ఉంటుంది) బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాల్లో పునాదిలో మార్పులు తెస్తే ఉపరితల నిర్మాణంలో ఎంత సులభంగా మార్పులొస్తాయో ఇక్కడ అంత సులభంగా రావు. ఈరకంగా వెనుకబడి ఉన్న దేశాల్లో సోషలిస్టు వ్యవస్థను నిర్మించడమంటే సోషలిస్టు ఉత్పత్తిశక్తులతో పాటు, సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలతో పాటు సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని జాగ్రత్తగా అభివృద్ధి చెయ్యడమన్న మాట. బహుశా ఇది జరిగినట్లయితే సుసెస్కోలు, డెంగ్‌లు పుట్టుకొచ్చేవారు కారు. తన పిల్లలకు అధికారం కట్టబెట్టే అవకాశముండే పరిస్థితి దేశంలోనూ, కుటుంబంలోను ఉన్నంత కాలం స్వార్థపరశక్తులను అలా కట్టబెట్టకుండా ఆపడం కష్టం. కనుక సోషలిస్టు వ్యవస్థ నిర్మాణక్రమంలో కుటుంబ వ్యవస్థ నిర్మాణాన్ని కూడ మార్చే ప్రయత్నం తీవ్రంగా జరగాల్సి ఉండింది. ఈ అంశాన్ని ప్రపంచంలోని సోషలిస్టు ఫెమినిస్టు ఉద్యమాలు చాల బలంగా ముందుకు తెచ్చాయి. కాని అధికారంలో ఉన్న కమ్యూనిస్టు పార్టీలు గాని, విప్లవ పోరాటాలు చేస్తున్న కమ్యూనిస్టు పార్టీలు గాని, విప్లవ పోరాటాలు చేస్తున్న కమ్యూనిస్టు పార్టీలుగాని ఈ అంశాన్ని పట్టించుకోలేదు.

రివిజనిస్టు ధోరణులు, నియంతృత్వ ధోరణులు కుటుంబాన్ని ఆసరగా చేసుకొని ఎదుగుతాయి అన్న అంశాన్ని ఇప్పటికైనా మనం గుర్తించాల్సి ఉంది. రష్యా, చైనా, తూర్పు యూరపు దేశాల్లో వస్తున్న ఈ మౌలిక మార్పుల నుండి మూడవ ప్రపంచ దేశాల్లోని విప్లవోద్యమాలు, ముఖ్యంగా భారతదేశపు విప్లవాన్ని నడిపే వారు చాల గుణపాఠాలు తీసుకోవలసి ఉంది. విప్లవాలను తీసుకొచ్చే క్రమంలోనే ఈ దేశాల్లో సోషలిస్టు వ్యవస్థ నిర్మాణానికి అడ్డుగా ఉన్న అన్ని రకాల శక్తుల పునాదుల్ని పెకిలించాల్సి ఉంది. విప్లవాన్ని సాధించడానికి మంత్రసానిగా పనిచేసే పార్టీ నిర్మాణాలను తిరిగి రివిజనిస్టు పార్టీలుగా మారకుండా ఉండడానికి తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకోవాలి. అంతర్జాతీయ కమ్యూనిస్టు కేంద్రాలు ఒకదాని తరువాత ఒకటి వెనక్కి పోతున్నప్పుడు ఇక్కడి విప్లవ శక్తులు స్వంత కాళ్ళమీద నిలబడి ఈదేశంలో విప్లవం సాధించుకోవలసి ఉంది. వారు చేసిన ప్రతి సూత్రీకరణను వేదాలను చదివినట్లు, వల్లించినట్లు వల్లించేసే క్రమానికి స్వస్తి చెప్పాల్సి ఉంది. భారత కమ్యూనిస్టు ఉద్యమాన్ని వెంటాడి కృంగదీస్తున్న బ్రహ్మణిజాన్ని జాగ్రత్తగా పరిశీలించాల్సి ఉంది. కుల వ్యవస్థకు, స్త్రీ, పురుష అసమానత్వానికి, కుటుంబ వ్యవస్థకు వ్యతిరేకంగా రాజీ లేని పోరాటం నడపాల్సి ఉంది.

ఈ క్రమంలోనే నిరాశకు గురికాకుండా సోషలిస్టు దేశాల్లో వస్తున్న మార్పులు నిరంతర విప్లవాల్లో వచ్చే అటు పోటులుగా అర్థం చేసుకోగలం. గోర్బచేవ్ వంటి నాయకుడు నూతన సూత్రీకరణల పేరుతో ప్రవేశపెడుతున్న తిరోగమన సూత్రాలను అర్థం చేసుకోగలం. పైనుండి నాయకులు ప్రవేశ పెట్టే మార్పులకు ప్రజలు పోరాటాల ద్వారా సాధించుకునే మార్పులకు మధ్య ఉన్న తేడాను అర్థం చేసుకోగలం. చైనాలో విద్యార్థుల తిరుగుబాటు, తూర్పు యూరపు దేశాల్లో సుసెస్కో మీద, లేదా ఇతర కమ్యూనిస్టు పార్టీల మీద జరిగే తిరుగుబాట్లు తాత్కాలికంగా తిరోగమన స్వభావంతో కూడినవిగా కనబడినప్పటికీ చారిత్రకంగా చూసినప్పుడు పోరాటాలు పురోగమన లక్ష్యాలు కలిగినవే. ఎందుకంటే ఆ వ్యవస్థలు అలానే కొనసాగినా ఇప్పుడున్న నిర్మాణ రూపాలతో, ఇప్పుడున్న నాయకత్వంతో అవి కమ్యూనిస్టు వ్యవస్థల వైపు పయనించవు. అందుకని రెండడుగులు వెనక్కి పోయినా తిరిగి అవి విప్లవ స్వభావాన్ని సంతరించుకోవాలి. గోర్బచేవ్ ఒకవైపు పెరిస్త్రొయికా, గ్లాస్‌నాస్ట్ అంటూనే రెండవ వైపు తనచేతిలో అధికారాలు కేంద్రీకరింపజేసుకుంటున్నాడు. ప్రధాన కార్యదర్శి నుండి అధ్యక్షుడయ్యాడు. అధ్యక్షుడి నుండి ఎక్సిక్యూటివ్ అధ్యక్షుడయ్యాడు. ఈ అధికారాల కేంద్రీకరణ గర్భంనుండే జాతుల స్వయం ప్రతిపత్తి కోసం జరిగే పోరాటాలు పుట్టుకొస్తున్నాయి. ఈ జాతుల స్వయం ప్రతిపత్తి పోరాటం నుండి తిరిగి నిజమైన సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం వైపు ప్రజలు పయనించే అవకాశం ఏర్పడుతుంది. ప్రపంచ ప్రజల్ని దోచుకొని అమెరికా తమ మధ్య తరగతికి అందిస్తున్న సుఖాలు, దోపిడి చెయ్యకుండా రష్యా, చైనా వంటి దేశాలు తమ ప్రజలకు అందించడం అసాధ్యం. ఈ దేశాలు దోపిడీకి తెగబడినా దోపిడీ చేసే దేశాల సంఖ్య పెరిగి ప్రజల జీవన విధానంలో అసమానతలు పెరుగుతాయి. ఈ అసమానతలు ఈ దేశాల ప్రజల మధ్య తీవ్రమైన అసంతృప్తిని పెంచుతాయి. ఈ అసంతృప్తి మళ్ళీ విప్లవాలకు నాంది అవుతుంది. ఇక ముందు ఈ దేశాల్లో విప్లవాలు రావడమే శాస్త్రీయ సోషలిజం నిర్మించడానికి నిరంతర విప్లవాలు జరగడం అవుతుంది. అంటే నిరంతర విప్లవాలను నడపటానికి నాయకత్వం ప్రయత్నించకపోతే వారిని పక్కకునెట్టి ప్రజలే ఆపని చేస్తారు.

కనుక వేల సంవత్సరాల దోపిడీ వ్యవస్థల చరిత్ర తెలిసిన వారిని 70 సంవత్సరాల సోషలిస్టు చరిత్రలో వచ్చే అటు పోటులు అసంతృప్తికి, నిరాశకు ఎందుకు గురిచెయ్యాలి? చరిత్రలో సాగే నిరంతర పోరాటంలో రెండడుగులు వెనక్కి వేయడం పదడుగులు ముందుకు పోవడానికే. ఈకోణం నుండి చూసి నప్పుడు ప్రపంచ విప్లవాలకు ఆదర్శవంతమైన విప్లవోద్యమాన్ని నిర్మించాల్సిన కర్తవ్యం భారత ప్రజల మీద కూడ ఉన్నదని మనమెందు కనుకోవద్దు? ఆ పనిచెయ్యడానికి మనమెందుకు నడుం కట్టొద్దు?

**కె. ఐలయ్య**

# కాశ్మీరు సమస్య-కొన్ని వాస్తవాలు

మొన్నటి పార్లమెంటు ఎన్నికలు జరిగిన తరువాత కొద్ది రోజులకే కాశ్మీరుకు చెందిన జె.కె.ఎల్.ఎఫ్ (జమ్మూ కాశ్మీరు విముక్తి సంఘటన) కార్యకర్తలు దేశ హోంమంత్రి శ్రీ ముఫ్తీ మహమ్మద్ సయీద్ కుమార్తె అయిన డా. రుబియాను కిడ్నాప్ చేసి జైల్లో బందీలుగా ఉన్న తమ కార్యకర్తలను విడిపించుకున్నారు. అప్పటినుండీ 'కాశ్మీరు సమస్య' అనేది దేశంలో విస్తృతంగా చర్చకు వచ్చింది. కాశ్మీరు గురించి వార్తలు ప్రతిదినం పత్రికలలో వస్తూ వున్నాయి. సంపాదకులు వ్యాఖ్యలు రాస్తున్నారు. మేధావులు వ్యాసాలు రాస్తున్నారు. అయినా అసలు విషయం ఏమిటో ఎవ్వరూ స్పష్టం చేయడం లేదు. 'దేశభద్రత' 'దేశ సమైక్యత' 'దేశ సమగ్రత' అనే వాటిని ఎట్లాగయినా సంరక్షించాలనీ విచ్ఛిన్న కారులకు ప్రభుత్వం ఎంతమాత్రం లొంగకూడదనీ పాకిస్తాన్ యుద్ధానికి వస్తే జాతి యావత్తూ ఒకటిగా నిలబడి ఎదుర్కోవాలనీ అందరూ పదే పదే విజ్ఞప్తులు చేస్తున్నారు గానీ అసలు ఇంతగా గాభరా పడవలసిన పరిస్థితి ఎందుకు ఉత్పన్నం అయిందో ఎవరూ వివరిస్తున్నట్టు కనిపించదు.

ఏ విషయాన్నయినా ప్రభుత్వం దృష్టితో కాకుండ ప్రజల దృష్టితో చూడడం ముఖ్యం. ప్రజాస్వామిక దృక్పథానికి ఇది కీలకమయిన విషయం. అసలు 'కాశ్మీరు సమస్య' అనే మాటలు వాడడంలోనే అప్రజాస్వామిక ధోరణి వుంది. అది ఎవరికి సమస్య? కాశ్మీర్ ప్రజలకా, భారత ప్రభుత్వానికా? కాశ్మీరు ప్రజలకయితే అది హోంమంత్రి కుమార్తె కిడ్నాప్‌తో ప్రారంభం కాలేదే, 1947 నుండి వుందే. మరి ఇన్నాళ్ళూ దానిని గురించి ఇంత పెద్ద ఎత్తున ఎందుకు చర్చ జరగలేదు? ఇన్నాళ్ళు 'కాశ్మీర్ సమస్య' అనేది భారత-పాకిస్తాన్ ప్రభుత్వాల మధ్య సమస్య గానూ ఇవ్వాళ మనందరి సమస్యగానూ ఎందుకు చూపిస్తున్నారు?

'భారతదేశం' అని ఇవ్వాళ మనం పిలుచుకునే దేశం చరిత్రలో అనాదిగా వున్నది కాదు. ఒక సామాజిక వ్యవస్థ, ఒక సంస్కృతి, చాలా కాలంగా ఈ భూభాగంలో నెలకొన్ని వున్నాయి. కుల వ్యవస్థ, బ్రాహ్మణ మతం, సంస్కృతం భాష, ఢిల్లీ సుల్తాన్ల తరువాతి కాలంలో ఒక రెవెన్యూ విధానం, ఒక పరిపాలనా యంత్రాంగం, ఇవి ఆసామాజిక వ్యవస్థ ప్రముఖ లక్షణాలు. ఈ వ్యవస్థలో విభిన్న భాషలూ, ఆచారాలు, మతాలు సంస్కృతి వున్న ప్రజలు నివసిస్తున్నారు. 'దేశ సమగ్రత' గురించి బాధపడే ముందు వీళ్ళంతా ఒక 'దేశం' ఎప్పుడయ్యారు, ఎట్లాగయ్యారు అని కొంచెం ఆలోచించాలి. అసలు వీళ్ళంతా ఒక 'దేశం' అయ్యారా అన్న అనుమానం వస్తే దానిని తొక్కిపెట్టకుండా చర్చించాలి. ఆర్టికల్ 370ని రద్దు చేయాలి అని గొడవ చేసే వాళ్ళు అసలు ఆర్టికల్ 370 రాజ్యాంగంలోకి ఎందుకొచ్చింది అని కొంచెం ఆలోచించాలి.

ఈ 'ఉపఖండం' అంతటా ఒకే రాజ్యం చరిత్రలో ఎన్నడూ లేదు. అశోకుడి నుండీ ఔరంగజేబ్ దాకా ఇందులో కొంత భాగాన్నే తప్ప ఎవరూ అంతటినీ పరిపాలించ లేదు. బ్రిటిష్ వాళ్ళు మొత్తం అంతటికీ తాము సార్వభౌములమని ప్రకటించుకున్నారు గానీ వాళ్ళ ప్రత్యక్షంగా పరిపాలించిన ప్రాంతం ('బ్రిటిష్ పాలిత ప్రాంతం') సగ భాగం మాత్రమే. మిగిలిన సగం భూభాగాన్ని బ్రిటిష్ వారికి సామంతులయిన రాజులు, నవాబులు, జాగీర్దార్లు, సంస్థానాధీశులు పరిపాలించారు. బ్రిటిష్ వాళ్ళు వెళ్ళిపోగానే తాము తిరిగి స్వతంత్రులం కావాలని వీళ్ళు కోరుకున్నారే తప్ప అందరూ ఒకే ఒక 'భారతదేశం'లో కలిసి పోవాలని కోరుకోలేదు. బ్రిటిష్ ప్రభుత్వంతో చర్చలు జరిగినప్పుడల్లా వాళ్ళు ఈ విషయాన్ని నొక్కి చెప్పారు.

ఉపఖండంలోని ప్రజలంతా ఒకటయి ఇటు స్థానిక రాజవంశాల పాలనకూ అటు బ్రిటిష్ పాలనకూ వ్యతిరేకంగా పోరాటం చేసి విముక్తి పొంది వుంటే ఒక 'భారతదేశం' అనేది సహజంగా ఏర్పడి వుండేదేమో గానీ అటువంటిదేమీ జరగలేదు. గిరిజనులూ రైతాంగమూ కార్మికులూ చేసిన అనేక పోరాటాలు, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాలు, విడివిడిగా అనైక్యంగా ఉండిపోయాయి. ఐక్యత సాధించినది బ్రిటిష్ పాలిత ప్రాంతాలలోని సంపన్న వర్గాలు మట్టుకే. వాళ్ళంతా ఒకటయి కాంగ్రెసు నాయకత్వంలో బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా బేరసారాల, రాజీ సర్దుబాట్ల, పోరాటం, నడిపారు. స్థానిక రాజ్యాలలోనూ సంస్థానాలలోనూ ఎటువంటి పోరాటాలూ జరగకుండ కాంగ్రెస్ జాగ్రత్త పడింది. ఆ విషయం గాంధీ సగర్వంగా ప్రకటించుకున్నాడు కూడా. బ్రిటిష్ పాలిత ప్రాంతములోని సంపన్నులు 'బ్రిటిష్ సామ్రాజ్యం అనే కుటుంబములో మాకు కూడా ఒక గౌరవనీయమయిన స్థానం కావాలని' (ఇవి గాంధీగారి మాటలు) జరిపిన ఉద్యమం కాంగ్రెస్ వారి జాతీయ పోరాటం.

ఈ ఉద్యమం ఫలించే నాటికి స్థానిక రాజ్యాలనూ సంస్థానాలనూ ఏం చేయాలనే సమస్య వచ్చింది. బ్రిటిష్ వాళ్ళు వెళ్ళిపోగానే వాళ్ళతోబాటు వాళ్ళ సార్వభౌమత్వం కూడ పోవాలనీ ఆ సార్వభౌమత్వం కొత్త భారత ప్రభుత్వానికి సంక్రమించడానికి వీలు లేదనీ తాము స్వతంత్రులం కావాలనీ స్థానిక రాజులూ, సంస్థానాధీశులూ మొదటి నుంచీ వాదిస్తూ వచ్చారు. బ్రిటిషువాళ్ళు కూడ, స్థానిక రాజ్యాలు

పూర్తిగా స్వతంత్రంగా ఉండకున్నా, తాము కోరుకున్నా స్వయం ప్రతిపత్తిని కలిగి వుండాలని భావించారు. సైమన్ కమీషన్ (1927), భారత ప్రభుత్వ చట్టం (1935), క్రిప్స్ రాయబారం (1942), కేబినెట్ రాయబారం (1947), అన్నికూడ కుడి ఎడమలుగా ఈ అభిప్రాయాన్నే వెలిబుచ్చాయి. కాంగ్రెసు నాయకులు అన్ని విషయాల లాగ ఈ విషయంలో కూడ బయటికి ఈ స్వయంప్రతిపత్తి వాదాన్ని వ్యతిరేకిస్తూ లోపాయకారీగా దానితో రాజీ పడుతూ వచ్చారు. అధికార మార్పిడి జరిగి నూతన రాజ్యాంగాన్ని రాయడానికి సమాయత్తమైన భారత రాజ్యాంగ సభ బ్రిటిష్ కమీషన్ల సంప్రదాయాన్ని ఆమోదించింది. ప్రతి స్థానిక సంస్థానానికీ ఇటు భారతదేశంలో గానీ, అటు పాకిస్తాన్‌లో గానీ విలీనం అయ్యే హక్కు వుంటుందనీ, ఆ విలీనానికి ప్రాతిపదికగా ఒక విలీన ఒడంబడిక (Instruments of accession) మీద ఇరు పక్షాలూ సంతకం చేయాలనీ, విలీనమయ్యే సంస్థానం కొత్త కేంద్ర ప్రభుత్వానికి ఆ ఒడంబడికలో ఏ అధికారాలనయితే దత్తం చేస్తుందో (ప్రధానంగా రక్షణ, విదేశ వ్యవహారాలు, రవాణా సౌకర్యాలు) అవి తప్ప తక్కిన అన్ని విషయాలలోనూ స్వయం ప్రతిపత్తిని కలిగి వుంటుందనీ భారత రాజ్యాంగ కర్తలు ఒప్పుకున్నారు. ఇది వారు స్వచ్ఛందంగా అంగీకరించిన విషయమే తప్ప ఎవరూ కుట్ర పూరితంగా సాధించుకున్నది కాదు. ఎవరో దేశద్రోహుల చర్యకాదు.

చిన్న చిన్న రాజ్యాలూ సంస్థానాలు తమకు ఏ స్వయం ప్రతిపత్తీ వద్దని పూర్తిగా విలీనం అయిపోయాయి. పెద్ద రాజ్యాలయిన మైసూరు, భోపాల్, జమ్మూ-కాశ్మీర్, హైదరాబాద్ కొంత తటపటాయించాయిగానీ వల్లభాయి పటేల్ వాటిని నయానా భయానా ఒప్పించి సంపూర్ణ విలీనాన్ని సాధించాలని ప్రయత్నించి జమ్మూ-కాశ్మీర్ తప్ప తక్కిన అన్ని సంస్థానాలనూ విలీనం చేసాడు. ఇక బ్రిటిష్ పాలిత ప్రాంతాలలోని ప్రజలకయితే భారతదేశంలో చేరడం చేరకపోవడం అనే స్వేచ్ఛే లేదు. చేరడానికి పెద్దగా అభ్యంతరం లేని ప్రాంతాలే కాక ఎంత మాత్రం ఇష్టంలేని నాగాలాండ్, మిజోరం, మణిపూర్‌లు కూడ బలవంతంగా భారతదేశంలో భాగమయ్యాయి. మన దేశ సమగ్రత సమైక్యతల చరిత్ర ఇది.

జమ్మూ-కాశ్మీర్ మట్టుకు ఇటు భారతదేశంలో గానీ అటు పాకిస్తాన్‌లో గానీ చేరడానికి ఇష్టపడలేదు. నైసర్గికంగా ఆ రాష్ట్రం స్వతంత్రంగా ఉండగలదు. ప్రత్యేకమయిన జాతి, భాష, సంస్కృతి ఉన్నాయి. కాశ్మీర్ జాతీయ భావం చాలా లోతయినది. భారత పాకిస్తాన్ దేశాలు ఆ జాతీయ భావాన్ని గౌరవించి వుంటే జమ్మూ-కాశ్మీర్ స్వతంత్రంగా ఉండేదేమో. అయితే ఈ దేశాల పాలకులలో అంతటి ప్రజాతంత్ర స్వభావం ఏరోజూ లేదు. ఎవరికి వారు కాశ్మీర్‌ను ఎట్లా కలుపుకోవాలి అని చూసారు. జమ్మూ-కాశ్మీర్‌లో అత్యధికులు ముస్లింలు కాబట్టి మాకే చెందాలని పాకిస్తాన్ అంటే, పరిపాలకుడయిన హరిసింగ్ హిందువు కాబట్టి భారతదేశంలో చేరకపోతాడా అని మనవాళ్ళు ఆశపెట్టుకున్నారు. పాకిస్తాన్ వాదనలతో



జనవరి 22న పోలీసు చర్యకు నిరసనగా శ్రీనగర్‌లోని ఛోటా బజార్‌లో

జనవరి 22న పోలీసు చర్యకు నిరసన తెలుపుతున్న ప్రజ

సరిపెట్టుకోక 1947 అక్టోబర్ 26వ తేదీన దుండగుల ముఠాలను కాశ్మీర్ మీదికి పంపించింది. కాశ్మీర్ రాజు గాభరాపడి భారత ప్రభుత్వం అండ కోరాడు. ఈదేశంలో విలీనం అయితే సైనిక సహాయం దొరుకుతుందని విలీన ఒడంబడిక మీద సంతకం చేసి జమ్మూ-కాశ్మీర్‌ను భారతదేశంలో కలిపాడు. అయితే విలీన ఒడంబడిక ప్రకారం రక్షణ, విదేశ వ్యవహారాలు, రవాణా ప్రసార సాధనాలు తప్ప తక్కిన విషయాలలో జమ్మూ-కాశ్మీర్‌కు స్వయం ప్రతిపత్తి ఉంటుంది. ఇది ఇరుపక్షాలూ ఒప్పుకున్న ఒడంబడికే?

రాజ్యాంగాన్ని తయారు చేయడం మొదలు పెట్టే సరికి పరిస్థితి ఇది. జమ్మూ-కాశ్మీర్‌కు ఉన్న ప్రత్యేక స్థితిని రాజ్యాంగ కర్తలు స్పష్టంగా గుర్తించారు. వాళ్లంతా 'దేశభక్తులే', పాకిస్తాన్ ఏజెంట్లు కారు. దేశ విచ్ఛిన్నకులు కారు. ఆర్టికల్ 370ని ప్రతిపాదించిన గోపాలస్వామి అయ్యంగార్ జమ్మూ-కాశ్మీర్ విలీనం వెనక వున్న చరిత్రను వివరించి, ఆ చరిత్రను దృష్టిలో ఉంచుకొని ఆ రాష్ట్రం కోసం ప్రత్యేక అధికారాన్ని ప్రతిపాదిస్తున్నా నన్నాడు. విలీన ఒడంబడికలో చెప్పిన మేరకు మాత్రమే కేంద్ర ప్రభుత్వానికి కాశ్మీర్ మీద శాసన అధికారం ఉంటుందనీ, ఏదయినా ఒక విషయం ఆ పరిధిలోకి వస్తుందా రాదా అన్న విషయాన్ని భారత ప్రభుత్వం కాశ్మీర్ ప్రభుత్వాన్ని సంప్రదించి నిర్ణయిస్తుందనీ, విలీన ఒడంబడికలో లేని విషయాలలో కూడా కేంద్ర ప్రభుత్వం తనకు శాసనాధికారం కావాలని కోరుకుంటే రాష్ట్ర ప్రభుత్వం అనుమతితో మాత్రమే పొందగలదనీ ఆర్టికల్ 370 అంటుంది.

ఇందులో మూడవ అంశమే కాశ్మీర్ వ్యక్తిత్వానికి గొడ్డలి పెట్టు అయింది. స్వయం ప్రతిపత్తి ఇస్తున్నామని ఒకవైపు చెప్తూ ఆ స్వయం ప్రతిపత్తిని రాష్ట్ర ప్రభుత్వం అనుమతితో తొలగించ వచ్చునని కొసరు చేర్పడం వలన స్వయం ప్రతిపత్తి ఏ మాత్రం మిగలలేదు. ప్రజాస్వామికంగా ఎన్నికయిన షేక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని 1953లో గవర్నర్ కరణ్‌సింగ్ (మాజీ రాజు హరిసింగ్ కొడుకు) 'అసమర్ధ పాలన' అనే పేరుపెట్టి బర్తరఫ్ చేసాడు. షేక్ అబ్దుల్లాను అరెస్టు చేసారు. ఈరకంగా రాష్ట్ర ప్రభుత్వాన్ని లొంగదీసుకొని, 1954లో 'రాష్ట్ర ప్రభుత్వం అనుమతితో' కేంద్ర ప్రభుత్వానికి ఇతర రాష్ట్రాలలో ఉన్న శాసన అధికారాన్ని కాశ్మీర్‌లో కూడ దత్తం చేసే 'రాజ్యాంగం (జమ్మూ-కాశ్మీర్ సంబంధిత) ఆర్డర్' జారీ చేసింది కేంద్ర ప్రభుత్వం. దీనితో ఆర్టికల్ 370 పూర్తిగా నిస్సారమయి పోయింది. 1957లో జమ్మూ-కాశ్మీర్‌కు ఒక ప్రత్యేక రాజ్యాంగాన్ని రాసుకున్నారు గానీ అంతిమ పరిశీలనలో జమ్మూ-కాశ్మీరుకు మిగిలిన స్వయం ప్రతిపత్తి శూన్యం.

1947లోనే పాకిస్తాన్‌తన ఎత్తుగడ విఫలమయిందని గుర్తించి 'కాశ్మీర్ సమస్య'ను ఐక్యరాజ్య సమితికి నివేదించింది. కాశ్మీర్ భవితవ్యాన్ని కాశ్మీర్ ప్రజలే నిర్ణయించుకోవాలనీ, అందుకోసం ప్లెబిసైట్ (Plebiscite), అంటే సర్వజన అభిప్రాయ సేకరణ నిర్వహించాలనీ ఐక్యరాజ్య సమితి తీర్మానించింది. ఆ రోజులలో నెహ్రూకూడ 'కాశ్మీర్ భవితవ్యాన్ని కాశ్మీర్ ప్రజలే నిర్ణయించుకుంటారు. ఇది మేము కాశ్మీర్ ప్రజలకే కాక యావత్ ప్రపంచానికీ ఇస్తూ వున్న వాగ్దానం' అని ప్రకటించాడు. ఆరేళ్ల తరువాత అదే నెహ్రూ షేక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయించి, కాశ్మీర్ స్వయం ప్రతిపత్తిని హుళక్కి చేసే 1954 ఆర్డర్‌ను జారీచేసి, 1957 ఎన్నికల నాటికి 'కాశ్మీర్ భారత భూభాగమేననడంలో ఎటువంటి వివాదానికీ తావులేదు' అని ప్రకటించడం మొదలు పెట్టాడు. ఐక్యరాజ్య సమితిలో పాకిస్తాన్ కాశ్మీర్ ప్రస్తావన తెచ్చినప్పుడల్లా భారతదేశం సోవియట్ రష్యా యొక్క వీటో అధికారాన్ని అడ్డం పెట్టుకొని బయట పడుతూ వుంది.



స్వతంత్ర కాశ్మీర్ కోసం నినదిస్తున్న ప్రజ

కాశ్మీర్‌లో మళ్లీ ప్రజా ప్రభుత్వం ఏర్పడడం అంటూ జరిగితే సమస్య తిరిగి మొదటికొస్తుందని చెప్పి కాంగ్రెస్ ప్రభుత్వం ఆ రాష్ట్రంలో ఏ ఒక్క ఎన్నికా కూడ సక్రమంగా జరగనివ్వలేదు. అన్ని ఎన్నికలలోనూ రిగ్గింగ్, హింసాకాండ, పెద్ద ఎత్తున జరుగుతూ వచ్చాయి. ఎప్పుడూ కూడా కేంద్రానికి తొత్తులయిన వాళ్లే

## [illegible]

(ప్రశాంతమైన కాశ్మీర్ లోయలో వేర్పాటు ఆందోళన మునుపటి కన్నా తీవ్రంగా రగుల్కొంటున్నది. ఎక్కడ చూసినా అమనుల్లాఖాన్ పేరు విపరీతంగా వినపడుతున్నది. అమనుల్లాఖాన్ ప్రముఖ కాశ్మీర్ తీవ్రవాది మఖ్బూల్ భట్‌కు సన్నిహిత మిత్రుడు. మఖ్బూల్‌భట్‌ను తీహార జైల్లో 1984లో ఉరి తీశారు. అమనుల్లాఖాన్ లండన్ కేంద్రంగా గల జమ్మూ కాశ్మీర్ లిబరేషన్ ఫ్రంటుకు అధ్యక్షుడు. ఈయన బ్రిస్టల్ జైలులో ఉండగా ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ సంపాదకుడు ప్రీతిష్ నంది 1985లో ఇంటర్వ్యూ ఇచ్చారు. ఆ ఇంటర్వ్యూ లోని ముఖ్య భాగాలను ఈ కింది ఇస్తున్నాం.)

**మీ ఆర్గనైజేషన్ ఎందుకు చీలింది? మీకు ఇన్నిగ్రూపుల మధ్య ఉన్న విభేదాలు ఏమిటి?**

వారు పాకిస్తాన్ అనుకూలురు. మేము కాశ్మీర్ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నప్పుడు ఇండియానుంచి ఎంత దూరంగా ఉండాలనుకుంటున్నామో పాకిస్తాన్‌తో కూడా అంతే. స్నేహమైనా అంతే. వారు పాకిస్తాన్‌తో సంబంధం కలిగి ఉన్నారన్నది జగమెరిగిన సత్యం.

**కాని మీరు కూడ ఇండియా పట్ల ఉన్నంత వైరంతో పాకిస్తాన్ పట్ల లేరు.**

అది నిజం కాదు. మేము ఇండియాతో గానీ, పాకిస్తాన్‌తో గానీ వైరభావంతో లేము. మా దేశాన్ని మేము పాలించుకునేందుకు మమ్మల్ని ఒంటరిగా వదిలేస్తే చాలు. కాశ్మీర్‌కు స్వాతంత్ర్యం కావాలి. మేము కోరుకుంటున్నదీ అదే.

పాకిస్తాన్ గురించి. మా కోసం జియా ఉల్‌హక్ ఏమి చేశాడు? ఏమీ లేదు. కాని ఒకటి నిజం. కాశ్మీర్ అధ్యాయాన్ని ముగిస్తామని మీ దేశం బెదిరిస్తున్నట్టు వారు చేయడం లేదు.

**జె.కె.ఎల్.ఎఫ్. ముఖ్య లక్ష్యాలు ఏమిటి?**

విదేశీ ఆధిపత్యం నుంచి కాశ్మీర్‌కు స్వేచ్ఛ కావాలి. పాకిస్తాన్‌కు గానీ, ఇండియాకు గానీ చెందని స్వతంత్ర దేశం ఏర్పడాలి. అది కాశ్మీర్ ప్రజలకు చెంది ఉండాలి.

**దీన్ని ఎలా సాధించాలనుకుంటున్నారు?**

మా హక్కుల కోసం పోరాడ్డం ద్వారా. ఇది దీర్ఘకాలిక పోరాటమని మాకు తెలుసు. ఎవరూ మమ్మల్ని బుజ్జగించి స్వాతంత్ర్యం ఇవ్వరనీ తెలుసు. మేము అడుగడుగున పోరాటం చేయాల్సిందే. కాని మీరు మా పోరాటాన్ని గౌరవించాలి. స్వాతంత్ర్యం కోసం మా పోరాటాన్ని గౌరవించడం ఇండియా నేర్చుకోవాలి.

**పాకిస్తాన గూఢచార సంస్థల ద్వారా మీ ఆర్గనైజేషన్‌కు డబ్బు అందుతున్నట్లు అధికారులు అన్నారు.**

ఆ గ్రూపుకు కావచ్చు. మాకు కాదు.

**మీ గ్రూపుకు ఎందుకు రాదు?**

మాలో స్వాతంత్ర్య కాంక్ష ఉంది. మాకు జియా అన్నా మరెవరన్నా ఇష్టం లేదు. మాకు స్వతంత్ర కాశ్మీర్ కావాలి.

**మీరు హింసను నమ్ముతారా?**

స్వాతంత్ర్య [illegible] కూడా [illegible] మార్గమని చెప్పను. [illegible] దారుల హింసను ఎదుర్కో[illegible] యోధుడు హింసక [illegible].

**సిక్కు తీవ్రవాదుల గురించి ఏమంటారు?**

వాళ్ళు మా స్నేహితులు. స్వంత దేశం కోసం వారి పోరాటాన్ని మేము బలపరుస్తాం. కాశ్మీర్ లాగే ఖలిస్తాన్ కూడా ఒక రోజు స్వతంత్రం అవుతుంది. ఏ దేశం కూడా ఎల్లకాలం బానిసత్వంలో మగ్గిపోదు. దీన్ని భారత ప్రభుత్వం తప్పక తెలుసుకుంటుంది. పోరాటంలో మేము, సిక్కులు ఒకటిగా ఉన్నాం.

**మీ చర్యల పర్యవసానం పట్ల మీకు చింతలేదా?**

మేమెందుకు చింతించాలి. భారత ప్రభుత్వమే చింతించాలి.

(ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ సౌజన్యంతో)

---

గెలుస్తూ వచ్చారు. 1975లో ఇందిరా గాంధీకి షేక్ అబ్దుల్లాకు జరిగిన ఒడంబడికలో కాశ్మీర్ సమస్య పరిష్కారం అయిపోయిందని అబ్దుల్లా ఒప్పుకున్న తరువాతనే అతని రాజకీయ స్వేచ్ఛ పునరుద్ధరించబడింది. ఆ తరువాత అతను తిరిగి అధికారంలోకి రాగలిగాడు. అతని మరణానంతరం 1983లో అతని కుమారుడు ఫరూక్ అబ్దుల్లా ఎన్నికయ్యాడు. అయితే ఇతను మళ్లీ ఇతర ప్రతిపక్ష పార్టీలతో కలసి రాష్ట్రాల స్వయం ప్రతిపత్తిని గురించి మాట్లాడడం ప్రారంభించే సరికి 1984లోనే ఇతని ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసారు. తిరిగి ఫరూక్ అబ్దుల్లా కాంగ్రెస్‌కు తొత్తుగా మారడానికి ఒప్పుకొని రాజీవ్ గాంధీతో 1986లో ఒప్పందం చేసుకున్న తరువాతే అధికారానికి రాగలిగాడు. దాని వల్ల అతను పొందిన ప్రతిఫలం ఏమిటంటే, విపరీతమయిన స్థాయిలో అవినీతికి బాహాటంగా పాల్పడడం ప్రారంభించినా కేంద్రం జోక్యం చేసుకోకుండా కొనసాగ నిచ్చింది.

ఇదీ క్లుప్తంగా 'కాశ్మీర్ సమస్య' చరిత్ర. కాశ్మీర్ ప్రజల జాతీయ వ్యక్తిత్వాన్ని అగౌరవపరచి, వాళ్లకు కల్పిస్తామని హామీ యిచ్చిన స్వయం ప్రతిపత్తినే స్వయం నిర్ణయాధికారాన్ని లేకుండా చేసి, కనీసం పార్లమెంటరీ ప్రజాస్వామ్య సంప్రదాయాలను విలువలనూ పాటించకుండ కేంద్రానికి కాంగ్రెస్ పార్టీకి తొత్తులయిన వారికి మట్టుకే కాశ్మీర్‌లో అధికారానికి వచ్చే అవకాశం వుందని పదే పదే స్పష్టంచేసి, అందుకోసం ప్రభుత్వాలను బర్తరఫ్ చేసి, హింసకు పాల్పడి - ఇన్ని చేసిన తరువాత కాశ్మీర్ ప్రజలకు భారత దేశం మీద ఇంకా ప్రేమ మిగిలివుంటే మనం ఆశ్చర్యపోవాలి గానీ ద్వేషం పెరిగితే ఆశ్చర్యపోవలసిన అవసరం ఏముంది? అసలు భారతదేశంలో అంతర్భాగంగా ఉండడంవల్ల జమ్మూ-కాశ్మీర్ ఏం సాధించింది. ఏ ప్రయోజనం పొందింది? కనీస పారిశ్రామిక ప్రగతి గానీ ఆర్థిక అభివృద్ధి గానీ ఈ నాలుగు దశాబ్దాలలో కాశ్మీర్‌కు దక్కాయా? ఏ ప్రయోజనమూ పొందనప్పుడు వాళ్ళు ఈదేశంతో విలీనం కావాలని ఎందుకు కోరుకోవాలి? నాలుగు దశాబ్దాల దగా కోరు పాలన ఫలితంగా ఇవ్వాళ కాశ్మీర్ ప్రజలు నూటికి నూరుశాతం తమకు భారత దేశంలో అంతర్భాగంగా ఉండాలని లేదని స్వాతంత్ర్యం కావాలనీ కోరుకుంటూ వుంటే, సైన్యం మోహరింపులకూ, పోలీసుల కాల్పులకూ బెదరకుండ భయపడకుండ వేల సంఖ్యలో ఊరేగింపులు చేస్తూవుంటే ఇదంతా దేశద్రోహుల నిర్వాకమని పాకిస్తాన్ సాగిస్తున్న దుర్మార్గమనీ ఎన్నాళ్ళు ఆత్మవంచన చేసుకుంటాం? 'దేశభక్తిని' 'దేశ సమగ్రత'నూ తుపాకులతో నిలబెట్టాలనే అర్థరహితమయిన ప్రయత్నాన్ని ఎన్నాళ్ళు సహిస్తాం?

**కె. బాలగోపాల్**



# రైతు- వ్యవసాయదారుల ఉద్యమాలు

**సంఘటిత రైతు ఉద్యమాలు** 20వ శతాబ్దంలో బయలుదేరినా రైతు తిరుగుబాట్లు, రైతు పోరాటాలు 18, 19వ శతాబ్దంలో చాలా జరిగాయి. వీటిల్లో కొన్ని బ్రిటీషు వారికి వ్యతిరేకం గానూ, మరికొన్ని వారు ప్రవేశపెట్టిన జమీందార్ల, జాగీర్దార్ల, ముఠాదార్లకు వ్యతిరేకంగానూ, మరికొన్ని వడ్డీ వ్యాపారస్తులకు వ్యతిరేకంగానూ జరిగాయి. అయితే 18, 19వ శతాబ్దాలలో జరిగిన తిరుగుబాట్లు, పోరాటాలు సంఘటితమైనవి కావు.

మహాత్మాగాంధీ భారతదేశానికి తిరిగివచ్చి, భారత జాతీయ కాంగ్రెసు నాయకత్వం వహించిన తరువాత రైతాంగాన్ని జాతీయ పోరాటంలోకి సమీకరించడానికి ఆయన కృషి చేసారు. బీహారులోని చంపారన్ జిల్లాలో నీలిమందు తోటల యజమానులైన తెల్లవారికి వ్యతిరేకంగా ఆయన రైతాంగ పోరాటాన్ని నిర్వహించారు. అదేవిధంగా గుజరాత్ రాష్ట్రంలోని ఖెడా జిల్లా రైతు పోరాటం, బార్డోలీ రైతుల శిస్తు నిరాకరణోద్యమం, ఆంధ్రప్రదేశ్ లోని గుంటూరు జిల్లాలో జరిగిన పెదనందిపాడు- శిస్తు నిరాకరణోద్యమం, పల్నాడు రైతుల అటవీ రైతుల పోరాటం, ఉత్తర ప్రదేశ్‌లో బాబా రామచందర్ నాయకత్వాన జమీందార్లకు వ్యతిరేకంగా జరిగిన శిస్తు నిరాకరణోద్యమంతో పాటు ఎన్నో పోరాటాలు జరిగాయి.

ఈ పోరాటాల తరువాత ఆంధ్ర, యు.పి., మొదలగు కొన్ని రాష్ట్రాలలో రైతులను సంఘటిత పరచడం, సంఘాలు ఏర్పాటు జేసి, సభ్యత్వం చేర్పించడం, మహా సభలు జరపడం ప్రారంభమయింది.

1929-33 మధ్య సంభవించిన ప్రపంచ ఆర్థిక మాంద్యం ఫలితంగా, మనదేశంలోని రైతు కూలీలు కూడ చాల దుస్థితికి లోనయ్యారు. పేద రైతులు తెచ్చిన అప్పులు తీర్చలేక భూములు కోల్పోయారు. రైతులను-సివిలు ఖైదీలుగా జైళ్లకు కూడ పంపారు.

1934లో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఏర్పడింది. భారత కమ్యూనిస్టు పార్టీ పునస్సంఘటితమైంది. కాంగ్రెసు సోషలిస్టులు, కమ్యూనిస్టులు, అతివాద కాంగ్రెసు వాదులు కలిసి గ్రామీణ వర్గ సంఘాలు స్థాపించి, రైతులను, వ్యవసాయ కూలీలను సంఘటిత పరచాలని, తద్వారా జాతీయ పోరాటానికి కూడా ప్రూపు వస్తుందని భావించారు. వీరందరి కృషి ఫలితంగా అప్పటికే కొన్ని రాష్ట్రాలలో ఏర్పడిన రైతు సంఘాలను సమన్వయ పర్చి 1936లో లక్నోలో అఖిల భారత రైతు సంఘాన్ని స్థాపించటం జరిగింది.

అఖిల భారత కిసాన్ సభకు రోజువారీ సమస్యలపై పోరాడే తాత్కాలిక కార్యక్రమంతో పాటు, దీర్ఘకాలిక లక్ష్యం కూడ వుంది. బ్రిటీషు పాలన, జమీందారీ జాగీర్దారీ, భూస్వామ్య విధానాల రద్దుకై పోరాడటంతో పాటుగా ప్రజాస్వామ్య ప్రాతిపదికపై కిసాన్-మజ్దూర్ రాజ్యస్థాపన కొరకు పోరాడటం అనే దీర్ఘకాల లక్ష్యం కూడా అఖిల భారత కిసాన్ సభకు వుంది. దీని నాయకత్వాన దేశమంతటా అనేక వీరోచిత పోరాటాలు జరిగాయి.

స్వాతంత్ర్యం తరువాత అధికారంలోకి వచ్చిన బూర్జువా ప్రభుత్వం దేశాన్ని పెట్టుబడిదారీ పంథాలో అభివృద్ధి చేయాలని నిర్ణయించింది. దేశ వ్యాపితంగా జరిగిన బలమైన రైతు పోరాటాల పూర్వరంగంలో చట్టబద్ధ భూస్వామ్య విధానం, అంటే జమీందారీ, జాగీర్దారీ మొదలగు విధానాలను రద్దు చేయటానికి, రాజరిక సంస్థానాల విలీకరణకు చర్యలు తీసుకున్నది. అటు తరువాత కౌలుదారీ చట్టాలు, గరిష్ట భూ పరిమిత చట్టాలు మొదలైన చట్టాలు వచ్చాయి. ఈ భూసంస్కరనల ద్వారా ఆశించిన ఫలితాలు కలుగ లేదు. ఇవి అర్ధాంతరంగా ఆగిపోయాయి.

1966 నుండి సంస్థాగత సంస్కరణలను మూలపెట్టి, ఆకుపచ్చ విప్లవాన్ని వ్యవసాయ రంగంలో ప్రవేశపెట్టడం జరిగింది. ఈ కొత్త వ్యవసాయ విధానానికి అనుకూలమైన రాష్ట్రాలలో ఆర్థిక, సాంకేతిక ప్రాతిపదిక ఏర్పాట్లు వగైరాలను కేంద్రీకరించడం జరిగింది.

ఈ నూతన వ్యవసాయ విధానం వల్ల, అంతకు ముందునుండీ ప్రభుత్వ ప్రోత్సాహం వల్ల అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ సంబంధాలకు పెద్ద ఊపు వచ్చింది. అధిక పెట్టుబడులతో అధిక దిగుబడులు సాధించడం జరిగింది. 1966 నుండి 1975 వరకు వ్యవసాయ పంటలను కొంతవరకు గిట్టుబాటు ధరలు కూడ వుండటంలో ధనిక రైతులు, పెట్టుబడిదారీ వ్యవసాయదారులు బాగా లాభాలు గడించారు. గ్రామీణ ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలపై ధనిక రైతు, పెట్టుబడి దారీ వ్యవసాయ దారుల పట్టు ఎక్కువైంది. ఉన్నవారికి, లేనివారికి మధ్య అంతరం మరీ ఎక్కువయింది దీనితో పాటు షెడ్యూలు కులాలు, తరగతుల ప్రజలు పైన, ఇతర వెనుకబడిన ప్రజల పైన వీరి దౌర్జన్యాలు పెరిగాయి.

పెట్టుబడిదారీ వ్యవసాయాభివృద్ధితో పాటు, వీరి హక్కులకై పోరాడే వ్యవసాయ దారుల సంఘాలు కూడా ఆవిర్భవించాయి. ఇందుకు ప్రధాన కారణాలు కొన్ని వున్నాయి. వ్యవసాయంలో పెట్టుబడులు అధికంగా పెట్టవలసి రావడం, వ్యవసాయ పంటలకు గిట్టుబాటు ధరలు రానందు వల్ల ధరవరులలో ఒడుదుడుకులు ఏర్పడి, రైతులు దెబ్బతింటున్నారు. ప్రకృతి బీభత్సాల వల్ల పంటలు పోతే రైతులను ఆదుకోవడానికి సమగ్ర పంటల భీమా పద్ధతి గాని మరో

ప్రత్యామ్నాయ పద్ధతి గాని ఏదీ లేదు. బావుల క్రింద వ్యవసాయం పెరగడంతో రైతులకు విద్యుచ్ఛక్తి సకాలంలో సరిపడా అందకపోవటం ఒక ముఖ్య సమస్యగా ముందుకు వచ్చింది. దీనితో పాటు విద్యుత్ టారిఫ్ కూడా ముఖ్య సమస్యగా ముందుకు వచ్చింది. ఈ సమస్యలతో పాటు పరపతి, ఇరిగేషన్, వరద నిరోధక పథకాలు, మురుగునీటి సౌకర్యాలు వగైరా సమస్యలు కూడ ముందుకు వచ్చాయి. ఇలాగ పేరుకు పోయిన అప్పుల రద్దు కూడ ఒక ముఖ్య సమస్యగా ముందుకు వచ్చింది.

వాణిజ్య పంటలవిషయంలో మరొక అంశం వుంది. వీటి ఉత్పత్తికి హెచ్చు పెట్టుబడులు కావాలి. ధరల పరిస్థితిలో తీవ్ర ఒడుదుడుకులు సంభవిస్తుంటాయి. ఒక్కొక్కప్పుడు రైతు పూర్తి దివాలా ఎదుర్కొంటాడు.

ఈ పై కారణాల వల్ల నూతన వ్యవసాయ విధానాభివృద్ధితో పాటు, కొత్త తరహా వ్యవసాయదారుల సంఘాలు ప్రధానంగా పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధి చెందిన రాష్ట్రాల ప్రాంతాలలో వచ్చాయని పైన పేర్కొన్నాము.

తమిళనాడులో నారాయణస్వామి నాయుడు నాయకత్వాన తమిళనాడు వ్యవసాయ దారుల సంఘం 1974 నుంచి 1982 వరకు విద్యుత్ బకాయిల రద్దు, అప్పుల రద్దు, విద్యుత్ టారిఫ్ తగ్గింపు సమస్యలపై సమరశీల పోరాటాలను నిర్వహించింది. రోడ్డు దిగ్బంధన అనే కొత్త తరహా పోరాట రూపాన్ని నారాయణ స్వామి నాయుడు చేబట్టాడు. రైతులు, వ్యవసాయ దారులు తమ తమ బండ్లు, ట్రాక్టర్లు తెచ్చి రోడ్డు కడ్డంగా పెట్టడం, వాహనాల రాకపోకలను అనేక రోజుల పాటు నిలిపి వేయటం జరిగింది. ప్రభుత్వం ఎంతో దమనకాండను ప్రయోగించింది. లాఠీచార్జీలు, పోలీసు కాల్పులు జరిగాయి. వీటిలో 35 మందికి పైగా రైతులు, తదితరులు చనిపోయారు. ఈ ఉద్యమం అనేక విజయాలను కూడ సాధించింది.

కర్ణాటకలో రుద్రప్ప నాయకత్వాన కర్ణాటక రాజ్య రైతు సంఘం , మహారాష్ట్రలో శరద్ జోషి నాయకత్వాన షేత్‌కారీ సంఘటన, గుజరాత్ రాష్ట్రంలో ఖేదత్ సమాజ్, పంజాబులో ఖేతబారీ జమీందారీ యూనియన్ మొదలగు వ్యవసాయ దారుల సంస్థలు 1980-81 సంవత్సరాలలో ఏర్పడ్డాయి.

రుద్రప్ప నాయకత్వాన ధార్వాడ్ జిల్లాలోని మాలప్రభ ప్రాజెక్టు క్రింద భూములకు నీరు రాకముందే అభివృద్ధి పన్ను వసూలుకు పూనుకోగా దానిని నిరోధిస్తూ, పెద్ద పోరాటం జరిగింది.

శరద్ జోషి నాయకత్వాన నాసిక్ ప్రాంతంలో ఉల్లిపాయల ధరలు పడిపోగా, దానిపై సమరశీల పోరాటం, రోడ్డు దిగ్బంధన పోరాటం జరిగింది. అటు తరువాత శరద్ జోషి కర్ణాటకలోని నిప్పాణి పొగాకు రైతు పోరాటాన్ని, విదర్భ ప్రాంతంలో ప్రత్తి రైతుల పోరాటాన్ని నిర్వహించారు.

గుజరాత్‌లో ఖేదత్ సమాజ్ సంస్థే గాక, మరికొన్ని వ్యవసాయ దారుల సంఘాలు కూడ ఏర్పడ్డాయి. ఇటు వంటివి 5 సంఘాలు కలిసి సమన్వయ కమిటీ ఏర్పాటు చేసాయి. దీనితోపాటు భారతీయ జనతా పార్టీ ప్రోత్సాహంతో భారత్ కిసాన్ సంఘం



భోపాల్‌లో బి.కె.యు. ఆధ్వర్యంలో జరిగిన రైతు ప్రదర్శన

అనే మరో వ్యవసాయదారుల సంఘం కూడా ఏర్పడి 1987 లో బ్రహ్మాండమైన పోరాటాన్ని నిర్వహించింది.

పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లో మహేందర సింగ్ తికాయత్ నాయకత్వాన ఏర్పడిన భారత కిసాన్ యూనియన్ విద్యుచ్ఛక్తి సప్లయిపై విధించిన కోతను ఎత్తివేయాలని, పెంచిన విద్యుత్ చార్జీలు తగ్గించాలని, పంటలకు గిట్టుబాటు ధరలు రావాలనే నినాదాలపై 1987, 88, 89 సంవత్సరాలలో పెద్ద పోరాటాలు నిర్వహించింది.

శరద్ జోషీ నాయకత్వాన మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలలో రైతుల అప్పుల సమస్యపై లక్షకు పైగా దివాళా పిటీషన్లు (ఇన్‌సాల్వెన్సీ) పెట్టించ బడ్డాయి.

వివిధ వ్యవయసాయ దారుల సంఘాలను సమన్వయం చేయడానికి నారాయణస్వామి నాయుడు 1981 డిసెంబరులో అఖిల భారత కిసాన్ సమ్మేళన్‌ను హైదరాబాదులో నిర్వహించారు. ఒక కమిటీని కూడా ఏర్పాటు చేసారు. కాని అది అంత ముందుకు పోలేదు.

కాని ఇటీవల తికాయత్, శరద్ జోషీల నాయకత్వాన 29 వ్యవసాయ దారుల సంఘాల ప్రతినిధులతో ఒక కేంద్ర సమన్వయ కమిటీ ఏర్పడింది. అయితే తికాయత్ ఆఖరి క్షణంలో ఈ కమిటీనుండి వైదొలగినాడు.

**వామపక్ష రైతు, వ్యవసాయ కార్మిక సంఘాలు**

1936లో స్థాపించబడ్డ అఖిల భారత కిసాన్ సభ ప్రారంభంలో వివిధ రాజకీయ అభిప్రాయాలు గల వారితో విశాల ఐక్య వేదికగా 1940 వరకు మాత్రమే కొనసాగ గలిగింది. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఏర్పడిన తీవ్ర అభిప్రాయ భేదాలు కారణంగా ముందుగా కాంగ్రెసు సోషలిస్టులు, అటు తరువాత రంగాగారి అనుచరులు, దీని నుండి వైదొలగారు. 1945లో స్వామి సహజానంద సరస్వతి కూడా వైదొలి గారు. అప్పటినుండి కమ్యూనిస్టులే ప్రధానంగా అఖిల భారత కిసాన్ సభలో వుండి పోరాటాలు నిర్వహించారు. 1964లో కమ్యూనిస్టు పార్టీ నుండి మార్కిస్టులు వైదొలిగారు. దాని ఫలితంగా అఖిల భారత కిసాన్ సభ 1968లో రెండు భాగాలుగా చీలిపోయింది. ఇతర వామపక్ష పార్టీలు కూడ రైతు సంఘాలను ఏర్పాటు చేసాయి. అటు తరువాత అప్పటి వరకు కొన్ని రాష్ట్రాలలో మాత్రమే వున్న వ్యవసాయ కార్మిక సంఘాలు కలిసి అఖిల భారత స్థాయిలో వ్యవసాయ కార్మిక సంఘం ఏర్పడింది.

మొత్తం మీద ఈనాడు ప్రతి రాజకీయ పార్టీ రైతు, వ్యవసాయ కార్మిక, కార్మిక తదితర ప్రజా సంఘాలను వేరుగా ఏర్పాటు చేసాయి. అయితే మూడేళ్ల క్రితం అఖిల భారత స్థాయిలో 7 వామపక్ష రైతు, వ్యవసాయ కార్మిక సంఘాలు కార్యక్రమాలను సమన్వయం చేయడానికి ఒక కేంద్ర సమన్వయ కమిటీని ఏర్పాటు చేసాయి.

దీని అధ్వర్యాన జాయింటుగానూ ఆయా సంఘాల నాయకత్వాన ప్రత్యేకం గానూ అనేక రైతు, వ్యవసాయ కార్మిక సమస్యలపై స్థానికంగానూ, అఖిల భారత స్థాయిలలోనూ అనేక పోరాటాలు జరిగాయి. ఈ సంఘాలు తీసుకున్న ప్రధాన సమస్యలు :-

1. భూసంస్కరణల అమలు, 2. రైతు పంటలకు గిట్టుబాటు ధరలు, 3. రైతులకు, వ్యవసాయ కార్మికులను అవసరమైనంత సంస్థాగత పరపతి సప్లయి, 4. చిన్నకారు, సన్నకారు రైతుల పైన, వ్యవసాయ కార్మికులు, చేతి వృత్తుల వారిపైన పేరుకు పోయిన అప్పుల రద్దు. 5. వ్యవసాయ కార్మికులకు సరియైన కనీస వేతనం, సమగ్ర కేంద్ర చట్టం, 6. షెడ్యూల్డు కులాలు, తెగల ప్రజలపై దౌర్జన్యాలకు ప్రతిఘటన, 7. పంటలకు భీమా పథకం 8. ఇరిగేషన్, వరద నిరోధక పథకాలు, 9. ప్రభుత్వ పంపక విధానాన్ని మరింత పటిష్టం చేసి, గ్రామాలకు విస్తరింప జేసి నిత్య జీవితావసర వస్తువులన్నిటిని వాటి ద్వారా సప్లయి చేయటం, 10. ఇటీవల కాలంలో పెంచినందున పన్నుల రద్దు చేయాలి వ్యవసాయానికి విద్యుచ్ఛక్తి సప్లయి క్రమంగా జరగాలి.

వామపక్ష రైతు వ్యవసాయ కార్మిక సంఘాలు దేశ వ్యాపితంగా 1988, 1989 సంవత్సరాలలో పైన వివరించిన 10 అంశాల కార్యక్రమం పైన పెద్ద ఎత్తున పోరాట కార్యక్రమాలను నిర్వహించటం జరిగింది. 1987 లో దేశవ్యాపితంగా సెప్టెంబరు మాసంలో ప్రారంభించ బడిన సత్యాగ్రహ పోరాటంలో, 20 లక్షలకు మించిన ప్రజానీకం పాల్గొన్నది. 12 లక్షల మంది రైతులు, వ్యవసాయ కార్మికులు సత్యాగ్రహం చేసారు. వేలమంది అరెస్టు అయ్యారు. అనేకచోట్ల లాఠీ చార్జీలు జరిగాయి.

తిరిగి 1987 లో వామపక్ష రైతు వ్యవసాయ కార్మిక సంఘాల

**తిరిగి 1987లో వామపక్ష రైతు వ్యవసాయ కార్మిక సంఘాల నాయకత్వాన దేశవ్యాపితంగా భూ ఆక్రమణ పోరాటం జరిగింది. ఇతర రైతు, వ్యవసాయ కార్మిక సమస్యల పైన పోరాటాలు జరిగాయి. ఈ భూ ఆక్రమణ పోరాటంలో దేశవ్యాపితంగా 1,25,000 ఎకరాల భూమిని మిగులు భూములతో సహా, ఆక్రమించు కున్నారు. అనేక ప్రదేశాలలో భూస్వాముల గుండాల దాడులను ఎదుర్కోవలసి వచ్చింది. బీహారు లాంటి ప్రదేశాలలో భూస్వాముల ప్రత్యేక సేనల దాడులను కూడ ఎదుర్కోవలసి వచ్చింది. పోలీసులు భూస్వాముల కొమ్ముకాచి కాల్పులు జరిపారు. ఈ పోరాటాలలో కొందరు కార్యకర్తలు, వ్యవసాయ కూలీలు తమ ప్రాణాలను కోల్పోయారు.**

నాయకత్వాన దేశవ్యాపితంగా భూ ఆక్రమణ పోరాటం జరిగింది. ఇతర రైతు, వ్యవసాయ కార్మిక సమస్యల పైన పోరాటాలు జరిగాయి. ఈ భూ ఆక్రమణ పోరాటంలో దేశవ్యాపితంగా 1,25,000 ఎకరాల భూమిని మిగులు భూములతో సహా, ఆక్రమించు కున్నారు. అనేక ప్రదేశాలలో భూస్వాముల గుండాల దాడులను ఎదుర్కోవలసి వచ్చింది. బీహారు లాంటి ప్రదేశాలలో భూస్వాముల ప్రత్యేక సేనల దాడులను కూడ ఎదుర్కోవలసి వచ్చింది. పోలీసులు భూస్వాముల కొమ్ముకాచి కాల్పులు జరిపారు. ఈ పోరాటాలలో కొందరు కార్యకర్తలు, వ్యవసాయ కూలీలు తమ ప్రాణాలను కోల్పోయారు.

ఈవిధంగా ఒక వైపున 29 బూర్జువా వ్యవసాయ దారుల సంఘాల నాయకత్వాన, రెండవ వైపున 7 వామపక్ష రైతు, వ్యవసాయ కార్మిక సంఘాల నాయకత్వాన స్థానికంగానూ, దేశవ్యాపితంగా రైతు, వ్యవసాయ కార్మిక సమస్యలపై పోరాటాలు, ఆందోళనలు, సమీకరణలు జరుగు తున్నాయి. ఇవేగాక కొన్ని ప్రాంతాలలో నక్సలైట్ల అధ్వర్యాన వున్న రైతుకూలీ సంఘాలు కూడ రైతు, వ్యవసాయ కూలీ సమస్యలపై పోరాటాలు నిర్వహించాయి.

**రెండు రకాల సంఘాలు - రెండు కార్యక్రమాలు**

పైన వివరించిన దానిని బట్టి ఈ రెండు రకాల సంఘాల కార్య క్రమాలలో, లక్ష్యాలలో కొన్ని ఉమ్మడి సమస్యలున్నా, విభేదించే అంశాలే ఎక్కువగా వున్నాయి. రైతు పండించే పంటలకు గిట్టుబాటు ధరలు రావాలని వామపక్ష సంఘాలు కూడా కోరుతున్నా, ఈ సంఘాల కోర్కెకు, వ్యవసాయ దారుల సంఘాలు కోరే కోర్కెకు తేడా వుంది.

వామపక్ష సంఘాలు భూసంస్క రణలు గట్టిగా అమలు జరగాలని కోరుతున్నాయి. కాగా బూర్జువా సంఘాలు భూసంస్కరణలను వ్యతి రేకిస్తున్నాయి. వ్యవసాయ కార్మికులకు న్యాయమైన కనీస వేతనాలు వుండాలని, వామపక్ష సంఘాలు కోరుతుండగా, అసలు ఈ కనీస వేతన చట్టం అమలు నిలిపి వేయాలని కొన్ని వ్యవసాయ దారుల సంఘాలు కోరాయి. మాట వరసకు కొన్ని సంఘాలు వ్యవసాయ కార్మికుల కనీస వేతనాలు పెంచాలని చెప్పినా, అది పై పై మాటే. దాని కొరకు పోరాడినది ఎక్కడా లేదు.

షెడ్యూలు కులాలు, జాతుల వారిపై జరుగుతున్న అగ్రవర్ణాల భూస్వాముల, ధనిక రైతుల దాడులను వామపక్ష సంఘాలు ఎదిరించి పోరాడు తుండగా, వ్యవసాయ దారుల సంఘాలు వాటిని బలపర్చుతున్నాయి. లేదా కొన్ని సందర్భాలలో మౌనం వహిస్తు న్నాయి.

వ్యవసాయ దారుల సంఘాలు పల్లెలను పట్టణాలు దోచుకుంటు న్నాయనే నినాదంలో శ్రామిక, ప్రజా స్వామ్య శక్తుల మధ్య ఐక్యతను దెబ్బ తీస్తున్నాయి. ఈ నినాదం వెనుక గ్రామీణ ప్రాంతాలలో దోపిడీ దారులను కమ్మి వేసుకు రావాలనే ఉద్దేశం ఈ సంఘాల వారిది.

కాగా పల్లె ప్రాంతాలలోనూ, పట్టణాలలోని శ్రామిక, మధ్య తరగతి ప్రజలందరి మధ్య సమైక్యత సాధించి, ఆర్థిక, రాజకీయ పోరాటాన్ని సాగించాలనేది వామపక్ష సంఘాల లక్ష్యం.

పట్టణ వాసులకు పండ్లు, కూరగాయలు సప్లయి చేయకుండా నారాయణస్వామి నాయుడు బంద్ చేయించినప్పుడు ఆ పోరాటాన్ని వామ పక్ష సంఘాలు నిరసించాయి.

ఈ రెండు రకాల సంఘాల మధ్య కార్యక్రమాలలోనే గాక, లక్ష్యాలలో కూడా ప్రాథమికమైన విభేదాలున్నాయి.

ఈనాటి పెట్టుబడి దారీ పాలనలో క్రింది స్థాయినుండి పైస్థాయి వరకు తమ కున్న రాజకీయ ప్రాతినిధ్యాన్ని పెంచు కోవాలనేది మాత్రమే వ్యవసాయ దారుల సంఘాల లక్ష్యం. అంటే ఈ వ్యవస్థను కాపాడుతూ దానిలో తమ వంతు ప్రాతినిధ్యం పెరగాలనేది వారి కోర్కె.

కాగా ఈనాటి వర్గాల పొందికలో మార్పు తీసుకువచ్చి, కష్టజీవులకు అనుకూలంగా వుండే ప్రజాస్వామ్య, లౌకిక, సమతా వ్యవస్థ రావాలనేది వామపక్ష సంఘాల లక్ష్యం. ఈ లక్ష్యంతోనే ఇవి పనిచేస్తున్నాయి.

సన్నకారు, చిన్నకారు రైతులకు తమ వెంట వేసుకొని, కుల, మతాలను కూడా తమ స్వంత ప్రయోజనాల కొరకు వాడుకొంటూ, గ్రామీణ వ్యవస్థపై తమ ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పట్టును మరింత బలపర్చుకోవాలనేది బూర్జువా వ్యవసాయ దారుల సంఘాల లక్ష్యం.

అయితే ఈపై విషయాలపై సామాన్య ప్రజానీకంలో, సన్నకారు, చిన్నకారు రైతుల, వ్యవసాయ కార్మికులలోనూ అన్ని కులాల, మతాల, జన సామాన్యంలోనె తగినంత చైతన్యం, సరియైన అవగాహన ఈనాడు లేదు. క్రమ క్రమంగా ఈ చైతన్యం కలిగించి, శ్రమజీవుల మధ్య తరగతి ప్రజల ఐక్యత సాధించి ఇంకా కలిసి వచ్చే వారినందరిని కలుపుకొని సమతా సమాజ స్థాపనకు ముందడుగు వేయడం అవసరం.

వై.వి. కృష్ణారావు
ప్రధాన కార్యదర్శి
**అఖిల భారత రైతు సంఘం**

# పొలిటిక్స్‌కు కొత్త నిర్వచనం

# స్త్రీవాద ఉద్యమం

ఏ ఉద్యమ చరిత్రనయినా ఫలానా దశ నుంచే మొదలయిందని చెప్పటం ఎవరికీ సాధ్యం కాదు. ఉద్యమాలు ఎన్నో రకాల స్థాయిల్లో, ప్రాంతాల్లో ప్రారంభం అయి ఉంటాయి. అంతకు ముందున్న ఉద్యమాలతో అవి అవినాభావ సంబంధాన్ని కలిగి ఉంటాయి. స్త్రీల ఉద్యమమైనా 70 ప్రాంతాల్లో ప్రారంభమైనదిగా ఎవరిస్తే అంతకుముందు స్త్రీలు పాల్గొన్న ఉద్యమాల మాటేమిటి అన్న ప్రశ్న వస్తుంది. పంథొమ్మిదో శతాబ్దపు సంఘ సంస్కరణ ఉద్యమం, ఇరవయ్యో శతాబ్దపు జాతీయ పోరాటాలను కూడా తప్పక చెప్పుకోవాల్సి ఉంటుంది. అయితే పంథొమ్మిదో శతాబ్దం, ఇరవయ్యో శతాబ్దపు పోరాటాలలో 'స్త్రీల సమస్య' (ఇక్కడ 'సమస్య' అంటే 'ప్రశ్న' (స్త్రీల సమస్య)గా అర్థం చేసుకోవాలి. 'సమస్య', 'ప్రశ్న' రెండు కొన్ని పరిమితులున్న పదాలే. కానీ వేరే పదం అందుబాటులో లేని కారణంగా ఇలా వాడాల్సి వస్తుంది.) ఏ విధంగా రూపొం దించబడింది, ఎటువంటి కార్యక్రమాలు తీసుకోవటం జరిగిందని పరిశీలిస్తే ఆ ఉద్యమాలకు 70 ప్రాంతాల్లో చెలరేగిన స్త్రీ ఉద్యమాలకు కొన్ని ప్రధానమైన తేడాలు కన్పిస్తాయి. క్లుప్తంగా చెప్పాలంటే ఇంతకు ముందున్న ఉద్యమాల్లో స్త్రీల సమాన హక్కులు, స్త్రీ విద్య, బాల్య వివాహాల రద్దు, వితంతు వివాహాలు, ఆస్థి హక్కులు ఇత్యాది అంశాలు కన్పిస్తాయి. కంటికి కనిపించే బహిరంగ శారీరక అణచివేతలకు వ్యతిరేకంగా ఈ ఉద్యమాలు కృషి చేశాయి.

ఇప్పుడు 'స్త్రీవాద ఉద్యమం'గా మనం చెప్పుకునేది ఒక రకంగా ఆ ఉద్యమాల సంప్రదాయంలో భాగమైనా 'స్త్రీల అణచివేత'ను అర్థం చేసుకోవటానికి కొన్ని నూతన అవగాహనలకి దారి తీసింది. ఇంతవరకు 'సాంఘిక సమస్య'గా ప్రత్యేక సమస్యగా 'స్త్రీ సమస్యను' అర్థం చేసుకున్న దాని స్థానంలో 'వ్యక్తిగత-రాజకీయం' (పర్సనల్ ఈజ్ పొలిటికల్) అనే నినాదం ఒక కొత్త దృకథాన్ని ఇవ్వగలిగింది. అదే కాకుండా స్వరూప స్వభావాలలో, నిర్మాణ రూపాలలో తీసుకున్న కార్యక్రమాల్లో ఆ కార్యక్రమాల్ని కొనసాగించిన పద్ధతుల్లో ఇంతకు ముందున్న ఉద్యమాలకి ఇప్పటి ఉద్యమాలకి తేడాలున్నాయి.

స్త్రీల ఉద్యమాన్ని పరిశీలిస్తే అందులో ఒక కేంద్రీకృతమైన నాయకత్వం కానీ, నిర్మాణ స్వరూపం కానీ, ఒకే ఒక దృక్పథం కానీ, వ్యూహం, ఎత్తుగడలు కానీ మనకు కనిపించవు. ఇందులో అన్ని రకాల ఉద్యమాలు, గ్రూపులు, సంఘాలు అగుపిస్తాయి. అందులో స్వయం ప్రతిపత్తి సంఘాలు (అటానమస్ వుమెన్స్ గ్రూప్స్) ఉన్నాయి. పార్టీలకు, స్వచ్ఛంద సేవాసంస్థలకు చెందిన స్త్రీల సంఘాలూ ఉన్నాయి. ఇందులో కొన్ని రాష్ట్ర, దేశ స్థాయిలలో కూడా ఉన్నాయి. అయితే ఏ ఉద్యమ కార్యక్రమాల్లో 'స్త్రీ సమస్య' (వుమెన్స్ క్వెశ్చన్) కనిపించినా దానికి ఊపిరీ, ప్రోత్సాహం 'స్వయం ప్రతిపత్తి స్త్రీ ఉద్యమం' మూలంగానే అని చెప్పటం అతిశయోక్తి కాదు. ఇన్నిరకాల ఉద్యమాలు, సంఘాలలో కూడా 'స్వయం ప్రతిపత్తి ఉద్యమం' రాజకీయంగానూ, నిర్మాణ స్వరూపాలలోనూ దాని ప్రత్యేక ఉనికిని స్థిరపరచుకుంది. అంతేకాదు ఇంతవరకూ 'పొలిటిక్స్' అని దేనినయితే అర్థం చేసుకొన్నామో దాని పరిధులు చాలా పరిమితం అనీ, ఆ పరిధుల్ని విశాలం చెయ్యాలంటే స్త్రీ సమస్యను ఒక ప్రత్యేక సాంఘిక సమస్యగానో లేక సంస్కృతికి సంబంధించిన సమస్యగానో చూడటాన్ని తిరస్కరించి 'పొలిటికల్' సమస్యగా చూడాల్సిన అవసరం ఉందనే గుర్తింపును కలగజేసింది. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ ఉద్యమం పొలిటిక్స్ అనే పదానికి ఒక కొత్త నిర్వచనాన్ని ఇవ్వగలిగింది.

ఈ శతాబ్దంలో చెలరేగిన వుద్యమాలన్నిటిలోనూ ఎక్కువ విజయాలు, సాధించిన ఉద్యమం మహిళా ఉద్యమం అని చెప్పడానికి సందేహించనక్కరలేదు. దీని ప్రభావం ఒకే ప్రాంతానికి, ఒకే అంశానికి లేదా ఒకే సమస్యకి పరిమితమైనదని ఎవరూ అనలేరు. పట్టణ ప్రాంతాలలో, గ్రామీణ ప్రాంతాలలో చిన్న టౌనులలో ప్రతిచోటా 'స్త్రీ సమస్య'ను గురించిన చర్చలు ఈనాడు చెలరేగుతున్నాయి. జర్నలిస్టులు, సినిమా నిర్మాతలు, టీచర్లు, డాక్టర్లు, పార్టీలు అందులోని కార్యకర్తలు, పౌరహక్కుల సంఘాలు, స్వచ్ఛంద సేవా సంస్థలు ప్రభుత్వ సంస్థలు, చివరికి కుటుంబాలూ, సమాజం-అన్నీ 'స్త్రీ సమస్య' ప్రభావానికి గురైనాయన్న వాస్తవాన్ని ఎవరు కాదనలేరు. అంతే కాదు ఈ సమస్యను వివిధ దృక్పథాలతో మలచడంలో కూడా అవి పాలుపంచుకున్నాయి.

''స్త్రీ సమస్య' అంటే ఇతర అణచివేతలతో, దోపిడీ విధానాలతో ఎటువంటి సంబంధమూ లేని సమస్య కాదు. 'ఆర్థికాభివృద్ధి' స్త్రీలను విలువలేని వాళ్ళుగా చేసున్తుంది (మార్జినలైజ్ చేస్తుంది) విద్యావ్యవస్థ సమాజంలో స్త్రీల స్థానం ఏమిటో, ఆ స్థానంలో స్త్రీలు ఎలా ఇమడిపోవాలో నూరిపోస్తుంది. ఇంకో రకంగా చెప్పాలంటే వాళ్ళకో ఉనికి లేకుండా చేస్తుంది. (ఇన్‌విజిబులిటీ) వైద్య, ఆరోగ్య వ్యవస్థలకు స్త్రీల శరీరాల పట్ల ఏ మాత్రం గౌరవం లేదు. ప్రచార సాధనాలు - పత్రికలు, సినిమాలు, టీవీ - స్త్రీల శరీరాల్ని అన్ని రకాల ప్రయోజనాలకు ఉపయోగించుకోవటమే కాకుండా స్త్రీల అణచివేతలో ప్రధాన కేంద్ర బిందువులయిన కుటుంబం, వివాహ వ్యవస్థలను ఎడతెగని విహార యాత్రలుగా చిత్రిస్తుంది. ఈ పరిస్థితుల్ని నిలదియ్యాలంటే భారీ పరిశ్రమల లాభాల స్థాయి నుంచి ప్రజల కనీసావసరాలకు సౌకర్యాలను ఏర్పాటు చేసే వ్యవస్థకు దారి తీసే మార్గాన్నెన్నుకోవాలి. పెద్ద మొత్తం వెచ్చించే డిఫెన్సు వ్యయం నుంచి, ఆరోగ్య విద్యా వసారాల్ని తీర్చే

ఖర్జైటు విధానాన్ని ఎన్నుకోవాలి. అదే కాకుండా కుటుంబ వ్యవస్థ స్వరూప స్వభావాల్ని, అందులో సంబంధాల్ని మౌలికంగా మార్చే పద్ధతుల్ని వెతుక్కోవాలి. శ్రమ, శ్రమ మీద అధిపత్యం, ఆరోగ్య వైద్య విద్యా వ్యవస్థలు, ప్రచార సాధనాలు- అన్నింటినీ ప్రజా స్వామికం (డెమొక్రటైజ్) చేయాలి. వీటన్నిటిలోనూ కేంద్రీకరణను (సెంట్రలైజేషన్) నిర్మూలించాలి. అంటే దాని కర్థం భారీ పరిశ్రమలు, ప్రభుత్వ సంస్థలు సైన్యమే కాకుండా, పాఠశాలలు, ఆస్పత్రులు, కుటుంబాలు అన్నీ సమూలంగా - స్వభావ నిర్మాణాలతో సహా మార్పులకు గురవాలి. ఇవన్నీ అందరూ చెప్పే మాటలే! కొత్తేముంది అనుకోవచ్చు: కానీ వీటన్నింటినీ అర్థం చేసుకునే పద్ధతిలో కొత్తదనం ఉంది. ఈ విషయాలన్నీ మార్పు చెందాలంటే వ్యవస్థ మారాలనే అవగాహన ఇంతవరకూ 'పాలిటిక్స్'కు మాత్రమే సంబంధించినదని అనుకున్నాం. అంటే ఆ అవగాహనలో-రాజకీయాలకు స్త్రీల వ్యక్తిగత జీవితాలకు దగ్గర సంబంధం లేదు. అందులో స్త్రీల సమస్యలు పరిష్కారం అవ్వాలంటే వాళ్ళ 'స్వంత విషయాలు' 'ప్రైవేటు - వ్యక్తిగత సమస్యల్ని' తాత్కాలికంగా పక్కకి పెట్టి వ్యవస్థ మార్పు కోసం కృషి చేయాలనే భావం ఇమిడి ఉండింది. కాకపోతే ఉద్యమం పక్కదారి పడుతుందనే భయం వుంది. స్త్రీలకి రాజకీయ పోరాటం అంటే ప్రొఫెషనల్ విప్లవకారులు చేసే పోరాటం అనే అవగాహన కూడా అందులో భాగమే. వారి దైనందిన జీవితంలో, ఎదుర్కొనే ప్రతి సమస్యా, అనుభవంలోకి వచ్చే ప్రతి విషయం 'అధికారాని' (పవర్)కి సంబంధించినదనీ, 'అధికారం' అనేది ఒక వర్గంలో కానీ, ఒక గ్రూపులో కానీ ఏ కొద్ది మంది చేతుల్లోనే వున్నది కాదనీ, మనందరి చుట్టూ, సమాజంలోని ప్రతి అంశంలోను, మన మనస్సుల్లోనూ గాఢంగా అల్లుకు పోయిన విష వలయం లాంటిదనీ, ఈ అధికారాన్ని అడుగడుగునా ఎదుర్కోక పోతే, మన అణచివేతకు అన్ని రకాల ఇతర అణచివేతలకు ఉన్న అవినాభావ సంబంధాన్ని అర్థం చేసుకోలేమనే స్పృహని స్త్రీ ఉద్యమం కలుగజేసింది. దైనందిన జీవితంలో 'స్త్రీ సమస్య'కు ప్రతిక్షణం రూపాన్ని పోస్తున్న యంత్రాంగం ఎన్ని రకాల సూక్ష్మ రూపాలు



వ్యూహాలతో మన చుట్టూ ఒక వలయంగా ఏర్పడుతోందనే స్పష్టత నేర్పరచుకోవాలి. సాంఘిక రాజకీయ సంస్థల పట్ల మనకున్న అవగాహనలు, దృక్పథాల్ని, కొనసాగించటానికి గాను స్త్రీలు పురుషుల వ్యక్తిత్వాలే విధంగా మలచబడతున్నాయో అర్థం చేసుకోవాలి. ఈ దైనందిన జీవితంలో ఈ పవర్ యంత్రాంగాన్ని దాని సాధనాల్ని విశ్లేషించాలంటే దాన్ని ఎదుర్కోవాలంటే మనలో జీర్ణించుకుపోయిన అవగాహనల్ని, వాటి సంక్లిష్టతను (కాంప్లెక్సిటీ), మనం చేసే చర్చల్ని వాటి పద్ధతుల్ని, మన ఆచరణ స్వభావాన్ని, చివరికి ఆచరణని కూడా ప్రశ్నించుకోవాల్సి వస్తుంది. వీటన్నిటికి జీవం పోసే రాజకీయ సైద్ధాంతిక పరిస్థితుల్ని అర్థం చేసుకోవాల్సి వస్తుంది. అది జరగకపోతే ఈ సమాజం ఎప్పటికీ మార్పు లేకుండా శిథిలమై పోతుంది.

అయితే ఈ అవగాహనకు 'స్త్రీ ఉద్యమం' ఏ విధంగా దోహదం చేసింది? ఇన్ని రకాలుగా ఇన్ని భాగాలలో అవగాహనలతో ఎదిగిన ఉద్యమాన్ని ఏ విధంగా వివరించాలి? దాని స్వరూపాన్ని, చరిత్రను, రాజకీయాల్ని, అదిలేవదీసిన ప్రశ్నల్ని, అనుసరించిన పంథాల్ని ఏ విధంగా విశదీకరించాలి? ఈ ప్రశ్నలకు సమాధానాలు వెతకాలంటే, ఉద్యమానికి సంబంధించిన సంఘాల్ని అవి తీసుకున్న కార్యక్రమాల్ని ఆ కార్యక్రమాలు ఆయా సంఘాల అవగాహనల్ని ఎలా పెంచాయన్న వాస్తవాల్ని పరిశీలించాలి.

1975 అత్యవసర పరిస్థితి కాలం దేశ రాజకీయ పరిస్థితుల్లో మార్పు తీసుకొని వచ్చింది. పట్టణాల్లో మధ్య తరగతి కుటుంబాల్లో ఒక కొత్త రాజకీయ చైతన్యం ఏర్పడింది. ప్రజా సంఘాలు, వ్యవసాయ కూలీ సంఘాలు ఆదివాసుల పోరాటాలు, మహారాష్ట్ర, బోధ్ గయా, నక్సల్‌బరీ, శ్రీకాకుళం రైతాంగ పోరాటాలే కాకుండా అత్యవసర పరిస్థితి సందర్భంగా ఏర్పడ్డ పౌరహక్కుల సంఘాలు- అన్నీ దేశంలో ఒక రాజకీయ వాతావరణాన్ని నెలకొల్పాయి. ఆ వాతావరణంలో భాగంగా రూపొందింది. 'స్వయం ప్రతిపత్తి మహిళా ఉద్యమం' బొంబాయిలో 'అత్యాచార వ్యతిరేక వేదిక' (ఫోరమ్ ఎగెయిన్స్ట్ అప్రెషన్ ఆఫ్ వుమన్), ఢిల్లీలో 'స్త్రీ సంఘర్స్ సమితి', 'సహేలీ', కలకత్తాలో 'సచేతన', మైసూరులో 'సమత', బెంగుళూరులో విమోచన', అహ్మదా బాద్‌లో 'చింగారీ', హైద్రాబాద్‌లో 'స్త్రీశక్తి సంఘటన' - ఇవన్నీ దాదాపు ఒకే కాలంలో ఏర్పడ్డాయి. అయినా 1980 లో 'మధుర'పై పోలీసులు అత్యాచారం చేసిన కేసులో దేశం అంతటా పెద్ద ఎత్తున కార్యక్రమం తీసుకొనే వరకు

వీటి ఉనికికి గుర్తింపు రాలేదు. 1974లో 14 సంవత్సరాల మధుర పోలీస్‌స్టేషనే రేప్ చేయబడింది. 1974 నుంచి 78 వరకు కేసు నడిచిన తర్వాత సుప్రీంకోర్టు ముద్దాయిలైన పోలీసులను నిర్దోషులుగా తీర్పు చెప్పింది. దానికి నిరసనగా 79లో దేశం అంతటా మహిళా సంఘాలు పిలుపు నిచ్చాయి. సుప్రీంకోర్టు తీర్పుకు వ్యతిరేకంగా, 'రేప్ చట్టం'లో సవరణలను కోరుతూ మహిళా సంఘాలన్నీ పెద్ద ఎత్తున ఉద్యమం నిర్వహించాయి.

మొదటిసారిగా 'మానభంగం' అనే సమస్యను కుటుంబ గౌరవానికి సంబంధించిన సమస్యగా కాకుండా, స్త్రీ వ్యక్తిత్వంపై దౌర్జన్యం చేసే హక్కు ఎవరికి లేదని ఆమె శరీరం, వ్యక్తిత్వం ఆమె స్వంతం అనే అంశాన్ని గుర్తింపుకు తీసుకొచ్చింది.

దైనందిన జీవితంలో అనుక్షణం తనపై జరగబోయే అత్యాచారాన్ని ఊహించుకుని భయపడే 'సగం మనిషి'గా కాకుండా స్వతంత్రంగా నిర్భయంగా బతకగలిగే హక్కు గల వ్యక్తి అనే స్పృహను మొదటిసారి ఈ ఉద్యమం కలుగజేసింది. అంతేకాదు అధికారంలో ఉన్న వ్యక్తులు (పోలీసులు, ప్రభుత్వ అధికారులు) స్త్రీలపై అత్యాచారాలు జరిపిన సందర్భాలలో (మధుర కేసులో లైంగిక కలయికకు మధుర ఒప్పుకుందనే అభియోగం చేయబడింది) ఎత్తిచూపించ బడ్డ, 'అంగీకారం' (కన్సెంట్) అనే పదాన్ని వుద్యమం ప్రశ్నించింది. అసలు ఈ 'అంగీకారం' స్వరూప స్వభావా లేమిటి, అధికారాన్ని ఉపయోగించట మంటే ఏమిటి, మానభంగం చేయబడ్డ స్త్రీ గత చరిత్ర, ఆమె కన్యత్వం, ఆమె శీలం గురించిన సమాచారాలు ఎందుకు అని ఉద్యమం నిలదీసింది. వాటిని అసందర్భపు ప్రశ్నలుగా నిరూపించింది.

మహిళా ఉద్యమాలు తీసుకున్న ఇతర సమస్యల్లో ముఖ్యమైనది వరకట్నపుహత్యలు. ఈ సమస్యను వివిధ సంఘాలు, వివిధ స్థాయిల్లో తీసుకుని, అన్ని స్థాయిల్లోనూ పనిచేయడం జరిగింది. వరకట్నపు మరణాల్ని ఆత్మహత్యలుగా కాకుండా హత్యలుగా నిరూపించటానికి ఒక దశాబ్దకాలం సరిపోలేదు. స్టవ్ అంటుకుందనే, టీ చేస్తుంటే చీరంటుకుందనే, గ్యాస్ సిలిండర్ పగిలిందనే కారణాలు వినవచ్చేవి. భర్త అందంగా లేక ఒకామె ఆత్మహత్య చేసుకుందని ఒకరంటే తను అందంగా లేదని చేసుకుందని ఒకరన్నారు. లేకపోతే పిల్లలు పుట్టలేదన్న బాధతో ఒకామె చనిపోయిందని ఒకరనేవారు. ఇవన్నీ చుట్టుప్రక్కల వాళ్ళు, కుటుంబంలో వాళ్ళూ మాత్రమే కాదు. ఎన్నోసార్లు పోలీసులూ ఇవే కారణాల్ని చెప్పేవారు. ఇక కేసు రిజిస్టరు చేసే అవసరం ఏముంటుంది? మహిళా సంఘాలు ఈ స్థాయి నుంచీ కృషి మొదలుపెట్టాల్సి వచ్చింది. ఆస్పత్రులలో 'బర్న్స్ వార్డ్స్' చూడడానికి వెళ్తే కేసుషీట్లన్నిటిలో 'ఆత్మహత్య' సిద్ధాంతమే కనిపించేది నర్సులు, ఆయాలతో మాట్లాడితే ఆత్మహత్యా, ఆకస్మాత్తుగా జరిగిన ఆక్సిడెంటా, హత్యా అనే విషయం పేషంటును చూడగానే తెలిసిపోతుం దని చెప్పేవారు. అయితే ప్రతివాళ్ళూ 'జరిగిందేదో జరిగిపోయింది వున్న భర్తను జైలుపాలు జేయడమెందు' కన్న ధోరణితో కనిపించేవాళ్ళు. ఆఖరికి కాలిపోయిన స్త్రీ కూడా అదే విధంగా వాంగ్మూలం ఇచ్చేది. ఒకవేళ ఆమె భర్త చేశాడని నొక్కి చెప్పినా, ఆ విధంగా చెప్పినప్పుడు ఆమె మానసికస్థితి సరిగా లేదని న్యాయమూర్తులు నిర్ధారించేవాళ్ళు. కోర్టులో కేసులకు ప్రత్యక్ష సాక్ష్యాధారాలు కావాలి. అత్తవారింట్లో నాలుగు గోడల మధ్య వంటింట్లో పడకింట్లో జరిగిన హత్య లకు, మానసిక శారీరక హింసలకు ప్రత్యక్ష ఆధారాలు, సాక్ష్యాలు ఎక్కడినుంచి దొరుకుతాయి? అసలు కేసులు రిజిస్టరు చేసే ప్రయత్నాలే జరుగవు. అది జరిగినా పోలీసులు వాటిని రిజిస్టరు చేయరు. పోస్ట్ మార్టమ్ రిపోర్టులు అసలు విషయాన్ని ఎన్నడూ బయటపెట్టవు. న్యాయ మూర్తులకున్న సాంఘిక స్పృహ 'అన్యాయంగా భర్తను వేధించటానికి' పెట్టిన కేసులను కొట్టి వేయటానికే ఉపయోగపడుతుంది. అంతకు మించి ఆలోచించేందుకు అనుకూలమైన చట్టాలు కూడా లేవు. ఇన్ని రకాల అవరోధాల్ని ఎదుర్కొని మహిళా ఉద్యమం ఈ సమస్యకు గుర్తింపును సాధించింది. చాలావరకు ఈ సంఘటనలు రాత్రిళ్ళు జరిగాయనీ, వీటిల్లో చనిపోయిన వాళ్ళు చాలా వరకు 18 నుంచి 35 లోపు వయసు వాళ్ళనీ శరీరం కాలటం సాధారణంగా మొహం మీద కాక వీపు మీద వెనక భాగంలోనే కనిపిస్తుందనీ ఇటువంటి విషయాలన్నింటినీ ఉద్యమం ఎత్తి చూపింది. పోలీస్‌స్టేషన్ల ముందు నిరసనలూ, ధర్నాలూ జరపటమే కాకుండా, హత్య జరిగిన బస్తీలో చుట్టుపక్కల వాళ్ళందర్నీ వుద్దేశిస్తూ ప్రదర్శనలు చేయటం, వీధి నాటకాలు ప్రదర్శించటం ఉద్యమం నిర్వహించింది. మొదట్లో కొంత సందేహించినా కాలక్రమేణా చనిపోయిన అమ్మాయి తల్లిదండ్రులు ఆ కుటుంబ సభ్యుల సానుభూతి సహకారాలు ఉద్య మానికి లభించాయి. సమాచారం సేకరించటంలో కొత్త పద్ధతుల కోసం, కేసుల సాక్ష్యాలు వెతకడంలో కొత్త మార్గాలను అన్వేషించాలనే విషయానికి ప్రాధాన్యత నివ్వబడింది. ఈ సమస్యకు దేశమంతటా ఒక గుర్తింపును ఉద్యమం కలుగజేసింది. చట్టం, ప్రభుత్వ యంత్రాంగం, న్యాయవ్యవస్థ వైద్య వ్యవస్థ ఇవన్నీ స్త్రీలపట్ల చూపించే నిర్లక్ష్యాన్ని శత్రుత్వ వైఖరిని ఉద్యమం అర్థం చేసుకుంది. స్త్రీల ఉద్యమాల ప్రభావం - ప్రచారసాధనాలు - టీవీ, పత్రికలు సినిమాలు అన్నిటిమీద పడింది. అంతేకాదు ఈనాడు మామూలు ఆక్సిడెంటయినా ముందు

*స్త్రీ సమస్యకు దేశ మంతటా ఒక గుర్తింపును ఉద్యమం కలుగజేసింది. చట్టం, ప్రభుత్వ యంత్రాంగం, న్యాయవ్యవస్థ వైద్య వ్యవస్థ ఇవన్నీ స్త్రీలపట్ల చూపించే నిర్లక్ష్యాన్ని శత్రుత్వ వైఖరిని ఉద్యమం అర్థం చేసుకుంది. స్త్రీల ఉద్యమాల ప్రభావం – ప్రచారసాధనాలు – టీవీ, పత్రికలు, సినిమాలు అన్నిటిమీద పడింది. అంతేకాదు ఈనాడు మామూలు ఆక్సిడెంటయినా ముందు. ఆ స్త్రీ వివాహజీవితం, భర్త ప్రవర్తన పట్ల సందేహాలు మనసులో మెదిలే పరిస్థితి ఏర్పడింది.*

ఆ స్త్రీ వివాహజీవితం, భర్త ప్రవర్తన పట్ల సందేహాలు మనసులో మెదిలే పరిస్థితి ఏర్పడింది. సమాజంపై దీనిముద్ర బలంగా పడింది. తల్లి దండ్రులు బాధలు పడుతున్న కూతుళ్ళను బలవంతంగా అత్తవారింటికి పంపించటానికి భయపడుతున్నారు. ఈ మొత్తం అనుభవంలో ఒక విషయంలయిన స్పష్టత ఏర్పడింది. ఈ సమస్యను ఇప్పటికీ కొంతమంది 'పోలీసింగ్' సమస్యగా చూస్తున్నారు. అంటే సరైన నిఘా ఉంటే సరైన చట్టాలుంటే, మంచి జడ్జీలుంటే కొంతమందికి శిక్షలు పడితే నవమన్య తగ్గుతుందని వాళ్ళ అభిప్రాయం. కాని హత్యలకి దారితీసే పరిస్థితుల మాటే మిటి? కుటుంబంలో వ్యాధులకి వైద్యాలు, కోరుకునే వైద్య సౌకర్యాలకు మాత్రం, ప్రాముఖ్యత నివ్వని, వైద్య వ్యవస్థ-ప్రభుత్వం, కుటుంబ నియంత్రణ కార్యక్రమాల కోసం కోట్లు ఖర్చు పెడు తున్నాయి. దేశవ్యాప్తంగా 'గర్భశిశువు సెక్సు నిర్ధారణ' పరీక్షలకు వ్యతిరేకంగా ఉద్యమాలు చేపట్టటం జరిగింది. ఈ




*బొంబాయి ఎలిఫిన్ స్టెన్ కాలేజిలో విద్యార్థినిపై జరిగిన అత్యాచారానికి వ్యతిరేకంగా మహిళా సంఘాల నిరసన*

స్పష్టమయిందని చెప్పాలి. ఇరుగు పొరుగిళ్ళ వాళ్ళనుంచి, కుటుంబ నభ్యుల దగ్గరనుంచి, పోలీస్ యంత్రాంగం, చట్టవ్యవస్థ, వైద్య పరీక్షల విభాగం (ఫోరెన్సిక్ డిపార్టు మెంట్), న్యాయ స్థానాలవరకు - పవర్ యంత్రాంగం ఏ విధంగా పని చేస్తుందో ఉద్యమం అర్థం చేసుకోగలిగింది. అంటే వీటన్నిటి వెనుక ఒక కుట్ర ఉన్నదని చెప్పడం ఉద్దేశం కాదు. పైన చెప్పిన వ్యవస్థలన్నీ ఏ ముఖ్యమంత్రి ఆదేశాల కిందో పనిచేయలేదు. ఏ వ్యవస్థకా వ్యవస్థ ఈ సమస్యను ఏ కోణం నుంచి చూసిందో, ఏ విధంగా అర్థం చేసుకుందోనన్న అవగాహన అన్ని రకాల స్థాయిలలోనూ ఉద్యమం పనిచేసినపుడే అర్థమయింది. అంటే సమస్యకు వివిధ స్థాయిల్లో వివిధ రకాప్రతిరోజూ స్త్రీ ఎదు ర్కొనే మానసిక, శారీరక హింసల్ని సమస్యలుగా గుర్తించేంత వరకు మార్పంటూ సాధ్యపడదు.

ఈ సమస్యలతో పాటు ప్రాధాన్యత నివ్వబడ్డ మరో సమస్య స్త్రీల ఆరోగ్యం. స్త్రీల శరీరాలపై వైద్య, ఆరోగ్య వ్యవస్థ ఎటువంటి కంట్రోలు కలిగి ఉందనే వాస్తవాన్ని ఉద్యమం మొదటిసారిగా అర్థం చేసుకుంది.

స్త్రీ ఆరోగ్య సమస్యలు పనికి రానివనీ, వాళ్ళు సమస్యల్ని ఊహించుకుంటారనీ ఈ వ్యవస్థ భావిస్తుంది. పెళ్ళి కాని వాళ్ళకు 'పెళ్ళి కాలేదు కాబట్టి' అనే అయిన వాళ్ళకు సంతానం లేకపోవడం మూలంగా అనే ఇంకేదే అని నిద్రమాత్రలు, ట్రాంక్విలైజర్స్‌తో సమస్యను దాటేయ టానికి చూస్తుంది వైద్యవ్యవస్థ. అట్లాగే స్త్రీల ప్రత్యేక పరీక్షతో గర్భంలో ఆడశిశువు ఉన్నదని తెలితే గర్భ విచ్చిత్తి చేస్తున్నారన్న వాస్తవాన్ని సభ్య ప్రపంచానికి తెలిపి ఈ పరీక్షలను నిలిపివేయాలని ప్రభుత్వం పై వత్తిడిని తీసుకువచ్చింది. మహిళా వుద్యమమే. దీనికోసం జాతీయ స్థాయిలో కమిటీ నొకదానిని ఏర్పాటు చేయడం జరిగింది. అదేవిధంగా ఇంజక్షన్లతో గర్భ నిరోధం (ఇంజెక్టిబిల్ కాంట్రాసెప్టిక్స్) చేసే పద్ధతులమీద ప్రయోగాలు చేయటానికి గాను చదువురాని స్త్రీలను (గినీపందులుగా) వుపయోగించే జాతీయ వైద్య పరిశోధనా నంస్థ (ఐసిఎంఆర్) ప్రయత్నాల్ని (నెట్‌ఎన్‌కేసు) వమ్ము చేయటానికి స్త్రీల నంఘాలు సుప్రీంకోర్టులో ప్రభుత్వానికి వ్యతిరేకంగా పిటిషన్ పెట్టాయి. ఈ

పిటిషన్‌లో 'నెట్‌ఎన్' స్త్రీల ఆరోగ్యానికి హాని కలిగించే వైద్య సాధనంగా విమర్శించ బడింది. దీని మూలంగా రుతుక్రమం పూర్తిగా దెబ్బతింటుంది. స్త్రీలను క్యాంపుల్లో ప్రయోగాలకు తీసుకొని పోబోయే ముందు ఈ మందు వివరాలు ప్రయోగ వివరాలు డాక్టర్లు వాళ్ళకి తెలియ నివ్వలేదు. సంతాన నిరోధం చేయాలనే ఉద్దేశం స్త్రీలకుంటుంది. ఆ కోరికను సాధనంగా ఉపయోగించుకుని ఏ హానికరమైన పద్ధతినైనా ప్రయోగించవచ్చు నుకునే వైద్య వ్యవస్థది పెద్ద నేరమే అవుతుంది. స్త్రీలను అజ్ఞానంలో వుంచి ప్రయోగాలు చేయటం రాజ్యాంగంలో ఆర్టికల్ 21కి వ్యతిరేకం అని ఈ పిటిషన్ వాదించింది. వాళ్ళలో వున్న సాంఘిక స్తబ్దత, నిరక్షరాస్యత, పేదరికాన్ని వుపయోగించుకొని వాళ్ళ ఆరోగ్యాలకు హానికరమైన ప్రయోగాలకు పూనుకోవటం, సాంఘిక దృష్ట్యా తప్పేకాకుండా ఆరోగ్యపరంగా కూడా తప్పని నొక్కి చెప్పటం జరిగింది. అంతేకాకుండా వాళ్ళు పిల్లలు కనాలా వద్దా అని నిర్ణయించుకునే హక్కు వాళ్ళ స్వంతం అనీ వాళ్ళ శరీరాల మీద వ్యవస్థకే హక్కులేదని కూడా వాదించింది. ఈ మందు స్త్రీల ఆరోగ్యం మీద హానికరంగా ఎలా పనిచేస్తుందనే విషయాల గురించి నిర్ధారించే పరిశోధనలు ఇంతవరకు జరగలేదు.

వైద్య, ఆరోగ్య వ్యవస్థలకు స్త్రీల శరీరాల పట్ల వున్న నిరసనను, వాళ్ళని పిల్లల్ని కనే యంత్రాలుగా పరిగణించ టాన్ని, స్త్రీలు తమ అనుభవాల్ని పంచుకునే క్రమాలతో అర్థం చేసుకొన్నారు. ఈ అనుభవం ఒక కొత్త రాజకీయ స్పృహను కలుగజేసింది. తమ శరీరాలకు, దైనందిన జీవితంలో, కుటుంబంలో సమాజంలో ఎదుర్కొనే సామాజిక దృక్పథాలకు ఆరోగ్య వ్యవస్థకు, ప్రభుత్వ యంత్రాంగానికి బహుళ జాతీయ మందుల సంస్థలకు వున్న అవినాభావ సంబంధాన్ని, మొదటిసారిగా బహిరంగంగా స్త్రీలు వ్యక్తం చేశారు. అదే సందర్భంలో 'మాతృత్వం', 'సెక్సువాలిటీ' అనే పదాలకు కొత్త నిర్వచనాలు కూడా వెతకటం జరిగింది. మాతృత్వాన్ని చాలా 'సహజమైన' పరిస్థితిగా ఒక ఉన్నతమైన లక్ష్యంగా గుర్తిస్తుంది మన సమాజం. కుటుంబ వ్యవస్థకూ, స్త్రీ పురుషుల మధ్య సంబంధాలకూ, స్త్రీలను కించపరిచే సిద్ధాంతాలకూ కుటుంబంలో సమాజంలో స్త్రీ పురుష వివక్షతకూ, ఈ వ్యవస్థను సమర్థించే సిద్ధాంతాలకూ అన్నింటికీ మాతృత్వం దోహదం చేస్తుందని మనం ఇప్పుడే అర్థం చేసుకుంటున్నాం. ఈ అవగాహనకు దారి తీయటానికి కారణం స్త్రీవాద వుద్యమమే. అదే విధంగా 'సెక్సువల్ పొలిటిక్స్' స్త్రీ అణచివేతకున్న ప్రధాన కారణాల్లో ఒకటిగా విమర్శించబడింది. స్త్రీ పురుష సంబంధాల్లో వైవాహిక జీవితంలో వున్న అసమానతల్ని స్త్రీ శరీరం పట్ల, వివాహంపట్ల, గర్భధారణ పట్ల ఆమెకు మాత్రమే హక్కుందని నొక్కి చెప్పే అవకాశాన్ని ఉద్యమం కలిగించింది.

వుద్యమం కేవలం ఈ విషయాలకే పరిమితం కాలేదు. ఇంతకు ముందు ఊహించని ఎన్నో అంశాలు, రంగాలలో 'స్త్రీ సమస్య'ను రేకెత్తించింది. పెళ్ళికాని మధ్యతరగతి స్త్రీలు వసతిగృహాల్లో ఉండే అమ్మాయిలు ఏ ఒక్క పురుషుడికి ఏ ఒక్క కుటుంబానికి చెందని ఒంటరి స్త్రీలుగా సమాజంలో ఎన్నిరకాల అవమానాల్ని సహించవలసి వస్తుందో 'వర్కింగ్ వుమెన్స్ హాస్టళ్ళ'లో స్త్రీల పరిస్థితుల పట్ల ఆందోళన చేయడం ద్వారా గ్రహించగలిగాం. అక్కడి వసతి సౌకర్యాలు సరిగా లేక పోవటమే కాకుండా, అడుగడుగునా స్త్రీ శీలాన్ని శంకించే మేనేజిమెంటు, ఆఫీసు వాతావరణం, సమాజ దృక్పథాలూ వాటి లోతులూ దృష్టికి వచ్చాయి. అలాగే పూనాలాంటి పట్టణాల్లో మధ్యతరగతి స్త్రీల ఇళ్ళల్లో పనులు చేసే పనిమనుషుల సమస్యల గురించి తీసుకున్న కార్యక్రమాలు, ఆ ఇద్దరి స్త్రీల మధ్య ఉన్న 'అధికార' సంబంధాలను వాళ్ళిద్దరికీ ఇంటిపనికి ఉన్న సంబంధాన్ని గ్రహించగలిగే అవకాశాన్నిచ్చాయి. అనాధ స్త్రీల గురించి, వ్యభిచార వృత్తి చేసే స్త్రీల గురించి, విడాకులివ్వబడి ఇంట్లోంచి నిరాశ్రయంగా బయటకొచ్చిన వాళ్ళ గురించి వారి వ్యక్తిగత సమస్యల గురించి కొన్ని సంఘాలు సంవత్సరాలుగా నిరంతర కృషి చేస్తూనే ఉన్నాయి.

మధ్య తరగతి స్త్రీ సంఘాలే కాకుండా ఇతర స్త్రీ సంఘాలలో ఇతర రకాల సమస్యలు కూడా బయటికి వచ్చాయి. అహ్మదాబాద్‌లో 'సేవా', చిప్కో పర్యావరణ వుద్యమం, నిప్పాణిలో బీడీ స్త్రీ కార్మిక సంఘం' బోధ్‌గయా రైతాంగ పోరాటల్లో, శ్రామిక స్త్రీల భూమి హక్కుల పోరాటం, షేత్కారి సంఘటన స్త్రీల పోరాటం లాంటి వుదాహరణలు దేశవంతటా కనిపిస్తాయి. ఈ పోరాటాల్లో గ్రామీణ ప్రాంతాల్లో ప్రజలకు కావలసిన వైద్య సదుపాయాలు, ఆరోగ్యావనరాలు, ఉద్యోగావకాశాలు, మంచినీటి సరఫరా, పరిశుభ్రత అట్లాగే ఆస్తిహక్కులు, సమాన పనికి సమాన వేతనం లాంటి అంశాలే కాకుండా ప్రత్యేకంగా స్త్రీలకి సంబంధించిన అంశాలూ కొన్ని కనిపిస్తాయి. బోధ్‌గయాలో స్త్రీలు భూమి పట్టాలకోసం ప్రతిపాదన చేసినందుకు మొత్తం ప్రజా సంఘంలోనే విపరీతమైన సంక్షోభం చెలరేగింది. కొన్నిసార్లు భార్యల్ని కొట్టటం, హింసించటం లాంటి సమస్యల్ని ఈ వుద్యమంలో తీసుకున్నారు. కానీ కొన్ని సంఘాల్లో చేసిన ప్రతిపాదనలు - పంచాయతీ రాజ్‌లో స్త్రీలకు ముప్పై శాతం ప్రాతినిధ్యం ఉండాలనేటటువంటి ప్రతిపాదనల్ని చూస్తే మాత్రం ఎన్నోరకాల పోరాట అనుభవాలతో మనం గుర్తించిన విషయాల ప్రాధాన్యతను వాళ్ళు నీరుకార్చారనిపిస్తుంది.

ప్రచారసాధనాలు, సినిమాలు, నవలలు, కథాసాహిత్యం, టీవీ కార్యక్రమాలు ఏ విధంగా స్త్రీ సమస్యను రూపొందిస్తున్నాయనే విషయాల పట్ల జరిగిన కృషి గురించి రాయాలంటే ఈ వ్యాసం సరిపోదు.

### ఉద్యమ స్వరూపం నిర్మాణాలు

ఉద్యమంలో ఎన్నిరకాల సంఘాలు కన్పిస్తాయో అన్ని రకాల దృక్పథాలు, నిర్మాణాలు కూడా కనిపిస్తాయి. గ్రూపులన్ని ఏ ఒక్క సిద్ధాంతానికి కట్టుబడి వుండవు. 'మాదే సరైన సిద్ధాంతం' మిగిలినవన్నీ తప్పు అనే ధోరణి ఈ ఉద్యమంలో కనిపించదు. 'వెనకబడిన చైతన్యం' అనే అంశాన్ని ఉద్యమం బుద్ధిపూర్వకంగా నిలదీస్తుంది. సంస్థలలో కేంద్రీకృతమైన నాయకత్వ కమిటీలను, హెచ్చు తగ్గులను (హైరార్కీ) అది నిరాకరిస్తుంది. రాజకీయ నిర్మాణ స్వరూపం లోనూ, స్వయంప్రతిపత్తి అవసరాన్ని నొక్కి చెప్తుంది. ఈ స్వయం ప్రతిపత్తి అనేది రెండు రకాలు. ఒకటి పురుషులతో పాటు కాకుండా, ప్రత్యేకంగా సంఘాల్ని ఏర్పరచుకోవటం. పురుషులతో పాటు కలిసి పనిచేయాలంటే వాళ్ళ వెక్కిరింపులు, ఎగతాళి, నిరసనధోరణి, మాటల్ని మధ్యలో

తుంచి మాట్లాడటం, కొన్నిటిని విననట్లుగా వదిలేయటం ఇవన్నీ మన నమ్మకాన్ని, ధైర్యాన్ని దెబ్బ తీసేవిగా ఉంటాయి. అన్నీ అధికార నిర్మాణాలలో వుండే సమస్యలే ఇవన్నీ. మనం ముఖ్యమను కొన్న అంశాల్ని, ఎజెండాల్ని చొరవగా ముందుకు పెట్టే ధైర్యం మనకుండదు. అంతేకాదు. మన అవగాహనల్ని, అలోచనల్ని మూర్ఖత అనీ, అశాస్త్రీయమనీ, అరాచకమనీ, అసందర్భమనీ కొట్టి పారేయడం మన కనుభవమే. రెండోది, ఆ ప్రజా సంఘాల కార్యక్రమాల్నే కాకుండా స్వతంత్రంగా స్త్రీ సమస్యలను తీసుకొని కార్యక్రమాలుగా రూపొందించుకో గలిగే రాజకీయమైన స్వయం ప్రతిపత్తి. ప్రజాసంఘాల్లో, భాగంగా మాత్రమే వుంటే - స్త్రీ ప్రత్యేక అనుభవాల్ని, ఒకరితో ఒకరు పంచుకునే అవకాశాన్నీ, దాని ద్వారా విజ్ఞానాన్నీ పోగొట్టుకుంటాయనే విషయం మాత్రమేకాదు. మనం వేటి నయితే ప్రత్యేక స్త్రీ సమస్యలు కావనీ అవి రాజకీయ సమస్యలనీ అంటున్నామో వాటికివున్న రాజకీయ ప్రాముఖ్యతను మనమే అర్థం చేసుకుని ఇతర్లచే ఒప్పించగలిగే శక్తి ఏర్పడుతుంది. స్వయం ప్రతిపత్తి లేకుండా పాలిటిక్స్‌ను కొత్త దృక్పథంతో అర్థం చేసుకోగలిగే శక్తీ, అవకాశం మనకు లభించేవికావు.

అన్నిటికీ మించి 'పాలిటిక్సు'కు ఈ ఉద్యమం అందజేసిన ఒక ప్రధాన సాధనం 'చైతన్యాన్ని రేకెత్తించటం' (కాన్సన్‌నెస్ రేజింగ్). అమెరికా 60వ దశాబ్దంలో స్త్రీల ఉద్యమం ఈ సాధనాన్ని సిద్ధాంతం, అచరణాల విషయాలతో వినియోగించింది. అయితే ఆ ఉద్యమం కూడా 30-40లలో చైనా విప్లవంలోని "బాధల్ని వెళ్ళగక్కండి" (స్పీక్ బిట్టర్‌నెస్ క్యాంపేన్) అనే కార్యక్రమం నుంచి నేర్చుకున్న అనుభవం. ఈ సాధనం మనదేశంలో దళితులు, ఇతర నిమ్నజాతి వర్గాలు, మైనారిటీ మతాలు అందరి పోరాటాలకూ సాధనం కావచ్చు. ఈ సాధనాన్ని వినియోగించి కుటుంబానికి వ్యక్తిగత జీవితాలకు చెందిన మైక్రోపాలిటిక్సు రాజకీయాలను, బహిర్గతం చేయగల్గింది స్త్రీ ఉద్యమం. స్త్రీల మధ్య వారిలో వారికే ఆత్మస్థైర్యం, నమ్మకం పెంచుకోవటానికీ, ఇంత వరకూ వూహించని అంశాలలో, జీవితం మారుమూలల్లో స్త్రీవాద దృక్పథాన్ని చొప్పించగలిగే అవకాశాన్ని కలుగజేసింది.

సంఘాల్లో రకరకాల దృక్పథాలున్న స్త్రీలు రావటాన్ని ఉద్యమం ప్రోత్సహించింది. గాంధీ వాదం, మార్క్సిస్టు సిద్ధాంతం, ఉదారవాద ఫెమినిజంలాంటి సైద్ధాంతిక ధోరణులున్న రకరకాల స్త్రీలుండటం మూలంగా అన్నిరకాల దృక్పథాలకు చోటునివ్వగలిగే వాతావరణం ఏర్పడింది. దీని మూలంగా కేంద్రీకృతమైన నిర్ణయాలు తీసుకొనే అవకాశాలు చాలా తగ్గిపోయినాయి. వాటిస్థానే ఇతరుల అభిప్రాయాల్ని గౌరవించాలనే అవసరాన్ని గుర్తించటం జరిగింది. ఇప్పటి వరకూ వున్న రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలతో లాగా కాకుండా ఒక కొత్త రాజకీయ సంస్కృతికి స్త్రీ ఉద్యమం పునాది వేసింది.

## ఉద్యమం సాధించిన అంశాలు, సాధించాల్సిన విషయాలు

వీటి గురించి చాలా స్పష్టంగా రాయటానికి తగిన పరిస్థితులు, వాతావరణం ప్రస్తుతం మనకు లేవు. ఉదాహరణకి తీసుకున్న కార్యక్రమాల్లో మానభంగాలు, అత్యాచారాలు, వరకట్న మరణాలవంటి సమస్యలకు బహిరంగంగా ప్రజానీకం నుంచి గుర్తింపును సాధించగలిగామే కానీ, కుటుంబంలో నాలుగు గోడల మధ్య స్త్రీలు ఎదుర్కొనే మానసిక, శారీరక హింసల్ని అన్ని వేళలా హత్యలకే దారితీయని అణచివేతకు గుర్తింపును సాధించలేకపోయాం. అదే విధంగా పోలీసు అధికార యంత్రాంగంతో కూడిన మానభంగాల (కస్టోడియల్ రేప్) సమస్యల్ని చేపట్టామే కానీ కొన్నిసార్లు వివాహ జీవితంలో భర్తలు, వ్యక్తిగత జీవితంలో ఇతర కుటుంబ సభ్యులు చేసే మానభంగాల ప్రసక్తి కూడా తీసుకురాలేకపోయాం. అందుచే పౌరహక్కుల పరిధిలోనూ, మానవ హక్కుల పరిధిలోనే కాక వాటిని మించిన విమర్శనాత్మక దృష్టితో స్త్రీ సమస్యల్ని, రాజకీయాల్ని విశ్లేషించి అర్థం చేసుకోవాల్సిన అవసరం ప్రస్తుతం మనకుంది.

అదే విధంగా 'దళితుల సమస్య' ఇతర మైనారిటీ వర్గాల సమస్యలను అర్థం చేసుకుని ఆ ఉద్యమాలకు స్త్రీ ఉద్యమానికి ఎటువంటి సంబంధాలుండాలనే అవగాహన ఏర్పరచుకునే ప్రయత్నం మనం ఇంతవరకూ చేయలేదు. అందుకే 'ముస్లిం పర్సనల్ లా' మీద చర్చకు దారితీసిన షాబానో కేసు (85-86)లో స్పష్టమైన వైఖరి నవలంబించలేకపోయాయి. స్త్రీ సంఘాలన్నిటి మీద ఈ సమస్య గురించి బలమైన వత్తిడి వుండింది. అసలు షాబానో కేసు స్త్రీ సమస్యనా లేక హిందూ ముస్లిం మత వైషమ్యాలకు పనికొచ్చే సాధనమా అని తేల్చుకోలేకపోయాం. అదే విధంగా యూనిఫాం సివిల్ కోడ్‌ను సమర్థిస్తే, ప్రధానంగా హిందూతత్వాన్ని నూరిపోసే . ఈ వ్యవస్థను సమర్థించినట్టా లేక ఇతర మైనారిటీల ప్రత్యేకతను గుర్తించాలంటే దీన్ని సమర్థించ గూడదనుకోవాలా ఏ విషయాన్ని తేల్చుకోలేకపోయింది ఈ ఉద్యమం.

మనం తీసుకున్న కార్యక్రమాల్ని కొంతవరకు సఫలం చేసే వ్యవస్థను మనం ఏ విధంగా అర్థం చేసుకోవాలి? రాజకీయ సమస్యలుగా రూపొందించాలనుకున్న సమస్యల్ని -

ఈ వ్యవస్థ ప్రచార సాధనాలు, సినిమాలు, రాజకీయపార్టీలు - విరాజకీయం చేస్తున్నాయన్నది వాస్తవం. దీన్నేవిధంగా ఎదుర్కోవాలి? అలాగే ఉద్యమాలలోకి వచ్చిన స్త్రీలందరం వాళ్ళల్లో వున్న బలహీనతల్ని, లోపాల్ని, తప్పుడు అవగాహనల్ని తెల్లవారేలోగా మార్చేసు కొని ఆదర్శమూర్తులయ్యారని చెప్పలేం. ఈ సమాజ సిద్ధాంతాలను పుట్టినప్పటి నుంచీ జీర్ణించుకున్న స్త్రీలు అవి పోగొట్టుకోవాలంటే జీవితాంతం, నిరంతరం రాజకీయ పోరాటం చేయక తప్పదు. మన మనస్సులతో, శరీరాలతో, కుటుంబాలతో, సమాజంలో అన్ని రకాల స్థాయిలోనూ ఈ పోరాటం జరిగాలి. ఈ స్పృహే మనమీద ఒక పెద్ద రాజకీయ బాధ్యతను ఉంచుతుంది. వ్యవస్థలో మిగిలిన సమస్యలన్నీ పరిష్కారం అయిన దాకా మనం విశ్రాంతి తీసుకుందాం అని అనుకోవటానికి వీలులేదు.

**కె. లలిత**

# దళిత సాహిత్యం

దళిత సాహిత్యం అంటే ఏమిటి అనేది చాలమంది వేసే ప్రశ్న. దళితులు సమాజంలో భాగమే కదా మరి వారికి ప్రత్యేక సాహిత్యం అవసరం ఏమిటి అని కొందరి సందేహం. దళిత సాహిత్యం ఎలా ఉండాలి? దళితులే రాయాలా మరొకరు కూడా వారి కోసం రాయవచ్చునా అనేది మరో ప్రశ్న. అసలు దళితులంటే ఎవరు అనేది కూడా వివరణ కోరుతున్న ప్రశ్నే. దళితుడు అంటే అణగగొట్టబడినవాడు. దళితము అంటే ఛేదింపబడినది. ఖండింపబడినది, చీల్చబడినది, వికసించినది, సగముగా చేయబడినది, ఇటునటు చిమ్మబడినది అనే అర్థాలు తెలుగు నిఘంటువులు చెబుతున్నాయి. హిందీలో దళిత-పదానికి నలిపివేయబడిన, అణగద్రొక్కబడిన అనే అర్థాలు వ్యాప్తిలో ఉన్నాయి.

వీటన్నింటినీ సమన్వయం చేసి ప్రస్తుత పరిస్థితితో జోడించి చూస్తే సాంఘిక సమానత్వం ఆర్థిక ప్రగతి, మానవస్వేచ్ఛ వంటి రంగాలలో సమాజం నుంచి వేరుగా చేయబడిన వారు దళితులనే అర్థం బోధపడుతుంది. భారత రాజ్యాంగంలో పేర్కొన్న షెడ్యూలు కులాలు/జాతులు, వెనుకబడిన వర్గాలు పై కోవలోకి వస్తారు, కాబట్టి వారంతా దళితులు. వారికి సంబంధించినది. దళిత సాహిత్యమని స్థూలంగా చెప్పవచ్చు.

సాహిత్యంలో పురాణాలను గురించి, ఎక్కువగా సమాచారం వచ్చిన కాలాన్ని పురాణ యుగమని అంటున్నాం. విప్లవాన్ని ప్రబోధించే సాహిత్యాన్ని విప్లవ సాహిత్యమని అంటున్నాం. అలాగే దళితులను ఉద్దేశించినదీ వారిని ప్రబోధించేదీ దళిత సాహిత్యం. కులమత పరమైన నిషేధాలవల్ల - ఆర్థిక వ్యత్యాసాల వల్ల సమాజంలో వేరుగా చూడబడుతూ సామాజిక దౌష్ట్యానికి గురి అవుతూ నిస్సహాయంగా జీవితాలు వెళ్ళమారుస్తున్న వారికోసం ఆవేదన చెందటం, వారి సమస్యలు చిత్రించటం, వారి జీవితాలు మెరుగుపడటానికి పరిష్కార మార్గాలు సూచించటం, దళిత సాహిత్యంలోని ముఖ్యలక్షణాలుగా వివేచించవచ్చు.

దళితసాహిత్యం అవసరం ఉన్నదా అని కూడా కొందరికి సందేహంగా ఉంది.

శతాబ్దాలుగా విద్య భారత దేశంలో కొందరికే పరిమితంగా ఉంటూ వచ్చింది. సాహిత్య ప్రయోజనం ఎవరెన్ని విధాలుగా నిర్వచిస్తూ వచ్చినా కనీస విద్య దళితులకు ఆకాశ కుసుమంగానే ఉండిపోయింది.

"విద్య లేనివాడు వింత పశువు" అన్న పెద్దలే సమాజాన్ని వింత పశువులనంతగా చూడటానికి కుతూహలపడ్డారు. తాము ఆలకాపరులుగా క్రూర పెత్తనం చలాయించారు. భాష-సాహిత్యం, విద్య ఇవన్నీ జాతి సంస్కృతికి నిదర్శనాలు. ఇక వ్యక్తి భాషను బట్టి సంస్కృతిని అంచనా వేస్తుంటారు. అలాంటప్పుడే విద్యకూ నాగరిక భాషకూ శతాబ్దాలుగా దూరం చేయబడిన జాతి, తన సంస్కృతిని నిర్మించుకోవటానికే కాలప్రవాహంతో సమవేగం సాధించటానికే ఎంతో శ్రమ పడవలసి ఉంది. నిచ్చెనమెట్ల సమాజంలో మొదటి నుంచీ ముందు ఉంటూ తమ ఛాయలకు కూడా రానీయకుండా మిగతావారిని వెనక్కు తోసేస్తూ అధికారం సాగించిన వర్గాల సాహిత్యం వేరు. దళిత సాహిత్యం వేరు. ఈ కోణంలోంచి చూస్తే దళిత సాహిత్యం ఎంత పటిష్టంగా నిర్మాణాత్మకంగా సాగవలసిన అవసరం ఉందో బోధపడుతుంది.

పూర్వం ప్రాకృతం, మాగధి, పైశాచి, వంటి దేశభాషలు వాడుకలో ఉండేవి. భాష-విజ్ఞానం ఎవరికీ నిషిద్ధాలు కావు. ఆ తర్వాత జరిగిన భౌగోళిక, రాజకీయ, సామాజిక మార్పుల వల్ల పరిస్థితులు మారి భాషలలో ఎక్కువ తక్కువలు సృష్టించారు. ఇక భాషను సంస్కరించి శాస్త్ర విజ్ఞానమంతా ఆ భాషలోకి తెచ్చారు. ఆవిధంగా విద్య దళిత వర్గాలకు దూరమైంది. విద్యతో పాటు సంస్కృతికీ వారు దూరమయ్యారు. ఒక పద్ధతి ప్రకారం అతి కట్టుదిట్టంగా జరిగిన ఈ మోసాన్ని దళితులు చెప్పినా తెలుసుకోలేని స్థితిలో ఉన్నారు. కాబట్టి వారిని ప్రబోధించటానికి ఈనాడు దళిత సాహిత్యం అవసరమైంది.

అసలు సాహిత్యానికీ కళలకూ ఆద్యులు దళితులేనని కూడా చెప్పవచ్చు. భాష పని నుంచి శ్రమ నుంచి పుట్టిందంటారు. ఆధునిక తత్త్వవేత్తలు భాషలో మొదటి వ్యక్తీకరణ లయబద్ధమైన పదం - పాట - వాటికి మూలం శ్రమ-పని. యాస్కుని మతం ప్రకారం భాష ధాతుజన్యం. ధాతువులు పనిని (క్రియను) సూచిస్తాయి. పనికికర్త శ్రామికుడు అంచేత భాష శ్రమనుంచి పుట్టిందనేది అంగీకరించవలసిందే. ఆర్యీకరణం చెందిన దశలో ఇవన్నీ మొదట ఎవరివో వారికే అందకుండా పోయాయి.

తెలుగుల (లిఖిత) చరిత్ర ప్రారంభం కావడం వారి ప్రాచీన భాష అంతర్నిహితం కావడం రెండూ ఒకే సమయంలో జరిగి ఉండవచ్చుననీ జనమంతా నిస్సందేహంగా మను సంహిత దైవదత్తమని అంగీకరించేటట్టుగా ఈ 'సంస్కృతీకరణ కవాతు' జరిగిందని విజ్ఞులు చెబుతున్నారు. ఇలా రూపొందించడంలో ప్రతి తరాన్ని పురోహితులకు అధిక గౌరవం ఇచ్చే తరంగా తరువాతి శతాబ్దాలలో కొన్ని వర్గాలకు మాత్రమే ఉచ్ఛస్థానం కల్పించే రీతిలో కులగౌరవాన్ని ప్రతిపాదించారని భావిస్తున్నారు.

తెలుగు సాహిత్య చరిత్ర రచించిన మొదటి సాహిత్య చరిత్రకారులు శూద్రకవులను వదిలి వేయటం గమనించదగ్గది. తెలుగువారి ప్రాచీన భాషా సాహిత్యాలు మార్పు చెందటం అనేది ఎప్పుడు ప్రారంభమైందో నిర్ణయించటం కష్టం.

ఆధునిక యుగంలో ఆంగ్లేయులు భారతదేశానికి పాలకులైన తరువాత ఆంగ్లభాష ప్రభావం ఫలితంగా భారతీయుల ఆలోచనా సరళిలో మార్పు వచ్చింది. మహాత్మా జోతిరావ్ ఫూలే, అంబేద్కర్, దయానంద సరస్వతి వంటి మహనీయుల అంతర్మథనం భారతదేశంలోని దళితులకు భాగ్యోదయంగా భాసించింది. దళితులు అంటరాని కులాలవారు-వృత్తి పనులవారు మొ॥ వారంతా తాము మనుషులమే ననీ ఈ దేశంలో తమకూ కొన్ని హక్కులున్నాయనీ గుర్తించారు. ఆ విధంగా వారు గుర్తించేటట్టు చేయటానికి సమకాలికంగా ఎన్నో ఉద్యమాలు నడిచాయి.

ఈ ఉద్యమాలలో సంఘటితంగా జరిగిన కృషిలో మొట్టమొదట క్రైస్తవ మిషనరీలను చెప్పుకోవాలి. పోర్చుగల్, ఫ్రాన్సు, బ్రిటన్ దేశాల నుంచి వచ్చిన మిషనరీలు దళితవర్గాల వారిని సమీపించి వారికి ప్రోత్సాహకరమైన భవిష్యత్తును చూపారు. మతపరంగా, విద్యాపరంగా, వైద్య సహాయపరంగా దళితులకు మొదట చేయూతనిచ్చినది వారే.

క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ వారు ప్రాంతాయ భాషలలోనూ సరళమైన ఇంగ్లీష్‌లోనూ, భారతీయుల కోసం ఎన్నో పుస్తకాలు ప్రచురించారు. తెలుగులో కొన్ని పత్రికలు కూడా నడిపారు.

'సత్యమైన వేదంలో ఉండే జ్ఞాన ఉపదేశాల యొక్క సంక్షేపం' (1746); మోక్షానికి కొంచ్చుపొయ్యే దేవ (1746); "బుద్ధి గలిగిన నూరు జ్ఞాన వచనాల యొక్క చిన్న పుస్తకం (1747); ఇదే ధర్మపుస్తకం (1818) వంటివి ఉదాహరణకు కొన్ని. తెలుగులో ఈ వాఙ్మయం చాలా వచ్చింది. పాటల పుస్తకాలు (కీర్తనల పుస్తకాలు), కరపత్రాలు బైబిలు సూక్తులు చాలా వెలువడ్డాయి. ఇవన్నీ ప్రత్యక్షంగాను పరోక్షంగానో బైబిల్ సమాచారాన్ని అందించేవే. ఇవే దళిత సాహిత్యానికి నాంది పలికాయనవచ్చు. మిషనరీల ప్రబోధంకు చాలమంది దళితులు క్రైస్తవం పట్ల ఆకర్షితులయ్యారు. కొందరు జిజ్ఞాసాపరులు ఆ వెలుగులో తమ మతాన్ని సమాజాన్ని విశ్లేషించుకోసాగారు. జోతిరావ్ ఫూలేలో సమాజపరమైన జిజ్ఞాస కలగటానికి కారణం మిషనరీలు. వారుద్దేశించిన విద్యాలయాలు వారి సేవా ధర్మమూ అని ఒప్పుకోక తప్పదు.

జోతిరావ్‌ఫూలేను ప్రథమ దళిత మేదావి రచయితగా పేర్కొనవచ్చు. తర్కబుద్ధితో ఆయన ఒక సామాజిక విప్లవాన్ని ఆహ్వానించాడు. దళితులను ప్రబోధించే ప్రయత్నంలో జానపద కళారూపాల ద్వారా తన భావాలను ఆశయాలను ప్రచారం చేశాడు. సరళమైన భాషలో అందరికీ అర్థమయ్యే విధంగా పాటలు ప్రసంగరచనలు, నాటికలు రాశాడు. అన్నీ చేసినా అవి చదువుకొనే వారెవరూలేరు గనుక వాటిని ప్రదర్శించి పాడించి ఎవరికైతే అవసరమో వారికి వినిపించాడు, పీడితులకూ తాడితులకూ ఉద్దేశించిన కవిత్వాన్ని వారి దగ్గరకు తీసుకువెళ్ళి వారికి వినిపించిన ఖ్యాతి తొలుతగా జోతిరావ్‌కే దక్కుతుంది. మతపరమైన, సమాజపరమైన సందేహాలు లేవనెత్తుతూ, వాటిని విశ్లేషిస్తూ, విమర్శిస్తూ, నిరూపిస్తూ, విశదం చేస్తూ ప్రజలను, దళితులను జ్ఞానోన్ముఖులుగా చేయటానికి ఆయన రచనను సాధనంగా చేసుకొన్నాడు. పత్రికలు కూడా నడిపాడు.

జాతాయోద్యమానికి తోడ్పటుగా కాల్పనిక కవితోద్యమం వచ్చింది. దేశభక్తినీ జాతీయతనూ ప్రబోధించే కవిత్వమూ సంఘసంస్కరణ కవిత్వము అస్పృశ్యతా నివారణోద్యమ కవిత్వమూ దానిలో భాగాలైనాయి. "మాకొద్దీ తెల్ల దొరతనమూ" అని దేశభక్తులు కొందరు ఎలుగెత్తి చాటుతున్న దశలోనే 'మాకొద్దీ నల్ల దొరతనము" అని దళిత వర్గాలు విలపించాయి. బ్రిటిష్‌వారు భారత దేశానికి ఇచ్చి వెళ్ళే ఆ స్వాతంత్ర్యం లో దళితులకా భాగం ఉంటుందా లేదా అనే సందేహంతో దళితులు కొట్టుమిట్టాడారు.

ఈ దశలో తెలుగులో వచ్చిన దళిత సాహిత్యం చాలా తక్కువ. దానికి మానవతా వాదమూ, కాల్పనికోద్యమమూ భూమికలు.

## కవిత్వం

పల్లిజన ప్రకృతి, దేశభక్తి, సంఘ సంస్కరణం, కర్షక కార్మిక జీవితాలు ఇతివృత్తాలైన రోజుల్లో గొల్లవారు, పడవ సరంగులు, జాలర్లు మొ॥ వారి గురించిన కవితలు కనబడుతున్నాయి.

దువ్వూరి రామిరెడ్డిగారి వనకుమారిలో 'గాపకుల' వృత్తాంతం ఉంది. వారు 'ముసలి మావెత' ను విశిష్టమైన వ్యక్తిత్వంతో చిత్రించారు. కవికొండల వెంకట్రావుగారి 'రక్తకుల్య గాథ'లో పడవ సరంగుల గురించి ఉంది. వీరే 'ప్రకృతి - చందనము'లో మంగలి కుర్రవాని గురించి కళ్ళంలో ధాన్యపు గింజలు ఏరుకునే ముసలివాని ఆత్మతృప్తి గురించీ కూడా రాశారు. అడవి బాపిరాజుగారు తోటమాలి కూతురిపైనా గౌళ్ళ సెల్లాయి కూతురుపైనా శ్రామిక వర్గ ప్రజలమీదా పాటలురాశారు. వీటిలో కవితా దృష్టి తప్ప సామాజిక దృష్టి లేదు. ఎంకి పాటలు, బంగారి మామ పాటలు కావటానికి జానపదుల ఇతివృత్తాలే అయినా, వాటిలో శృంగార భావన ప్రధానంగా ఉంది.

కొనకళ్ళ వెంకటత్నం గారి 'రోడ్డురోలరు' పాట; రెంటాల గోపాల కృష్ణ గారి 'పల్లకీ బోయీ'లు దళితుల ఆవేదనను ప్రకటించే రచనలు. మంగిపూడి వెంకటశర్మ, గురజాడ, మాదవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రి, గుడిపాటి వెంకటచలం, ప్రభృతులు వర్ణవివక్షను నిరసిస్తూ ప్రబోధాత్మకమైన రచనలు చేసిన వారిలో కొందరు.

వీరంతా అంటరానితనాన్ని నిరసించారు. అంటరాని వారుగా చూడబడుతున్న వారిని తోటి సోదరులుగా చూడవలసిందిగా సమాజాన్ని అర్థించారు, ప్రాధేయపడ్డారు, ప్రబోధించారు.

అయితే గమనించవలసిన విషయమేమిటంటే దళిత మేధావులు రచయితలు చేసే రచనలకూ దళితేతర మేధావులు రచయితలు చేసే రచనలకూ తేడా ఉంటున్నది. విషయ ప్రతిపాదనలో వివరణలో చిత్రణలో సమస్యలను విశ్లేషించి చూడటంలో

జిజ్ఞాసలో పరిష్కార సూచనలో అన్నిటా ఈ భేదం గమనించవచ్చు.

వర్గ సంఘర్షణను ప్రతిభావంతంగా చిత్రించిన వారంతా వర్ణ సంఘర్షణను అంత అనుభూతితోనూ చిత్రించ లేకపోయారేమో అనిపిస్తుంది. నైజాం వ్యతిరేక పోరాట సాహిత్యంలో వెట్టిచాకిరీని కులమత భేదాలను నిరసించే ప్రయత్నం ఉంది. అయితే ఇవి మానవతా వాద ప్రభావంతో వచ్చినవే. ప్రత్యేకం దళితుల కోసం వచ్చినవి కావు.

మంగిపూడి వారి నిరుద్ధ భారతం (1915) దళితుల పరంగా ఎన్నదగిన ప్రబోధ కావ్యం. మొదటి భాగంలో దళతులను గురించిన పూర్వ సమాచారం వర్తమాన స్థితి చెప్పారు. మానవతా మక్కులతో వారిని తోటి మానవులుగా చూడాలని విజ్ఞప్తి చేశారు. చివరగా ఓ పంచములారా మీరు అసమర్థులు కాదు. వంచితులైనారు. అంతే ఆత్మబలాన్ని గుర్తించండి మేల్కొనండి అని అన్యాపదేశంగా పోరాటమార్గం సూచిస్తూ ప్రబోధించారు. కుసుధర్మన్నగారి రచనలలో “అంటు దోషము మానరెలా? దాని విడుదాలకై యింత పంతాము మీకేల” అనే పుస్తకం 1921 ప్రాంతాలలో వచ్చింది. అది హిందూ ధార్మిక ప్రచారం వారి ప్రచురణ ఇది. 'నల్లదొరతనము' అనేది పుస్తకం లోపలి శీర్షిక. మచ్చుకు ఒక పద్యం 'పన్నెండు మాసాలు పాలేరుతనమున్న పస్తులుబడుచు బ్రతుకాలండి ఆలి కూలి జేసే తీరాలండి. పిల్లగాడు పశువును గాయాలండి. మేమంతా కష్టపడ్డానండి కట్ట గుడ్డా కూడు గిట్టదండి. అప్పు తీరదీ చిత్రమేమండి. దేవ కనికారము లేక కడుపు మాడ్చేరండి. మాకొద్దీ నల్ల దొరతనము బాబు దేవ మాకొద్దీ నల్లదొరతనము. దేవ పదిమందితో బాటు పరువుగలుగకయున్న మా కొద్దీ నల్ల దొర తనము”. ఇది దళిత సాహిత్యం ఈ ఆత్మవేదన దళితులకు కర్తవ్యాన్ని స్ఫురింపజేస్తున్నది.

జాషువా గారి రచనలు బోయి భీమన్న గారి రచనలు కవితాత్మతో పాటు దళిత వర్గ సంక్షేమాన్ని కూడా రంగరించుకున్నవి. జాషువా గారి గబ్బిలము (1941) వాస్తవికతకూ భావనవ్యతకూ పేరొందింది. అస్పృశ్యుల దీనగాథను వినిపిస్తూ వారికి కర్తవ్యాన్ని ఉపదేశించింది. వారి ఇతర రచనలలోనూ దళితుల ఆవేదన గుండెలకు హత్తుకొంటుంది. భోయభీమన్న గారు రసాద్వైత కవిగా పేరు తెచ్చుకున్నా అయన చాలా రచనలు దళితులకు మార్గాపదేశకంగా ఉన్నాయి. “మాలను గావించి పాలేరుగా జేసి కామందు కాలికి కట్టినారు” అని ఆక్రోశించిన వాడాయన. వారి “దీపసభ” కవితా ప్రపంచంలోనే అపురూపమైన ప్రయోగం.

అధునికులలో అత్యంత అధునిక విప్లవ సామాజిక భావనతో కవిత్వం రాసినవారున్నారు. వర్తమాన సమాజంలోని దుష్టశక్తుల మీద మూఢాచారాల మీద రాజకీయ ప్రభావాలమీద ఎంతో కవిత్వం వెలువడింది. అవన్నీ జాతీయత, మానవ వికాసం లక్ష్యంగా వచ్చినవే అయినా ఒక ఆలోచనా పరిధితోనే సాగిపోయాయి. “మార్క్స సిద్ధాంత పరమైన వర్గరహిత సమాజ సృష్టిని ఈ కవులు తమ ధ్యేయంగా కూర్చుకుని తాము నిబద్ధ కవులుగా ముద్రవేయించుకున్నారు' అని అభ్యుదయ రచయితలను గూర్చి సాహిత్య విమర్శకులు అంటున్నా, అది అధిక భాగం సమాజంలోని కొన్ని వర్గాలకే పరిమితమైనాయని చెప్పకతప్పదు. కర్షకుల-కార్మికుల కవిత్వమే అయినా నిర్మాణాత్మక దృక్పథం వాటిలో లోపించింది.

విప్లవ కవిత్వంలో పాటగా ఆవిర్భవించిన కవితాశాఖ చాలావరకు దళితుల అవసరాలను తీరుస్తున్న దనవచ్చు. గద్దర్, వంగపండు, శివసాగర్ ప్రభృతుల రచనలు దళిత సాహిత్యంలో ప్రధానమైనవి. దళితుల కోసం రాసిన వాటిని దళితులకు పాడి వినిపించి ప్రదర్శించి వారిని ఉత్తేజపరచటం అనే లక్ష్యం నెరవేరటం ఇక్కడ గమనించదగ్గది. దళిత సాహిత్యం పోరాట మార్గంలో పయనించటం ఇక్కడ ప్రధానమైన మార్పు.

## వచన వాఙ్మయం

వచనం ఇరవయ్యో శతాబ్దంలో బహుళ ప్రచారంలోకి వచ్చింది. వచనం కొన్నాళ్ళు పండితుల చేతిలో జటిలంగా, సామాన్యులకు కొరుకుడు పడకుండా పోయినా ఇటీవల పత్రికల ధర్మమా అని సామన్యునికి అందుబాటులోకి వచ్చింది.

భావప్రచారానికి వార్తా ప్రచారానికి ఈనాడు ఎక్కువగా వచనమే ఉపయోగపడుతున్నది. ఒక విషయాన్ని విపులంగా యుక్త యుక్తంగా ఎదుటివారికి చెప్పగల సమర్థత ఈనాడు వచనానికి ఉంది.

దళితుల నుద్దేశించి వర్ణ వ్యవస్థను గురించిన కరపత్రాలు పుస్తకాలు, ఎన్నో వెలువడ్డాయి. దళితులకు మార్గదర్శకులైన మహానుభావుల చరిత్రలు సూక్తులు వచన వాఙ్మయంలో ముఖ్యంగా చెప్పుకోదగ్గవి. ఈనాడు అంబేద్కర్ జీవితచరిత్ర, ఆయన సూక్తులు, దళితులకు నిత్యస్మరణాలైన వేద పురాణాల స్థానాన్ని ఆక్రమించాయి. అంటరానివారిని గురించిన చరిత్ర అంబేద్కరిజంను గురించిన రచనలు, వర్ణవ్యవస్థను గురించిన రచనలు, ఇతర భాషలలోని వ్యాసాలు పుస్తకాల అనువాదాలు వచన వాఙ్మయంలో ప్రధానంగా ఉన్నాయి.

దళితులను జాగృతం చేస్తూ ఎన్నో పత్రికలు కూడా వెలిశాయి. కుసుమ ధర్మన్నగారి జయభేరి, బి.యన్. మూర్తిగారి 'నవజీవన', అప్పస్వామిగారి 'జ్యోతి' భాగ్యరెడ్డివర్మ గారి 'భాగ్యనగర్' గోవాడ నిరీక్షణరావు గారు బందరు నుండి నడుపుతున్న భాగ్యనగర్, చాలా సేవచేశాయి. ఇటీవల దళిత్‌వాయిస్, మూక్‌నాయక్ వంటివి వస్తున్నాయి.

## నవలా వాఙ్మయం

వచన వాఙ్మయంలో నవల, కథ అగ్రస్థానంలో ఉన్నాయి. ఈ రెండింటిలోనూ వ్యక్తుల దైనందిన జీవితంలోని సంఘటనలు-సమస్యలు ఇతివృత్తంగా ఉండే అవకాశం ఎక్కువ. ఆ విధంగా వ్యక్తిని అల్లుకొని ఉన్న రాజకీయ, ఆర్థిక సామాజిక సమస్యలకు కవిత్వం కంటె నవల-కథ ఎక్కువ ఆలంబనమయ్యాయి. రైతాంగ పోరాటం, భూస్వామ్య వ్యవస్థలోని అరాచకాలు,

రాజకీయ ఉద్యమాలు, సంఘసంస్కరణోద్యమాలు వంటివి చిత్రించే రచనలతో బాటు దళితుల కష్టాలు చిత్రించే రచనలూ చాలా వచ్చాయి. దళితుల సమస్యను గాంధీజీ రాజకీయ రంగంలోకి ప్రవేశపెట్టక మునుపే పంచముల గురించి ఎంతో ఆలోచన జరిగింది. తత్సంబంధిత రచనలూ వచ్చాయి. తల్లాప్రగడ సూర్యనారాయణగారి, మేలావతి (1913)లో హిందూమతంలో తమకు గౌరవం లేదు గనక పంచములు మహమ్మదీయ మతం స్వీకరించటం చిత్రితమైంది. హిందూ జాతిని రక్షించుకోవాలంటే నిమ్నజాతులను కలుపుకోవాలనే ప్రబోధం ఇందులో ఉంది. వేంకట పార్వతీశ్వర కవుల, మాతృమందిరము (1918)లో వర్ణ వ్యవస్థ మీద విమర్శ ఉంది. ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి (1922) హేతువాద, మానవతావాద, కాల్పనికోద్యమాల ప్రభావంతో వచ్చింది. దళితులను ఐహిక గుణాల నుంచి మళ్ళించటం నవల ప్రయోజనాన్ని దెబ్బతీసిందేమో అని దళితుల పరంగా ఆలోచిస్తే కలిగే సందేహం. తక్కెళ్ళ జగ్గడి పోరాట మార్గం కొంత ఉపశమనం కలిగే సూచన.

## దృశ్య కావ్యాలు

ఏ విషయాన్నైనా మనసుకు హత్తుకునేటట్లు చెప్పటంలో దృశ్య కావ్య ప్రక్రియకున్న పటిమ మరిదేనికీ లేదు. ఇప్పటి సినిమా, దూరదర్శన్‌లే ఇందుకు తార్కాణం. అందుకే చాల మంది రచయితలు తమ ఉద్యమ ప్రచారానికి దృశ్య ప్రక్రియలను సాధనాలుగా గ్రహించారు. నాటకాలు, బుర్రకథలు, హరికథలు, ప్రసంగాలు, నాటికలు, ఏకాంకికలు, బొమ్మలాటలు ఉత్తమ ప్రచారసాధనాలుగా గణనకెక్కాయి. త్రిపురనేని రామస్వామి చౌదరిగారి శంబుక వధ (1922) ఎ.వి. నీలకంఠ శాస్త్రిగారి హరిజనుడు (1935), వర్ణవ్యవస్థను విమర్శిస్తూ వచ్చిన నాటకాలు, వీటిలో మొదటిది ఆలోచనను రేకెత్తించే విధంగా ఉంటే రెండోది మతపరమైన ఒదార్పుతో ఉంది. బోయి భీమన్నగారి పాలేరు (1946) ఈ ప్రక్రియలోనే కాదు, మొత్తం దళిత సాహిత్యంలోనే మకుటాయమానమైన రచన. గ్రామ సౌభాగ్యమే దేశ సౌభాగ్యమని చెప్తూ దళితుల సమస్యను *సంపూర్ణమైన పరిజ్ఞానంతోనూ అనుభూతితోనూ చిత్రించి ఆచరణయోగ్యమైన పరిష్కారాన్ని సూచించటం ఈ నాటకంలో చూడవచ్చు. "బానిసతనమును బాపుమురా" అని వెంకన్న ఆవేదనతో రైతువాడలో పాడుకుంటుండగా ఆరంభమైన నాటకం అదే వెంకన్న (వెంకటేశ్వర్రావు) అదే రైతు వాడకు డిప్యూటీ కలెక్టర్‌గా కాంపుకు వచ్చి "కుటిలదాసము గొలిచె" అని ఆనందంగా పాడుకొంటున్న దృశ్యంతో ముగుస్తుంది. ఆద్యంతమూ వాస్తవికతను ప్రదర్శించటం దీని ప్రత్యేకత.

వీరి 'కూలిరాజు' కూలీలకు పట్టం కట్టిన నాటకం. మోదుకూరి జాన్సన్ నిచ్చెనమెట్లు కూడా ప్రతిభావంతమైన రచన.

## దళిత వ్యతిరేక సాహిత్యం

దళిత వ్యతిరేక సాహిత్యాన్ని కూడ ఈ సందర్భంలో ప్రస్తావించుకోవలసి ఉంది. పాము చిన్నదే అయినా పెద్ద కర్రతో కొట్టాలంటారు. ఏదైనా రోగానికి ధైర్యం చేసేటప్పుడు రోగాన్ని సమూలంగా నివారించాలంటే నయమైన తర్వాత కూడా మందువాడాలంటారు. శతాబ్దాలుగా విద్యకూ విజ్ఞానానికీ సామాజిక జీవితానికీ దూరం చేయబడ్డ దళితుల విషయంలో మాత్రం ప్రత్యేక సదుపాయాలు క్షణమాత్రమైనా సహించలేని వారు సమాజంలో రోజురోజుకు ఎక్కువౌతున్నారు. వందల సంవత్సరాలు వంశపారంపర్యంగా రాజభోగాలు అనుభవించినది మరచిపోయి దళితలకు పాఠశాలలోనూ ఉద్యోగాలలోను 2,3 సీట్లు ఇస్తామనే సరికి ప్రళయం వచ్చి మీద పడ్డట్టుగా గగ్గోలెత్తి పోతున్నారు. తాము ఇంత వరకు పొందుతున్న సౌకర్యాలు పోతాయన్న భయం. రిజర్వేషన్ వ్యతిరేక భావన సమాజంలో రోజు రోజుకూ పెరుగుతున్నది. ఫలితంగా బోలెడంత సాహిత్యం పత్రికల నిండా వచ్చిపడుతోంది.

"దురదృష్టవశాత్తు నేను అగ్రకులంలో పుట్టాను" అనటం చాలా కథలకు ముగింపు. దేశంలో నిరుద్యోగానికంతా కారణం దళితులు చదువుకోవటమే. చాలా ప్రతిభావంతులైన అగ్రకులాల యువకునికి ఉద్యోగం లేకపోవటం ఏమీరాని నిమ్నకులాల యువకునికి రిజర్వేషన్ పేరుతో ఉద్యోగం రావటం ఇతివృత్తంగా సినిమాలు వచ్చాయి. కథలూ, నవలలూ వస్తున్నాయి. వాటిని ప్రతిభావంతంగా ఎదుర్కొనవలసిన బాధ్యత దళిత సాహిత్యకారులపై ఉంది.

## సానుభూతి సాహిత్యం

దళిత సాహిత్యం ముసుగులో సానుభూతిపరుల నుంచి వస్తున్న సాహిత్యం కూడా ఉంది. దానినుంచి సమాజాన్ని రక్షించవలసిన బాధ్యత కూడ దళిత రచయితలపై ఉంది. ఈ సానుభూతి పరులు దళితుల సమస్యలను సరిగ్గా అర్థం చేసుకోలేక తమకు తోచిన రీతిలో కళాత్మక విలువలు- పాత్ర చిత్రణ- ఔచిత్యం- సన్నివేశ కల్పన, విశ్లేషణ, రసపోషణ వంటివన్నీ బేరీజు వేసుకుంటూ, చాలా గొప్ప విలువలతో రాశామనుకోవటం - అలాంటి వారే పదిమంది దాన్ని మెచ్చుకోవటం అవి ఇతర భాషలలోకి అనువాదం కావటం వంటి వన్నీ సాహిత్య ప్రపంచంలో జరుగుతున్నాయి.

నమాజాన్ని బయటినుంచి చూస్తూ ద్రష్టగా దానిని గమనిస్తూ రచనలు చేయటం, సమాజంలో వ్యక్తిగా అనుభూతితో రచనలు చేయటమూ రెండూ వేరు వేరు అని అందరూ అంగీకరిస్తారు. రచయిత సమాజంలో ఏ స్థాయిలో ఏ పాత్ర వహిస్తున్నాడనేది కూడా ప్రధానమైన అంశమే.

తాను ఏ ప్రజలను గురించి రాస్తున్నాడో ఆ ప్రజలతో అతనికి గల సంబంధం కూడా రచనపై ప్రభావాన్ని చూపుతుంది. ఎన్.ఆర్.నంది "నైమిశారణ్యం", కేశవరెడ్డిగారి "ఇన్‌క్రెడిబుల్ గాడెన్", కాళీపట్నం రామారావుగారి 'యజ్ఞం' ఈ రకమైన నందేహాలకు తావిచ్చి ఉండటం గతంలో అనుభవమైన విషయమే.

దళిత సాహిత్యం ఒక ప్రయోజనాన్ని ఆశించే సాహిత్యం, దాని గమ్యం సుదూరమైనదే కావచ్చు, మార్గం కంటకమయమే కావచ్చు, ముళ్ళబాటలో పయనిస్తూ లక్ష్యం చేర్చవలసిన బాధ్యతను రచయితలు వహించవలసే ఉంటుంది. చివరగా ఒకమాట దళిత సాహిత్యం రాయటానికి దళితులే రానవసరం లేదు. కాని మరి - సమస్య దృష్ట్యా దళితులు రాసినదే దళిత సాహిత్యం అవుతోంది.

**డాక్టర్ బి. విజయభారతి.**

# తల్లి ఒడినుంచి గిరిజనుల్ని లాగేస్తున్నారు

"గిరిజనుల జీవించే హక్కు" పై ఫిబ్రవరి 15, 1990న నారాయణగూడ, వై.ఎం.సి.ఏ.లో పి.యు.సి.ఎల్. ఏర్పాటు చేసిన సభలో బి.డి. శర్మ చేసిన ప్రసంగం పూర్తి పాఠం. అనువాదం శ్రీనివాసమూర్తి.

వ్యవసాయం పై ఆధారపడిన ఆర్థిక వ్యవస్థలో అడవులకు, కొండకోనలకు అంత ప్రాముఖ్యత ఉండేది కాదు. ఇండోగాంజెటిక్ మైదాన ప్రాంతాల్లోకాని, సారవంతమైన దక్కన్ పీఠభూమి ప్రాంతాల్లోకాని, వ్యవసాయం ప్రాముఖ్యత సంతరించుకుంది. అపుడు అడవీ ప్రాంతాలు కొండ ప్రాంతాలు ప్రధాన ఆర్థిక జీవన స్రవంతికి దూరంగా ఉండేవి. ఈ ప్రాంతాలు వ్యవసాయదారులకు అంతగా ఉపయోగపడలేదు. ఆ ప్రాంతాల ప్రజలు అక్కడి వనరులపై ఆధారపడి జీవనం సాగించేవారు. ఇప్పటికీ అనేక అటవీ కొండ ప్రాంతాలవారు అక్కడి పరిమిత వనరులపై ఆధారపడ్తున్నారు. అయితే పాశ్చాత్యదేశాల అడుగు జాడల్లో అదే పంథాలో మనం అభివృద్ధి సాధించాలని ప్రయత్నం చేస్తుండటం వల్ల పరిస్థితి కష్టమవుతోంది. పారిశ్రామిక రంగం మూల బిందువుగా రూపొందిన అభివృద్ధి నమూనా (డెవలప్‌మెంట్ మోడల్)ను మనం స్వీకరిస్తున్నాం. ఈ సరికొత్త ఆర్థిక అభివృద్ధికి మూల బిందువైన పరిశ్రమలకు కావలసిన వనరులు అటవీ, కొండ ప్రాంతాల్లో ఉన్నాయి. అంటే మన సరికొత్త ఆర్థికాభివృద్ధికి ఇక్కడి వనరులు అత్యవసరం.

ఇక్కడి సమావేశపు ప్రాంగణంలోని తలుపులు, కిటికీలు, కట్టడాలకు ఉపయోగించిన కలప పక్కనున్న అడవిలోనిది. ఇనుము, స్టెయిన్‌లెస్ స్టీల్ అలంకరణలు బైలదిల్లా గనుల్లోంచి ఉద్భవించినవే. విద్యుత్ కూడ బొగ్గుగనుల్లోనించో, సుదూర ప్రాంతంలోని జలవిద్యుత్ కేంద్రంనుంచి ఉత్పత్తి అయినదే. అంటే ఇవన్నీ గిరిజన ప్రాంతాల్లోని వనరుల ఉత్పాదకాలే. ప్రగతి బాటలో మనం పయనిస్తున్నామనుకుంటున్న ఈ తరుణంలో ఆర్థిక శాస్త్రవేత్తలు, ప్రణాళికా ప్రముఖులు అందరూ ఈ గిరిజన ప్రాంతాల వనరులను పూర్తిగా ఎలా వినియోగించాలో ఆలోచిస్తున్నారు. గిరిజన ప్రాంతాలవనరులను ప్రగతి కోసం, అభివృద్ధికోసం పూర్తిగా చేయాలని పథకం వేస్తుంటారు. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని, సరికొత్త సంస్థాగత నియనిబంధనలని (ఆర్గనైజేషనల్ మోడల్) ప్రవేశపెడ్తున్నారు.

**అడవి విలువ గిరిజనుడి దృష్టిలో**

అప్పుడేం జరుగుతుందో చూడండి. రాంచీ, ఛోటా నాగపూర్ ప్రాంతాలను గమనిస్తే అనేక వైరుధ్యాలు గోచరిస్తాయి. ధనబాద్, బైలదిల్లా, ఆంధ్రలోని సింగరేణి ఇక్కడ వేలాది కోట్ల రూపాయలను ఖర్చుచేస్తున్నారని చెప్తున్నారు. గతంలో ఇక్కడి వనరులు ఇప్పటి ఈ స్థాయిలో వినియోగింపబడలేదన్నది వాస్తవమైనా, ఈ వనరులు అక్కడి ప్రజలకు కనీసం ఉపాధి కల్పించ గలిగే స్థితిలో ఉండేవి. గిరిజనుల సమాజానికి ఈ వనరులు అయువుపట్టుగా ఉండేవి. ప్రస్తుతం మనం గుడ్డిగా అనుకరిస్తున్న అభివృద్ధి ప్రణాళికలు ఒక కొత్త పంథాను ప్రచారంలోకి తెస్తున్నాయి. గతంలో ఇక్కడి వనరులను గిరిజనులు సరిగా ఉపయోగించుకోలేదని, పైగా ఈ అడవీ, కొండ ప్రాంతాల వనరులను గిరిజనులు వృథా చేసుకున్నారని, వీటిని ఇపుడు సరిగ్గా, చక్కగా పూర్తిగా వినియోగించుకోవాల్సిన అవసరం ఉందని దబాయిస్తున్నారు. బస్తర్ ప్రాంతంలోని ఒక చిన్న పొలం చుట్టూ టేకు చెక్కతో కంచె విషయమై ఈ వాదనను పరిశీలిద్దాం. ఈ పొలం చుట్టూ ఉండే కంచెను ఢిల్లీ నగరంలో అమ్మితే 20 లక్షలు వస్తాయి. అయితే ఈ పొలంలో పండే పంట 200 రూపాయల విలువైనది మాత్రమే. 200 రూపాయల పంట రక్షణకోసం 20 లక్షల ఖరీదైన టేకు కంచె! అయితే ఈ పంటపైనే గిరిజనుడి కుటుంబం ఆధారపడి ఉంది. టేకు కంచెను ఆ కుటుంబం ఆహారంగా స్వీకరించలేదు. ఈ టేకు చెక్కను సులువుగా తనకు నచ్చిన విధంగా చెక్కుకు రావచ్చన్న విషయాన్ని మాత్రమే అక్కడి గిరిజనుడు గుర్తిస్తాడు. మన పట్టణవాసుల దృష్టిలో పనికి రాని మరి ఏ ఇతర కలపనైనా కంచెకు వాడాలంటే ఆ గిరిజనులు మరో పదిరోజుల పాటు శ్రమ పడాల్సి ఉంటుంది. టేకు కంచెను ఒక రోజులోనే ఏర్పాటు చేసుకోవచ్చు. అంటే తొమ్మిది రోజుల శ్రమ అతడికి మిగులుతుంది. స్థూలంగా ఇదీ టేకు పట్ల గిరిజనుడి ఆర్థిక దృష్టి. అంతేకాని 20 లక్షల టేకు సామానుగా అతడు ఆ కంచెను గుర్తించడు. అతని ప్రపంచంలో టేకు విలువ వేరు. ఇపుడు మీరో, నేనో ఆ గిరిజనుడి వద్దకు వెళ్ళి ఆ టేకు కంచెను అమ్మితే లభించే 20 లక్షలను బ్యాంక్‌లో వేస్తే నెలకు వేలాది రూపాయలు వడ్డీ వస్తుందని, అది ఆ చిన్న పొలంలో పండే పంటకన్నా ఎక్కువని చెప్తే అర్థంకాదు. ఈ బ్యాంక్ వడ్డీ, వ్యవహారాలు అతడి కొడుకు, మనవల తరానికి అర్థమవుతాయేమో కాని, అతడికి కావు. కానీ మనం ప్రస్తుతం ఇప్పటి తరం గిరిజనుడి గురించి చర్చించుకుంటున్నాం.

**అన్నం పెడుతున్న అడవి**

ఇంతకాలమూ గిరిజన కుటుంబాలకు అన్నం పెట్టిన వనరులకు, నూతన ఆర్థిక వ్యవస్థలో, విలువ విపరీతంగా పెరిపోతుంది. ప్రగతి పథకాలను అమలుపరచే తొందరలో మనం, గిరిజనుడు తన వనరులను సరిగా వినియోగించుకోలేదని విసుక్కుంటున్నాం. ఇన్నాళ్ళూ అతడు వనరులను దుబారా చేసాడని నిందిస్తున్నాం కూడ. ఇహ లాభం లేదు. కాలం మించి పోతోందని ప్రకటిస్తూ, అభివృద్ధి కోసం కొందర్ని పక్కకు

తప్పించేందుకు యత్నిస్తున్నారు. వక్కకు తప్పుకోవాల్సిన బాధ్యత గిరిజనులపై వడవేసి, అతడిని 'అక్కరకు రాని చుట్టము.....' గా చూస్తున్నాం. ప్రస్తుతం గిరిజనులు అన్‌వాంటెడ్ పర్సన్స్. అడవితల్లి బిడ్డలందరూ, అడవుల్లో నివసించ గూడని జీవాలయ్యారు. అంతే కాదు. గిరిజను డిపై మరో వైపు నుంచి దాడి జరుగు తోంది.

జాతీయస్థాయిలో మనమొక రాజ్యాంగ వ్యవస్థను ఏర్పాటు చేసు కున్నాం. ఈ ప్రభుత్వం కొన్ని చట్టాలు వగైరా రూపొందించుకుంది. అయితే ఈ ఆధునిక చట్టాలు, రాజ్యంగ శాసనాలు రాకముందు నుంచే గిరిజన సమాజం అధికార వికేంద్రీకరణ, స్థానిక స్వపం పాలనల ఆధారంగా మనుగడ సాగిం చింది. ఈ విషయం చెప్తున్నందున నన్ను ఆదిమ జాతి జీవన విధానాన్ని సమర్థకుడుగా భావించకండి. గిరిజను డి జీవించే హక్కుపై జరుగుతున్న దాడి స్వరూప స్వభావాలను విశ్లేషించు కునేం దుకు అవసరమైన చారిత్రక భూమికను ఇస్తున్నానంతే. ఈ గిరిజన సమాజానికి తన ప్రాంతంలోని వనరు లపై ఆధిపత్యం ఉండేది. ఈ గిరిజన సమూహాలు తమ వ్యవహారాలను తమ శైలిలో చక్కబెట్టుకునేవారు.



అడవి తల్లికి దూరమై బతుకు భారమై

గిరిజనులు ఒక ప్రత్యేక పద్ధతిలో సామాజిక జీవనాన్ని రూపొందించుకుని జీవిస్తుండగా, ఈ ఆధునిక 'రాజ్యం' రంగప్రవేశం చేసింది. ఆధునిక శాసనాలు, ప్రభుత్వాలు రాజ్యాంగ నిబం ధనలు గిరిజనులను నేరస్థులుగా ముద్రవేయడం ఆరంభించాయి.

## అడవి ప్రభుత్వ ఆస్థి

భారత అటవీ ప్రాంత చట్టాలను తయారు చేసి వాటిని అమలు పరచడంతో అడవులన్నీ ప్రభుత్వ ఆస్తులుగా మారిపోయాయి. అడవి తల్లి బిడ్డల క్కాడ అక్రమణదారుగా మారి పోయాడు. ఆధునిక రెవెన్యూ శాఖలు కొత్త లా అండ్ రికార్డ్ సిస్టమ్‌ను ప్రవేశ పెట్టాయి. పటేల్ పట్వారీ, కరణం మునసబులు ఎవరిపేరైతే నమోదు చేస్తారో వారు ఆ భూమికి యాజమానిగా అయ్యారు. అమాయక గిరిజనుడు తన పేరును పట్టాదారుగా నమోదు చేయిం చుకోనంత మాత్రాన్నే ఆ భూమి అతనిది కాకుండా పోయింది. తరతరాలుగా జాతరకు అడవిలోని నీరు తాగుతున్న గిరిజనుడు ఈ రోజున ప్రభుత్వంవారి సారా తాగకుండా ఇతర సాంప్రదాయిక ద్రవాన్ని సేవిస్తే గుజరాత్, మహారాష్ట్ర చట్టాలు అతన్ని నేరస్తుడుగా ప్రకటించి శిక్షార్హుడిని చేస్తున్నాయి. ఝూడులే ప్రాంతంలో హెూలీ కాలంలో గిరిజన యువకులు అచరించాల్సిన ఆచారం ఒకటుంది. తన తెగలోని యువతిని తనతో అడవిలోకి తీసుకు వెళ్ళాలి. మూడురోజులపాటు ఆ యువతితో అడవిలో గడపాలి. ఆ తర్వాత మాత్రమే అతనికి పెళ్ళి చేసుకునే హక్కు లభిస్తుంది. ఆధునిక చట్టాల ప్రకారం అతడు ఒక అమ్మాయిని తన వెంట తీసుకెళ్ళి మాయమైపోయినందున శిక్షార్హుడు. ఆడపిల్లను ఇంటి నుంచి తీసుకు వెళ్ళినందుకు అతనిపై పోలీసు స్టేషన్‌లో కేసు నమోదు చేయవచ్చు. మైదాన ప్రాంతాలవారు ఆమోదించిన నియమ నిబంధనలను గిరిజనుడికి వర్తింప చేయబూనటంతో ఏర్పడ్డ చిక్కులివి. చదువూ సంధ్యలేని ఆ గిరిజనుడి వేలిముద్ర ఆధారంగా హఠాత్తుగా అధికారులు గిరిజన గూడెంలో ప్రత్యక్షమవుతారు. 'ఫలానా కోఆపరేటివ్ (సహకార సంఘం) రుణం బకాయిలు పడ్డావ'ని దబా యిస్తారు. కోఆపరేటివ్ సొసైటీ, రుణం వగైరా వివరాలు తెలియని గిరిజనుడు బిక్క మొహం వేస్తాడు. కానీ, అతడికి వ్యతిరేకంగా తిరుగులేని సాక్ష్యం ఉన్నది. ,ఎడ్లు ఎరువులు సంగతి తెలీదని అతను నమ్మింప చూసినా, అధికార పత్రాలు అతని వాదనను కొట్టి పారేస్తాయి. ఆధునిక రాజ్యాంగ శాసన వ్యవస్థ గిరిజనుడి జీవనంతో చెలగాట మాడుతోంది.

## అడవి నుంచి తరుముతున్నారు

ఒక రాష్ట్రంలో 15,000 మంది గిరిజనులు 120 గూడేల్లోంచి పారిపోయారు. మూడు రోజుల్లో ఇది జరిగింది. రెండేళ్ళ కిందట జరిగిన ఈ ఘటన దిన పత్రికల్లో ప్రముఖంగా వచ్చిందో లేదో నాకు తెలియదు. ఈ పదిహేను వేలమంది గిరిజనులు స్వచ్ఛందంగా తమ పల్లెను వీడి వెళ్లా రని, వారిని పారదోలేందుకు వత్తిడి తేలే దని కొందరు నాతో అప్పట్లో అన్నారు. ఆధునిక రాజ్యాంగ వ్యవస్థ దుర్మార్గాన్ని మనం గుర్తించాలి. మూడు రోజుల్లో 15 వేలమంది వలస వెళ్ళిపోయారు! పోలీసుల కాల్పులలో పదిమంది దుర్మరణం, ఇవేవీ జరగలేదు. కేవలం

'చట్టం' సృష్టించిన భయానక వాతావరణ మహత్యం అది. ఆ ప్రాంతంలో చట్టబద్ధంగా పనిచేసిన సంస్థలు సృష్టించిన టెర్రర్ ఫలితమే 15 వేలమంది వలస. ఇది సిగ్గు పడాల్సిన విషయం. కలెక్టర్‌నే, పోలీసులనే తప్పుబట్టాల్సిన అవసరం లేదు. గిరిజనులందరినీ కట్టగట్టి మనం వారిని నేరస్థులనే ముద్ర వేసాం, అది కూడ చట్టబద్ధంగా! వనరులపై తన సామాజిక జీవన వ్యవస్థపై గిరిజనుడు పట్టు కోల్పోయాడు.

గిరిజన ప్రాంతాల్లోని వనరుల ఆధారంగా మాత్రమే మన వ్యవస్థ ఆర్థికంగా ముందుకెళ్ళాల్సిన అవసరాన్ని సృష్టించుకున్నా మనం, గిరిజనుడి వనరులను లాగి వేసుకునేందుకు చట్టాలని రూపొందించాం. ఇదెలా జరుగుతోంది? దీనికి మూలం ఏమిటి? ప్రగతి కోసం, ఆర్థిక అభివృద్ధి కోసం అంటే మన ప్రభుత్వాలు గిరిజనుడి ఆస్తిని, భూములను సొంతం చేసుకుంటున్నాయి. ఆనకట్టల పేరిట, సరికొత్త పరిశ్రమలు, గనుల పేరిట గిరిజనుడిని నిర్వాసితులను చేస్తున్నారు. ఇప్పటివరకు సుమారు 15 శాతం గిరిజనులు నిర్వాసితులయ్యారు. పూర్తి ఆర్థిక అభివృద్ధి సాధించే దిశలో మనం ఇంకా మొదటి దశలోనే ఉన్నాం. ఏడు పంచవర్ష ప్రణాళికలు మాత్రమే పూర్తయ్యాయి. ప్రతి పంచవర్ష ప్రణాళిక అభివృద్ధి పేరిట కొన్ని లక్షల మంది గిరిజనులపై దాడి చేస్తున్నది. ఎనిమిదవ ప్రణాళికలో 80 వేల కోట్ల విద్యుత్ ఉత్పాదన శాతం కేటాయించారు. సింగ్రౌలి ప్రాంత గిరిజనులు గత 30 ఏళ్ళుగా నాలుగుసార్లు నిర్వాసితులయ్యారు. మొదటిసారి వారి గూడెం నుంచి వెళ్ళగొట్టినపుడు ఎకరాకు ౮౦ రూపాయలు ఇచ్చారు. ఇప్పటికి అదే గిరిజనుడిని మరో మూడు సార్లు మరో కొత్త చోటికి తరిమివేశారు. ఇందాక మనం అక్కడన్నట్లు ఇది మొదలు మాత్రమే. జాతీయ తలసరి ఆదాయం పారిశ్రామిక ప్రగతి ఇవన్నీ ఇబ్బడి ముబ్బడిగా పెరగాలని ఆశిస్తున్నాం. మనం ఆశిస్తున్న ప్రగతిని గణాంక వివరాలకు కుదిస్తే, ఆ గణాంక వివరాల ప్రభావాన్ని అదే నిష్పత్తిలో గిరిజన ప్రాంతంలో గమనించవచ్చు.

బస్తర్‌లో కలెక్టర్‌గా పనిచేసిన రోజుల్లో నా అనుభవాన్ని వివరిస్తున్నాను. ప్రవీణ్‌చంద్ అనే గిరిజన పెద్ద పోలీసు కాల్పుల్లో మరణించిన తర్వాత నన్ను ఒక కమిటీలో నియమించారు. ఆ కమిటీలో ఉన్నన్నాళ్ళూ ప్రవీణ్ మాటలు గుర్తు వచ్చేవి. ప్రగతి, ఆర్థిక అభివృద్ధి గురించి నేను అతనికి చెప్పినపుడల్లా అతను ఇలా అంటుండేవాడు "శర్మగారూ మీరు మంచి కలక్టర్ కాబట్టి గౌరవిస్తాము. కానీ నాకదొక అవమానం. ఒక జిల్లాలో 12 లక్షల రూపాయల సహకార రుణాలు పంపిణీ అయితే పదివేల మంది గిరిజనులు తమ భూములు కోల్పోయారు. ఒక కోటి రూపాయలను వీరు సహకార రుణాలుగా అందిస్తే ఎన్ని లక్షల మంది గిరిజనులు నిర్వాసితులవుతారో చెప్పగలరా". ప్రగతి పేరుతో జరిగే తమాషాను ఆ గిరిజనుడు తన పరిధిలో విశ్లేషించిన విధానం అది. అతను మరో ప్రశ్న వేస్తు ఉండేవాడు. "మా వ్యవసాయానికి పెద్దగా పనికి రాని మెట్ట భూములనే గిరిజనుడు కాపాడు కోలేకపోతున్నాడు. ఈ మెట్టకు మీరు నీరందిస్తే ఉద్భవించే మాగాణి భూములను తమ కబ్జాలో ఎలా ఉంచుకోగలరు?" ఇవి నిజమైన మౌలిక ప్రశ్నలు. కొరాపుట్ ప్రాంతంలోని భూముల విషయమై అతను భయపడినంతా నిజమైంది. అక్కడికి ప్రాజెక్టుల జలాలు చేరగానే అక్కడి ప్రజల నుంచి భూములు చేజారి పోయాయి. మనం ఆర్థికంగా ముందడుగు వేస్తున్న కొద్దీ, అక్కడి గిరిజనులకు నీడ లేకుండా అవు తున్నది. స్థానిక వనరులపై గిరిజనుడి హక్కుకు గుర్తింపు లేకుండా పోయింది.

## భూమిని ఆస్తి చేశారు

భారత దేశంలోని సామాన్యులపై బ్రిటిషువారు సాగించిన దుర్మార్గం ఏమిటంటే, భూమిని కేవలం ఆస్తిగా పరిగణించడం. బ్రిటిషు వారు వచ్చి జీవనోపాధి కలిగించే సాధనంగా ఉన్న భూమికి ఒక స్థిరాస్తి స్వరూపం కల్పించారు. ఈ మౌలిక మార్పులో భాగంగా జమీందారీలు, జగీర్దారీలు వచ్చాయి. జీవనోపాధి కోసం కష్టించే రైతును పట్టించుకున్న వాడు లేడు. అతడిని అందరూ మరిచిపోయారు. గిరిజనులు భూమిని ఒక స్థిరాస్తిగా పరిగణించారు. బీహారులోని గిరిజనులు గాంధీగారి సత్యాగ్రహం సమయంలో ఇలా వాదించేవారు. "భూమిని దేవుడిచ్చాడు. మేము దేవుని పిల్లలం. దైవదత్తమైన భూమి వల్ల మాకు కడుపు నిండుతోంది. మధ్యలో ఈ సర్కారు వాడు వచ్చి పన్ను కట్టమంటాడేమిటి?". శిస్తు కట్టడం మానేసారు వాళ్ళు. గడ్చిరోలి గిరిజన మహిళలు తమ తెలివితేటల ద్వారా మౌలిక ప్రశ్నలు వేస్తుంటారు. "అడవి మాకు తల్లి. తల్లి పాలు తాగుతున్న మమ్ము ఆ చల్లని ఒడి నుంచి వేరు చేస్తారేమిటి?"

బ్రిటిషువాడు చేసిన దుర్మార్గ ఫలితం ఇది. అడవికి, భూమికి ఆస్తి స్వరూప స్వభావాలు సృష్టించాడు. స్వాతంత్ర్యం తర్వాత భూమిని ఒక ఆస్తిగా పరిగణించే విషయమై మార్పు రాలేదు. దున్నేవాడిది భూమి అని, దానిపై ఆధారపడి జీవనం సాగించే వాడికే భూమి ఇస్తామని వాగ్దానం చేసిన నేతలు స్వాతంత్ర్యం తర్వాత బ్రిటిషు వారి బాటలోనే నడిచారు. భూమిని ఆస్తిగా గుర్తిస్తూ రాజ్యాంగం రచించారు. భూమి ఒక జీవననా ఆధారంగా గుర్తించలేదు.

రాజ్యాంగంలో ఆర్థిక అసమానతలను తగ్గించాలని రాసుకున్నారు. ఉత్పాదకాంశాలు కొందరి చేతుల్లో సమీకృతం కాకుండా చూడాలని ప్రకటించాడన్నాం. ఇవన్నీ రాజ్యాంగంలో రాసుకున్నాం. పౌరులు జీవించే హక్కు, గౌరవ ప్రదంగా జీవించేందుకు అవసరమయ్యే జీవనోపాధి హక్కు వగైరాలను 21వ అధికరణంలో పొందుపరచుకున్నాడు. 31వ అధికరణం దున్నేవాడిదే భూమి అంటుంది. ఇప్పటివరకు తయారైన చట్టాలు ఈ దిశలో ఫలితాలు సాధించాయా? ఆస్తిపాస్తులను, జీవనోపాధిని కల్పించే వనరులను ఒకే రాటకు కట్టి వేయరాదన్న మౌలిక

అంశం క్రమేణా మరుగున పడింది. గిరిజన ప్రాంతాల వ్యవహారాన్ని పరిశీలిస్తే అడవి ఆస్తి కాదని భావిస్తే చెంచులను, కోయలను అడవి నుంచి తరిమేయలేరు. జీవనోపాధిని ఇచ్చే అంశంగా అడవిని గుర్తించనంతవరకు ఇది జరుగుతూనే ఉంటుంది. పనిచేసే హక్కు గురించి ప్రస్తుతం బ్రహ్మాండమైన చర్చ జరుగుతోంది. గిరిజనుల జీవనోపాధి కల్పించే వనరులను వారి నుంచి లాగివేసుకుంటున్న విషయమై చర్చ వినపడదేం. జీవనోపాధి కల్పించక పోగా, అతడి జీవనానికి అనువైన భూమిని ఎలా తస్కరిస్తున్నాం? పనిచేసే హక్కు పేరిట ఉద్యోగాలు సృష్టిస్తూ, దొరకని వాడికి పాకెట్ మనీ ఇస్తూ, గిరిజనుడిని నిర్వాసితుడిని చేస్తున్నాం. ఏడాదిలో 240 రోజులు పనిచేసిన వ్యక్తికి పర్మనెంటు ఉద్యోగం ఇవ్వాలని కోర్టులు తీర్పులు ఇచ్చాయి. 240 తరాల తరబడి అడవిలో జీవిస్తున్న గిరిజనుడి నుంచి పర్మనెంటుగా భూమిని లాగి వేసుకుంటున్నాం. ఈ వైరుధ్యం గమనించండి. దీనికంతటకీ మూలం అడవినీ, భూమినీ కేవలం 'ఆస్తి'గా పరిగణించడం. బ్రిటిషువారి ఈ సిద్ధాంతాన్ని మన కొత్త పాలకులు స్వీకరించారు. జమీందారీ విధానాన్ని రద్దు చేసిన పాలకులు, అడవులపై సర్కారీ జమీందారీని ఎందుకు రద్దు చేయలేదు? బస్తర్‌లో అడవి దేవతకు పూజలు చేద్దామని బయలుదేరిన గిరిజనులను జమీందారులు తరిమి వేసారని రికార్డుల్లో రాసి ఉంది. ప్రస్తుతం పరిస్థితిలో మార్పు లేదు. ఎందుకంటే అడవి నుంచి గిరిజనులను వేరు చేయడంతో పాలక వర్గాలన్నీ లబ్ది పొందాయి. రాజకీయవాది, పైరవీకారు, కాంట్రాక్టరు, ఉద్యోగులు అందరికీ లాభమే.

### భూసేకరణ చట్టం

భూసేకరణ చట్టం పేరిట గిరిజనుడు ఇతర మారు మూల ప్రాంతాల్లోని పేదవారు నిర్వాసితులవుతున్నారు. ఈ చట్టం భూమిని ఆస్తిగా పరిగణిస్తే ఉత్పన్నమైన చట్టం భూమిని కేవలం ఆస్తిగా పరిగణించరాదని రాజ్యాంగసూత్రాలు నర్మగర్భంగా చెప్పుండగా ఈ భూసేకరణ చట్టం రాజ్యాంగ వ్యతిరేకమైనది. ఈ భూసేకరణ చట్టం నష్టపరిహారాన్ని ఇస్తుంటుంది. బస్తర్‌లోని గిరిజనులు నన్ను నిలదీసి అడిగారు. "భూమితల్లిని గుంజుతున్నారు మీరు. మీరు ఇచ్చిన నోట్ల కట్లను మేం ఏం చేసుకోవాలి?" అతని పరిధిలో లారీడు నోట్లకట్టల వల్ల ప్రయోజనం లేదు. అన్నం పెట్టే భూమి చుట్టూ అతడి జీవితం తిరుగుతుంది. మైదాన ప్రాంతాల వారి విలువలు, సాంస్కృతిని, జీవన విధానాన్ని అతడిపై బలవంతంగా రుద్దుతుంటాం.



అడవి తల్లి అనాథ బిడ్డలు

భూ సంస్కరణ చట్టం క్రింద ప్రభుత్వం స్వాధీనం చేసుకునే అదనపు భూములకు నష్టపరిహారంగా ఇవ్వాల్సిన అవసరం లేదని రాజ్యాంగ నిర్మాతలు భావించారు. కానీ వారికి స్పష్టమైన ఆలోచనా విధానం లేక భూమిని ఇతరత్రా స్వాధీనం చేసుకుంటే నష్టపరిహారాన్ని ఇవ్వ వచ్చునన్నారు. ఆస్తికి మార్కెట్ ధరలుంటాయి కానీ, జీవనోపాధికి మార్కెట్ విలువ ఉండదన్న మౌలిక అంశాన్ని వారు విస్మరించారు. భూమిని ఆస్తిగా మాత్రమే పరిగణించే భూసేకరణ చట్టం రాజ్యాంగ విరుద్ధం.

### గిరిజనుడి జీవించే హక్కు

గిరిజనుడి జీవించే హక్కును క్రమంగా హరిస్తున్నారు. గిరిజనుడి ప్రపంచం, అతని జీవనశైలి వేరుగా ఉంటాయని సామాజిక స్పృహ కలిగిన వారంతా గుర్తించి తీరాలి. కొరాపుట్ గిరిజనుడు ఇలా అంటాడు. "నాడు అన్నంపెట్టే దేవతలు ముగ్గురు. నదీమ తల్లి ఇంద్రావతి, అడవి, భూమి. నాలుగు నెలలకు ఒకరు చొప్పున నీడ తిండి పెట్టారు". ఆనకట్టల వల్ల అడవులు మునిగిపోతే గిరిజనుడికి నష్టపరిహారం ఇవ్వరు. ఎందుకంటే అడవి సర్కారు ఆస్తి కనుక, అడవిని గిరిజనుడి జీవనోపాధి కల్పించేదిగా గుర్తించిన నాడు సర్కారీ 'ఆస్తి' సిద్ధాంతానికి విరుగుడు తెలుస్తుంది. గిరిజన ప్రాంతాల్లో చట్టాలన్నీ గిరిజనుడిని ఒక వ్యక్తిగా గుర్తిస్తున్నాయి. వంద కుటుంబాల్లోని వేయి మందిని-విడివిడిగా గుర్తుంచి నష్టపరిహారాలిస్తాయి. కానీ ఆ వంద కుటుంబాలను ఒక సమిష్టి క్షేత్రంగా (యూనిట్‌గా) గుర్తించడంలేదు. కుటుంబాన్ని కూడ ఒక యూనిట్‌గా గుర్తించేందుకు నేను అంగీకరించాను. వ్యక్తిని, కుటుంబాన్ని యూనిట్‌గా గుర్తించడం మనకి చెల్లుతుంది. కానీ ఒక గ్రామాన్ని, గిరిజన సమాజాన్ని యూనిట్‌గా గుర్తించాలి. అపుడు ఆ యునిట్స్‌కు నష్టపరిహారం (వివిధ సాంస్కృతీ, సామాజిక నష్టాలకు) ఎవరిస్తారు. ఇక్కడున్న గిరిజన కుర్రాళ్లకు తెలుసీ విషయం. తన సమూహంలో నుంచి బయటకు వస్తే అతడు అనుభవించే మానసిక వ్యధను గుర్తించేదెవరు. దానికి నష్టపరిహారం ఇప్పించేదెవరు?

ఇపుడు ఈ విషయాలను

దృష్టిలో ఉంచుకునే కొత్త అభివృద్ధి పథకాల రచన కావాలి. అభివృద్ధి, సామాజిక ప్రశాంతతను ఎప్పటి కప్పుడు బేరీజు వేసుకునే ప్రణాళిక వ్యూహాలు కావాలి. గిరిజనుడి జీవనశైలి, అతడి జీవనోపాధిని గమ నించి వాటికి గౌరవమిచ్చే పరిస్థితి ఏర్పడాలి. అతడి వనరులను మనం లాగివేసుకుంటున్నాం. అతడు ఎలా జీవించాలి, అతడి సంస్కృతి ఎలా వరిఢవిల్లాల్లో మనం నిర్ణయిం చేస్తున్నాం. ఈ స్థితిలో గిరిజనుడికి దిక్కు తోచడం లేదు. చట్టంపేర, అభివృద్ధి పేర అతడిని ఎక్కడికో తరిమి వేస్తున్నాం. ఇక పై రూపొందించే ప్రతి ప్రగతి అభివృద్ధి పథకంలోనూ గిరిజనుడికి గౌరవ ప్రదమైన భాగస్వామ్యం కల్పించాలి. భూసేకరణ చట్టం ప్రజా ఉపయోగం( పబ్లిక్ పర్పస్) అని ఒక పదం వాడుతుంది. 40 ఏళ్ళ స్వతంత్రం తర్వాత ప్రజోపయోగం అంటే ఏమిటో చర్చించుకోవాల్సిన అవసరం లేదు? ఒక మంత్రి, ఒక లక్షాధికారి, ఒక పెట్టుబడిదారుకు నచ్చితే అది పజా ఉపయోగం అవుతుందా. ఈ ప్రజల అవసరం సాకుతో గిరిజనులను నిర్వాసితులను చేయడం అన్యాయం. గుజరాత్‌లో టూరిస్ట్ కేంద్రాన్ని అభివృద్ధి చేసేందుకు మూడు గ్రామాల గిరిజనులను వెళ్ళగొట్టారు. పబ్లిక్ పర్పస్ కోసం! ఫైవ్‌స్టార్ హోటల్ నిర్మాణం ప్రజల అవసరం. ఇదేం నాగరికత. ఒక వర్గాన్ని అనాథలుగా తయారు చేసే అభివృద్ధి ఎందుకన్న ప్రశ్న ఇపుడు అందరం వేసుకోవాలి. ఫైవ్‌స్టార్ హోటల్‌వంటి ఆడంబరా లకు అవసరమయ్యే విద్యుత్ కోసం వందలాది గిరిజనులను అడవి నుంచి తరిమి వేయడం ఎందుకు? పేదవారి కష్టాలను తొలగించేందుకు మరొక పేద వర్గంతో చర్చలు జరిపి ఒక పరిష్కారం గురించి మాట్లాడవచ్చు. కానీ ఒక వర్గంలోని ఆడంబరాల కోసం ఆ దారిలోని పేదవారిని బలిచేస్తానంటే ఒప్పుకొనరాదు.

"విద్యుత్ శక్తి వద్దంటావా" అని నాలాటివారిని ఎద్దేవా చేస్తుంటారు కొందరు. ఎయిర్ కండిషనర్లు, నియాన్ బల్బుల ఆడంబరత్వం వీటిని అపండి. ఆ తర్వాత మాట్లడండి. ఇపుడు తయారవుతున్న విద్యుత్‌లో కొంత భాగం ఆడంబరాల కోసం వృథా అవుతోంది. పబ్లిక్ పర్పస్ పేరిట మనల్ని కొందరు స్వార్థపరులు మోసం చేస్తున్నారు.

భూసేకరణ చట్టం, రాజ్యాంగం పేరిట ప్రజలని మోసం చేస్తున్నాం. ఒక ప్రాజెక్టు కోసం పథకం పూర్తవుతుంది. నిధులు వస్తుంటాయి. పనులు ప్రారంభమవుతాయి. అపుడు చట్టం పేరిట ఒక ప్రకటన చేసి మీకు అభ్యంతరాలు ఉన్నాయా అని ప్రశ్నలు వేస్తాం ఇంకో రెండేళ్ళలో ఆ గిరిజనుడి ఇల్లు, భూమి ముంపునకు గురవుతాయి. అది తెలిసి 'అభ్యంతర మున్నదా' అనే చెత్త ప్రశ్న వేస్తాం. ఇది మోసం కాదా! అభివృద్ధి పథకాల రచన, అమలు రాజ్యాంగ వ్యతిరేకం, ప్రజలకు వ్యతిరేకం. చిట్టచివరిగా చెప్పాలను కున్న విషయం ఒకటుంది.

## గిరిజనుడూ – రాజ్యాంగమూ

రాజ్యంగ నిర్మాతలు ఒక విషయం గుర్తించారు. చట్టాలు, ప్రాథమిక హక్కులు, వగైరాలు గిరిజను డిని రక్షించ లేవని గ్రహించారు. అందుకనే అయిదవ షెడ్యూలును రాజ్యాంగంలో పొందుపరచి గవర్నరుకు అపరిమిత అధికారాలను అందించారు. గిరిజనుడి ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఏం జరిగినా గవర్నరు అడ్డుకొని గిరిజనులను రక్షించవచ్చు. అందుకనే రాజ్యాంగంలోనే మరొక రాజ్యాంగంగా రూపొందించిన అయిదవ షెడ్యూలు అని కొందరు చమత్కరిస్తుంటారు కూడ. ప్రజల జీవితాలను కబళించే ఏ చర్యనైనా, చట్టానైనా అడ్డుకుని ప్రజలను పాలించే అధికారం గవర్నర్లకు కట్టబెట్టారు. గిరిజనుడి హక్కులపై జరిగే ప్రతిదాడి చట్టబద్ధంగా జరుగు తున్నదే. చట్ట బద్ధమైన ఈ దాడిని అరికట్టేందుకు గవర్నర్‌కు సర్వాధి కారాలు ఉన్నాయి. పార్లమెంటు, లేక రాష్ట్రపతి ఆమోదం కూడ అవసరం లేదు. రాజ్యాంగం పేరు చెప్పి గిరి జనులపై నేరస్తుల ముద్ర వేస్తున్నాం. మరో పక్క రాజ్యాంగం గిరిజనుడికి అండగా నిలిచేందుకు గవర్నర్‌కు అధికారం కల్పిస్తున్నది. ఎంత వైరుధ్యం. ఈ వైరుధ్యాల మధ్య గిరిజనుడి జీవించే హక్కును హరిస్తున్నారు.

గిరిజనుడు అనేక బాధలు పడుతున్నాడు. అతడికి ఉపశమనం కలగడానికి ప్రధాన కారణం గవర్నర్లు నిద్రపోవడమేనట. గవర్నరు తన అధి కారాన్ని సరిగా ఉపయోగించుకోనం దున గిరిజనుడి కష్టాలకు అంతు లేదన్న మాట. పేరు చెప్పను. కానీ సంఘటన ఉదహరిస్తాను. ఒకానొక రాష్ట్రంలో 1951లో కొంతమంది గిరిజనులను ఇండియన్ ఫారెస్ట్ అక్ట్ కింద శిక్షించారు. వారు హైకోర్టు కెళ్ళారు. ఈ గిరిజనులు నివసించే ప్రాంతాన్ని రిజర్వుడుగా ప్రకటించినట్లు చట్టం ఏదని హైకోర్టు ప్రశ్నించింది. 1951 నుంచి 1990 దాకా ఇదే కథ. లాయర్‌ను పెట్టుకుని కేసును నడుపుకున్న గిరిజనుడికి శిక్ష లేదు. లాయర్ లేని గిరిజనుడు జైలు పాలయ్యాడు. ఒక అధికారి గతంలో ఒకసారి అన్నాడు. "స్థానిక భాషలో చట్టాలను ప్రచురించాలన్న నిబంధనను తీసివేసాం. ఈ స్థానిక భాష ప్రచురణ వల్ల ఎదురయ్యే ఇబ్బందులిక ఉండవు". మన ప్రభుత్వం తంతు ఇదీ. గిరిజనుడికి జీవనాధారమైన అడవిని సర్కారు తన సొంత ఆస్తి అని ప్రకటించుకోవడంతో ఈ పరిస్థితి ఏర్పడింది. ఈ సమస్యకు పరిష్కారం ఒక్కటే. అభివృద్ధి పథకాలన్నిటిలో పేదవారికి, గిరిజను డికి భాగస్వామ్యం కల్పించాలి. ప్రస్తు తం మనం అనుసరిస్తున్న ప్రగతి ప్రణాళికలు, సామాజిక ప్రయోజ నాలకు, వాతావరణానికి వ్యతిరేక మైనవి. అందరం కలిసి కట్టుగా ఈ విషయమై ఉద్యమించాల్సిన తరుణం ఆసన్నమైంది. అపుడు మాత్రమే పేదలకు ముఖ్యంగా గిరిజనులకు జరిగేలా న్యాయన్ని సరిదిద్దుదాం.

బి.డి. శర్మ
ఎస్.సి; ఎస్.టి. కమీషనర్
భారత ప్రభుత్వం, న్యూ ఢిల్లీ.

# వెనుకబాటు తనం వేర్పాటు ఉద్యమం

'దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్'

అన్నారు గురజాడ అప్పారావు. మట్టీ కాదు, మనుషులూ కాదు దేశమంటే లెక్కలోయ్ అంటుంటారు ప్రణాళికా రచయితలు. దేశం వ్యావసాయికంగా, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిందంటూ గణాంక వివరాలు వెదజల్లుతుంటారు. దేశాన్ని ప్రగతి పథంలో నడిపించటానికని భారత ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలు అమలు జరుపుతున్నది. ఇప్పటికి ఏడు పంచవర్ష ప్రణాళికలు ముగిశాయి. ఎనిమిదో పంచవర్ష ప్రణాళిక ప్రారంభమవుతోంది. ప్రతి ప్రణాళికలోనూ కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తుంటారు. ఎలాంటి పథకాన్ని చేపట్టినా ప్రజల జీవన పరిస్థితులు, మెరుగుపడాలన్న ప్రధాన లక్ష్యాన్ని వదిలివేస్తుంటారు మన ప్రణాళికా సంఘం పెద్దలు. వెనుకబడిన ప్రాంతాల్ని కొల్లగొట్టడం ద్వారా ఇతర ప్రాంతాలు అభివృద్ధి చెందడం మినహా మరేమి జరగలేదు. 40 ఏళ్ళ స్వాతంత్ర్య కాలంలో కొన్ని ప్రాంతాల ప్రజలు ఎలాంటి అభివృద్ధికి నోచుకోక, దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. సాంప్రదాయికంగా ఉన్న ఉపాధిని సైతం కోల్పోతున్నారు. కరువు కాటకాలవాత బడుతున్నారు. ఆకలి చావులకు గురవుతున్నారు. దేశ రాజధాని ఢిల్లీ వీధుల్లో, పంజాబులో మతం మారణహోమం. ఈశాన్య భారతం సరిహద్దు వెంట సైనిక పహరా. సతీ సహగమనాన్ని పునరుద్ధరించటానికి జరుగుతున్న ప్రయత్నాలు, దాన్ని అడ్డుకుంటున్న శక్తులు. మత్స్యకారులు, గిరిజనులు, వ్యవసాయకూలీలు "అభివృద్ధి పథకాలు" తమకు ఉపాధి లేకుండా చేశాయని నిరసన. ఇది నేటి దేశ పరిస్థితి. ఇండియా ప్రగతి పోలీసుల దౌర్జన్యం లోనే కనిపిస్తున్నది.

వెనుకబడ్డ ప్రాంతాల్ని, జాతుల్ని కొల్లగొట్టి ఇతర ప్రాంతాలను అభివృద్ధి చేయడం అనేది వలసవాద ఆర్థికనీతి, ఈ ఆర్థికనీతి వల్లే కొన్ని దేశాలు సుసంపన్నం కాగా, పలు దేశాలు దివాళాతీశాయి.

బ్రిటిష్ వలస వాదాన్ని భౌతికంగా వదిలించుకోగలిగినా, భావాల రీత్యా ఇప్పటికీ బ్రిటిష్‌వారి అడుగుజాడల్లో నడుస్తున్నది భారత ప్రభుత్వం. ఫలితంగా స్వాతంత్ర్యా నంతరం ప్రాంతీయ అసమానతల నేపథ్యంలో ఉద్యమాలు ఉవ్వెత్తున లేస్తున్నాయి. ఇవి ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక సమస్యలపై చెలరేగుతున్న ఉద్యమాలు, అంతిమంగా ఇవి వేర్పాటు వాదానికి దారి తీస్తున్నాయి.

1947లో 15 రాష్ట్రాలతో, ఒక కేంద్రపాలిత ప్రాంతంతో రూపొందిన భారతదేశ పటంలో, నేటికి మరో 9 రాష్ట్రాలు, 6 కేంద్ర పాలిత ప్రాంతాలు వచ్చి చేరాయి. భౌగోళికంగా ఏవో కొన్ని హద్దులు నిర్ణయించి, అక్కడి ప్రజలంతా ఒక జాతి అంటే కలిసి ఉండడం అసాధ్యం అనడానికి ఆయా ప్రాంతాల్లో చెలరేగుతున్న ఆందోళనలే సాక్ష్యం. ప్రాంతీయ అసమానతలపై దేశంలో ఎప్పుడూ ఏదో మూల ప్రజలు ఆందోళన సాగిస్తూనే ఉన్నారు. గుజరాత్ రాష్ట్రంలో సౌరాష్ట్ర, ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలు, మహారాష్ట్రలో కొంకణ్, మరట్వాడా, విదర్భ, మధ్యప్రదేశ్, బీహార్, ఒరిస్సా, బెంగాల్ రాష్ట్రాల్లోని గిరిజన ప్రాంతం జార్ఖండ్, కాశ్మీర్ లోయలో, ఈశాన్య భారతంలో ఆందోళనలు రావణ కాష్ఠంలా రగులుతూనే ఉన్నాయి. వెనుకబడిన ప్రాంతాలలోని ఈ ఉద్యమాల్లో రెండు ధోరణులు కన్పిస్తాయి. ఒకటి ఆర్థిక వాద ధోరణి, రెండు జాతీయవాద ధోరణి.

## భాషాసూత్రం ఒక్కటే కలిపి ఉంచలేదు

పెద్ద రాష్ట్రాలలో ఆధిపత్యం గల ప్రాంతాలు వెనుకబడ్డ ప్రాంతాల్ని దోపిడీ చేస్తున్నాయనే కారణంతో ఆందోళనలు బలపడుతున్నాయి.

స్వాతంత్ర్యానంతరం, భాషా ప్రాతిపదికన రాష్ట్రాల పునర్విభజన జరిగింది. ఒకే భాష మాట్లాడే వారినంత ఒక రాష్ట్రంలో చేర్చారు. అలా ఏర్పడ్డదే ఆంధ్రప్రదేశ్. తెలంగాణ, రాయలసీమ, సర్కారు ప్రాంతాలను కలిపి 1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఏర్పాటు చేశారు. మొదటి నుంచి తెలంగాణ, రాయలసీమ ప్రజలు అనుమానంతోనే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కలిసి ఉంటున్నారు. ఆర్థిక, రాజకీయ, విద్యా, ఉద్యోగ విషయాల్లో తెలంగాణకు అన్యాయం జరుగు తున్నదని ప్రత్యేక తెలంగాణ కావాలని 1969లో ఉద్యమం చెలరేగింది.

తెలంగాణ ప్రజల కోర్కెలను సమైక్య ఆంధ్రలోనే తీరుస్తామనే హామీలతో ఉద్యమాన్ని తాత్కాలికంగా ఆపగలిగారు. కాని మళ్ళి 1972లో ఆంధ్ర - తెలంగాణ ప్రత్యేక రాష్ట్రోద్యమాలు తలెత్తాయి. ఫలితంగా ఆరు సూత్రాల పథకం రూపొందింది. తమకు న్యాయం జరగలేదని తెలంగాణ ప్రజలు ఆవేదన వ్యక్తం చేస్తూనే ఉన్నారు.

రాయలసీమ కరువు పీడిత ప్రాంతాన్ని శ్రీభాగ్ ఒప్పందం వెలుగులో సస్యశ్యామలం చేయాలని రాయలసీమ వాసులు మొదటి నుంచి కోరుతున్నారు. రాయలసీమకు ఇప్పుడు క్రొత్తగా పథకాలు రూపొందించాల్సిన అవసరం కూడా లేదని, బ్రిటిష్ హయాంలో రూపొందిన మెకాంజీ పథకాన్ని అమలు చేయడం ద్వారా రాయలసీమకు సమృద్ధిగా నీటి వసతిని కల్పించవచ్చని ఉద్యమకారులు అంటున్నారు. తమ ప్రాంతం ఎడారికాకుండా ఉండాలని ఏళ్ల తరబడి ఆందోళనల ద్వారా మొరపెట్టుకుంటున్నారు.

అలాగే మహారాష్ట్రలోని కొంకణ్ ప్రాంతాన్ని నిర్లక్ష్యం చేసి, పూనా, బొంబాయి, థానే ప్రాంతాల్ని అభివృద్ధి

చేశారని, బొంబాయి ప్రాంతీయుల ఆధిపత్యాన్ని సహించబోమని కొంకణీయులు నిరసన వ్యక్తం చేస్తున్నారు. ప్రత్యేక కొంకణ్ రాష్ట్రం ఏర్పాటు చేయాలని 1960 నుంచి ఆ ప్రాంత ప్రజలు కోరుతున్నారు. కొంకణ్ నియోజక వర్గాల నుంచి బొంబాయికి చెందిన వారే ఎం.ఎల్.ఏ., ఎం.పి.లుగా ఎన్నిక కావడం వల్ల తమ ప్రాంతం అభివృద్ధికి నోచుకోవడం లేదని ప్రజలు ఆవేదన చెందుతున్నారు. బెల్గాం, కర్వార్, గోవాలను విలీనం చేసి ప్రత్యేక కొంకణ్ రాష్ట్రం ఏర్పాటు చేయాలని చాలమంది సూచించారు. కాని మరాఠీ మాట్లాడే ప్రజలకు రెండు రాష్ట్రాలు ఉండాల్సిన అవసరం లేదని అనాటి ముఖ్యమంత్రి వై.బి. చవాన్ తిరస్క రించారు. అలాగే విదర్భ, మరట్వాడా ప్రాంతాల అభివృద్ధికి ప్రాంతీయ బోర్డులు ఏర్పాటు చేయాలని అక్కడి ప్రజలు కోరుకుంటున్నారు.

బీహార్ రాష్ట్రంలోని సింగ్‌భూమ్ జిల్లాకు చెందిన కొల్హన్ ప్రాంతంలో ప్రత్యేక రాష్ట్రం కోసం ఆందోళన సాగుతున్నది. 1978లో కొల్హన్ రక్షా సంఘం ఏర్పడింది. ఈ ప్రాంతంలో అభివృద్ధి కోసం ఎలాంటి చర్యలు చేపట్టలేదని, ప్రజలకు విద్య, ఉద్యోగ అవకాశాలు కల్పించలేదని, ప్రభుత్వం ఈ ప్రాంతాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేస్తున్నదని అసంతృప్తి చెందిన ప్రజలు కొల్హన్ రక్షా సంఘం నాయకత్వంలో ఆందోళనా మార్గం చేపట్టారు. ఆందోళనను అణచటానికి భారత ప్రభుత్వం విచక్షణా రహితంగా సైనిక బలగాల్ని వినియోగించి పౌరహక్కులను హరిస్తున్నదని ప్రజలు ఆరోపిస్తున్నారు.

### అనాథలైన అడవి బిడ్డలు

సహజవనరులు సమృద్ధిగా ఉన్న ఆదివాసీ ప్రాంతాల్ని భారత ప్రభుత్వం తన పారిశ్రామికాభివృద్ధికి వినియోగించుకుంది. పరిశ్రమల స్థాపన, విద్యుత్తు ఉత్పత్తి, ఇనుము ఉక్కు కర్మాగారాలు, ఆనకట్టలు, రైల్వేలు, వివధకాన్ని చేపట్టినా ఆ పరిసర ప్రాంతాల ప్రజల జీవన పరిస్థితులు మెరుగుపడాలి. కాని ఎక్కడో నగరాల్లో పెద్ద వ్యాపారవేత్తల కోసం గిరిజనుల్ని నిర్వాసితుల్ని చేసి, ఇనుము, ఉక్కు, బొగ్గు గనులు తవ్వుతారు. రైల్వేలు నిర్మిస్తారు. మరెక్కడో నీటిపారుదల సౌకర్యం కల్పించాలని ఊళ్ళకు ఊళ్ళు ఖాళీచేయించి అడవుల్ని నరికేసి, ప్రజల్ని గూడులేని పక్షుల్లా చేస్తారు. ఇప్పుడు హిమాలయ సానువుల్లో నర్మదా, తెహ్రీ ఆనకట్టలు నిర్మించటానికి ఉద్యుక్తులవుతున్నారు. ఈశాన్య భారతం, మధ్యప్రదేశ్, ఒరిస్సా, బీహార్, బెంగాల్ రాష్ట్రాల్లోని ఆదివాసీ ప్రాంతాలన్నీ భారత పారిశ్రామికాభివృద్ధికి గురయ్యాయి. ఇనుప గనులు, బొగ్గు గనులు, రైల్వేలు, బహుళార్థ సాధక ప్రాజెక్టులు ఆది వాసుల బతుకుల్లో వెలుగు నింపలేదు. సరికదా వారిని నిర్వాసితుల్ని చేశాయి. పైగా భారత ప్రభుత్వం అటవీ చట్టాలపేర ఆదివాసుల పట్ల అటవికంగా ప్రవర్తించింది. రాంచీ, జంషెడ్‌పూర్, బొకారో, రూర్కెల ప్రాంతాల్లో, పారిశ్రామికాభివృద్ధి వల్ల ఆదివాసులు అడవితల్లి ఒడినుంచి దూరమయ్యారు. వారికి ఉపాధి సౌకర్యాలు కల్పించలేదు. పరిశ్రమలు ఆదివాసుల బతుకుల్ని మరింత దుర్భరం చేశాయి. దీనికతోడు మైదాన ప్రాంత ప్రజల భాషా సంస్కృతిని వారిపై బలవంతంగా రుద్దారు. మధ్యప్రదేశ్, ఒరిస్సా, బీహార్, బెంగాల్ రాష్ట్రాలలోని గిరిజన ప్రాంతాల్ని కలిపి ప్రత్యేక జార్ఖండ్ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని ఆదివాసులు ఉవ్వెత్తున ఉద్యమిస్తున్నారు.

జార్ఖండ్ ఉద్యమం లాగానే అస్సాంలో ప్రత్యేక బోడోలాండ్ రాష్ట్రం కావాలని ఆదివాసులు ఆందోళన చేపట్టారు. బోడో ఆదివాసులు తమకు స్వయం ప్రతిపత్తి కల్పించాలని కోరుతూ 1927 లోనే సైమన్ కమీషన్‌కు మెమొరాండం సమర్పించారు. భారత ప్రభుత్వం అనుసరించిన విధానాల వల్ల ఈ ప్రాంతాలు సామాజికంగా, వైజ్ఞానికంగా, రాజకీయంగా వెనుకబడి పోయాయి.

### జాతులు విముక్తిని కోరుతున్నాయి

అభివృద్ధి చెందిన దేశాలు, పెట్టుబడిదారీ సమాజం, సోషలిస్టు సమాజం తేడాలతో నిమిత్తం లేకుండా అధిక సంఖ్యాలకులకు, అల్ప సంఖ్యాకులకు మధ్య జాతి వైరుధ్యాలు ముందుకు వస్తున్నాయి. మతవాద, మిత వాద శక్తుల నుంచి, వామ పక్ష భావాల దాకా వివిధ సిద్ధాంతాల ప్రభావంతో జాతీయ ఉద్యమాలు నడుస్తున్నాయి. ప్రజలు తమ చరిత్రను తాము నిర్మించుకోటానికి ఉద్యమిస్తున్నారు.



ప్రత్యేక జార్ఖండ్ రాష్ట్రం కావాలని ఆందోళన చేస్తున్న ప్రజలు

ఈశాన్య భారత ఉద్యమాలలో భారత ప్రభుత్వ వ్యతిరేకత, బెంగాలీ వ్యతిరేకతలతో పాటు ఆయా గిరిజన

జాతులు, ఉపజాతుల మధ్య వైరుధ్యాలు సైతం వ్యక్తమవుతున్నాయి. ఇవి సరిహద్దు ప్రాంతాలు కావడం వల్ల నిత్యం సైన్యం పహారా కింద జీవించాల్సి వస్తున్నది.

ఈశాన్య ప్రాంతం సహజ వనరులు సమృద్ధిగా ఉన్న ప్రాంతం. అయినా పరిశ్రమల వల్ల ఆదివాసులకు లభించింది ఏదీ లేదు. వ్యవసాయం ఇక్కడి ప్రజల ఆహార అవసరాల్ని తీర్చలేని స్థితికి చేరి పోయింది. ఇతర ప్రాంతాల జనాభా వలస కొనసాగుతూనే ఉంది. విజాతీ ఆధిపత్యం స్థిరపడి పోయింది. ఫలితంగా ఇక్కడి ప్రజల సామాజిక జీవితంలో వైరుధ్యాలు విషమస్థితికి చేరుకున్నాయి.

ఈ ప్రాంతంలో 1947 పూర్వం బ్రిటిష్ పాలనలో బెంగాలీయుల ఆధిపత్యం కొనసాగింది. ఫలితంగా అస్సామీయులకు, బెంగాలీయులకు మధ్య వైరుధ్యం బలపడింది. ఈ వైరుధ్యం నేటికి ఏదో రూపంలో అస్సాం రాజకీయాల్లో నిర్ణయాత్మక పాత్ర నిర్వహిస్తున్నది.

మరోవైపు అస్సామీయులకు, వివిధ గిరిజన జాతులకు మధ్య వైరుధ్యాలు ముందుకు వచ్చాయి. అస్సాం భాషా సమస్యపై చెలరేగిన ఉద్యమాలు నాగాలాండ్, మిజోరం (కేంద్రపాలిత ప్రాంతం), మేఘాలయ ప్రత్యేక రాష్ట్రాల ఏర్పాటుకు దోహదం చేశాయి. బోడో లాండ్, ఉత్తర కచార్ లలో ప్రత్యేక రాష్ట్రం ఆందోళనలు చెలరేగుతూనే ఉన్నాయి. భాషా, సంస్కృతి, జాతీయతా భావాలేకాక, భారత ప్రభుత్వ దమన నీతికి వ్యతిరేకంగా ఈశాన్య ప్రాంతం భారత దేశం నుంచి విడిపోవాలనే అభిప్రాయాలు అప్పు డప్పుడు వినిపిస్తూనే ఉన్నాయి.

నేడు వేర్పాటువాద ఆందోళన కార్చిచ్చు కాశ్మీర్‌లో తగుల్కొంటున్నది. జాతీయ భావాలతో భారత దేశం నుంచి విడిపోవాలని కోరుకుంటున్న కాశ్మీర్ ఇందుకు మంచి ఉదాహరణ. భారత ప్రభుత్వం సైతం కాశ్మీర్‌ను విశ్రాంతి విడిదిగానే అభిప్రాయపడింది కాని, దేశంలో కాశ్మీర్ కూడా ఒక భాగం అన్నట్టు దాని అభివృద్ధికి చేసింది ఏమీలేదు. పర్యాటకుల్ని విశేషంగా ఆకర్షించే కాశ్మీర్ ప్రకృతి అందాల్ని నిలువు దోపిడి చేసిందేకాని, దాని అభివృద్ధికి పథకాలు చేపట్టింది లేదు.

"కాశ్మీర్‌లో ఆర్థికాభివృద్ధికి ఎలాంటి ప్రయత్నం జరగలేదు. గత కొంతకాలంగా కాశ్మీర్‌ను పూర్తిగా నిర్లక్ష్యం చేశారు. ఎలాంటి సౌకర్యాలు లేవు. విద్యుత్, పరిశ్రమలు, టూరిజం దేన్నీ అభివృద్ధి పరచలేదు. ఎప్పటి కప్పుడు నిధులు పెద్ద మొత్తాల్లో కేటాయిస్తున్నట్టు ప్రకటనలైతే వెలువడ్డాయి కాని వాస్తవంగా ఆ రాష్ట్రాభివృద్ధికి అవి అందలేదు. ఉదాహరణకు రాష్ట్ర అభివృద్ధి కోసం రు.1000 కోట్ల నిధుల్ని గత ప్రభుత్వం ప్రకటించింది. కాని అబ్దుల్లా రు.100 కోట్లు కూడా రాబట్టలేకపోయాడు" అని స్వయాన ప్రత్యేక కాశ్మీర్ సంబంధాల శాఖ మంత్రి, రైల్వేల మంత్రి జార్జి ఫెర్నాండెజ్ అన్నారు.

కాశ్మీర రాష్ట్రంలో రైల్వేలు, విద్యుత్తు రవాణా సౌకర్యాలను మెరుగు పరచటానికి చర్యలు తీసుకోలేదు. కుటీర పరిశ్రమలకు, ఎలక్ట్రానిక్ పరిశ్రమలకు మంచి అవకాశాలున్నా చర్యలు చేపట్టలేదు. నిరుద్యోగం తీవ్ర రూపం దాల్చింది. రాష్ట్రం పూర్తిగా నిర్లక్ష్యానికి గురైందన్నది నిర్వివాదాంశం.

భారత ప్రభుత్వం పట్ల కాశ్మీర్ ప్రజలకు విశ్వాసం సన్నగిల్లింది. కాశ్మీర్ భారతదేశంలో భాగమై ఉండాలా, విడిపోవాలా అని ఇప్పటి కిప్పుడు జనవాక్య సేకరణ జరిపిస్తే ఫలితం ఆందోళన కరంగానే ఉండొచ్చు. ఎవరినైనా ఐచ్ఛికంగా కలిపి ఉంచ వచ్చు. కాని బలిమిచేత ఎంతోకాలం కలిపి ఉంచడం అసాధ్యం. ఆర్థిక వెనుకబాటుతనం, దారిద్ర్యం, ఆకలి శాంతి జపం జపిస్తే తీరేవి కావు. అవి అంతిమంగా పోరాటమార్గం తీసుకుంటాయి. వెనుకబడిన ప్రాంతాలలో, వ్యావసాయిక, పారిశ్రామిక అభివృద్ధిని సాధించటానికి సత్వరచర్యలు చేపట్టాలి. భారత ప్రభుత్వం గతంలోని విధానాలనే కొనసాగిస్తే, ఈ శతాబ్దం అంతానికి దేశపటం రూపురేఖలే మారిపోవచ్చు.



సైన్యం మధ్య ఉద్రిక్త వాతావరణంలో జీవిస్తున్న బోడో ప్రజ

**ఎస్. జయ**

# నిర్బంధ ప్రాథమిక విద్య– ఎండమావి

వ్యక్తి అభివృద్ధి చాలవరకు అతని విద్యాస్థాయిపైనే ఆధారపడి ఉంటుంది. ఎందుకంటే తన హక్కుల కోసం పోరాటం చేయటంలో చైతన్యవంతంచేసే ప్రధాన అంశాలలో విద్య ఒకటి కాబట్టి. ఆర్థిక, సాంఘిక, విద్యా వ్యత్యాసాలు అపారంగా ఉన్న భారతదేశంలాంటి దేశాల్లో విద్యమరీ అవసరమవుతుంది. ప్రపంచాన్ని "అర్థం చేసుకోటానికి" రాజకీయాలు తెలుసుకోవటం అవసరమేకాని అక్షరాస్యత, విద్య కూడా అంతే అవసరమవుతాయి. "విద్య నేర్పటం" అనేది రాజకీయ వ్యవహారం కావటంవల్ల, శ్రామిక జనానికి విద్య నేర్పటంలో పాలక వర్గాలు అంత ఆసక్తి కనపరచవు. అందుకనే "నిర్బంధ ప్రాథమిక విద్య" పథకం ఇంతవరకూ సఫలం కాలేదు. ఎందుకంటే ఈ పథకంవల్ల ప్రయోజనం పొందేది షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతులు, వెనుకబడిన తరగతులు, స్త్రీలే కావటంవల్ల వీరందరికీ చదువు నేర్పటం పాలకవర్గాలకు ఇష్టం ఉండదు. అనేక చారిత్రిక కారణాల వల్ల దేశంలో ఆర్థిక, సాంఘిక అభివృద్ధి ఒకేలా ఉండకపోవటంతో ఈ సమస్య మరీ కష్టంగా తయారయింది. మన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రాన్నే తీసుకుందాం, ఇందులో కోస్తా ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా అని మూడు ప్రాంతాలు ఉన్నాయి. ఈ మూడు ప్రాంతాలలోని ఆర్థికాభివృద్ధి ఒకేలా ఉండదు. అదే విధంగా సాంఘికాభివృద్ధికి నిదర్శనమైన విద్య కూడా "వెనుకబడిన" ప్రాంతాలలో వెనుకబడే ఉన్నది. అభివృద్ధి అనేది ఏదైనా గ్రామాలలో నుంచి మొదలవ్వాలనేది అందరూ ఎరిగినదే. విద్య కూడా దీనికి మినహాయింపు ఏమీ కాదు. అదే విధంగా ఒక ప్రాంతంలో ప్రాథమిక విద్య ఏ స్థాయిలో ఉంటే అక్కడ అభివృద్ధి ఆ స్థాయిలో ఉన్నదని నిర్థారణ చేసుకోవచ్చు. రాష్ట్రంలోని మూడు ప్రాంతాల్లోనూ ఎస్.సి., ఎస్.టి. ఇతరుల విషయంలో ప్రాథమిక విద్య ఏ స్థాయిలో ఉన్నదో పరిశీలించటానికి ఇక్కడ ప్రయత్నం జరిగింది. విద్యార్థులలో ఆయా తరగతుల్లో "చదువు మానేయటం" అనే దానిని పరిశీలిస్తే సమస్య ఎంత తీవ్రంగా ఉన్నదో మనకు అర్థమవుతుంది. ముందుకొన్ని గణాంక వివరాలను పరిశీలిద్దాం.

ఆంధ్రప్రదేశ్‌లో (30.9. 1987 నాటికి) మొత్తం 45,664 ప్రాథమిక పాఠశాలలు ఉంటే (హైద్రాబాద్ నగర ప్రాంతం మినహా) తెలంగాణా ప్రాంతంలో 13,716 పాఠశాలలు ఉన్నాయి. అంటే మొత్తంలో ఇది 30.02%. కోస్తా ఆంధ్రలో 21,512 (47.10%) పాఠశాలలు ఉంటే, రాయలసీమలో 10,436 (22.84%) పాఠశాలలు ఉన్నాయి. పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయుల పరిస్థితి కూడా దీనికంటే గొప్పగా ఏమీలేదు. మొత్తం రాష్ట్రంలో 95,452 ఉపాధ్యాయులుంటే, కోస్తా ఆంధ్రలో 50,175 (52.56%) ఉపాధ్యాయులుండగా తెలంగాణాలో 24,753 మంది (25.42%) రాయలసీమలో 20,524 (21.03%) మంది ఉపాధ్యాయులు ఉన్నారు.

మూడు ప్రాంతాలలోని జనాభా 1981 జనాభా లెక్కల ప్రకారం కోస్తా ఆంధ్రలో 2.374 కోట్లు (46.29%), రాయలసీమలో 0.96 కోటి (18.76%) తెలంగాణాలో 1.792 కోట్లు (34.94%) ఉన్నారు.

క్రింది పట్టికను బట్టి మనకు కోస్తా ఆంధ్రలో అక్షరాస్యత (చదవటం, రాయటం) 32.79 శాతం ఉండగా,

**ఒకటో పట్టిక**

*మూడు ప్రాంతాలలో పాఠశాలల సంఖ్య, ఉపాధ్యాయుల సంఖ్య, బడి మానేస్తున్న వారి శాతం, విద్య శాతం తెలిపేది.*

| ప్రాంతం | కోట్లలో జనాభా (1981జనాభా లెక్కలు) | 30.9.87 ప్రాథమిక పాఠశాలలు | ప్రాథమిక ఉపాధ్యాయులు (30.9.87) | బడిమానివేస్తున్న వారి శాతం 1-5 తరగతి (1981-1985) | అక్షరాస్యత |
|---|---|---|---|---|---|
| కోస్తా ఆంధ్ర | 2.37 (46.29) | 21,512 (47.10) | 50,175 (52.56) | 56.46 | 32.79 |
| రాయలసీమ | 0.96 (18.76) | 10,436 (22.84) | 20,524 (21.03) | 47.92 | 30.17 |
| తెలంగాణా | 1.79 (34.94) | 13,716 (30.02) | 24,753 (25.42) | 59.13<br>ఆంధ్రప్రదేశ్ అంతా 54.50 | 26.49<br>ఆంధ్రప్రదేశ్ అంతా 29.94 |

తెలంగాణాలో 26.49 శాతం ఉందనీ, రాయలసీమలో 30.17 శాతం ఉందని తెలుస్తున్నది. సాంఘికంగా వెనుకబడి ఉన్నారు అని చెప్పటానికి 1వ తరగతి నుంచి 5వ తరగతి వరకూ ఎంతమంది చదువు మానేస్తున్నారో చూస్తే తెలిసి పోతుంది. తెలంగాణాలో ఇది 59.13 శాతం ఉంటే, కోస్తా అంధ్రలో 56.46 శాతం ఉండగా, రాయలసీమలో 47.92 శాతం ఉన్నది. దీనిని బట్టి తేలుతున్నదేమంటే మొత్తం ఆంధ్ర ప్రదేశ్‌లో 24 సంవత్సరాల తెలంగాణాలో 72.15 శాతం ఉంటే, కోస్తాఅంధ్రలో 58.58 శాతం రాయలసీమలో 56.60 శాతం ఉన్నది. ఆశ్చర్యం ఏమంటే ఎస్.టి.ల విషయంలో మొత్తం రాష్ట్రమంతా ఇంచుమించు 69.1 వద్ద సమానంగానే ఉన్నది. మూడు ప్రాంతాలలో అసమానతలను తొలగించాలనుకున్నపుడు ముందు చేయవలసింది ఏమంటే ప్రాథమిక విద్య విషయంలో పరిస్థితి మెరుగుపడేటట్లు చేయటం. చాల అవసరమనే విషయాన్ని పై వివరాలు

**రెండో పట్టిక**

ఎస్.సి., ఎస్.టి.ల జనాభా, అక్షరాస్యత శాతం, చదువు మానేస్తున్న వారి శాతం

| ప్రాంతం | ఎస్.సి. | | | ఎస్.టి. | | |
|---|---|---|---|---|---|---|
| | లక్షలలో జనాభా (1981) | అక్షరాస్యత శాతం | చదువు మానేసిన వారి శాతం 1-5 తరగతులు (1981-85) | లక్షలలో జనాభా (1981) | అక్షరాస్యత శాతం | చదువు మానేసిన వారి శాతం 1-5 తరగతులు (1981-85) |
| కోస్తా అంధ్ర | 32.14 | 23.02 | 58.58 | 12.84 | 9.74 | 69 |
| రాయలసీమ | 14.55 | 15.83 | 56.60 | 2.39 | 11.16 | 69 |
| తెలంగాణా | 30.76 | 13.20 | 72.15 | 16.39 | 5.86 | 69 |
| | | | | | | అం.ప్ర. అంతా 69 |

పేదకుటుంబాలకు ఆర్థిక ప్రోత్సాహం కల్పించటం. దీనికి తోడు స్కాలర్‌షిప్పులు లాంటివి ఇవ్వాలని కూడా సూచించటం జరిగింది. ఇది కొత్త సూచన ఏమీ కాదు. మధ్యాహ్న భోజనం వంటి పథకాలను తమిళనాడు వంటి రాష్ట్రాలు చాల ఏళ్ళు చాల ఫలవంతంగా కొనసాగించారు. మన రాష్ట్రంలో టిడిపి పరిపాలన కాలంలో మధ్యాహ్న భోజన పథకం అమలు చేయటానికి కొంత ప్రయత్నం జరిగింది. ఈ పథకం పట్ల ఏ రాజకీయ

"అభివృద్ధి"ని గనక పరిశీలిస్తే, తెలంగాణా వరకూ ఏ మాత్రమూ చెప్పుకోదగ్గ మార్పు రాలేదు. ఇంతే కాకుండా ఈ లెక్కలను చూస్తే మనిషి నివృత్తిని బట్టి ఉండవలసిన పాఠశాలలు, ఉపాధ్యాయులు కూడా తెలంగాణాలో తక్కువే అనేది రుజువు అవుతుంది. ఎస్.సి., ఎస్.టి.ల విషయంలో ఈ పరిస్థితి చాల అధ్వాన్నంగా ఉన్నది.

పై పట్టికను పరిశీలిస్తే ఇతర ప్రాంతాలకంటే తెలంగాణాలో ఉన్న ఎస్.సి., ఎస్.టిల పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉన్నదని తెలుస్తుంది. కోస్తా అంధ్రలో అక్షరాస్యత శాతం ఎస్.సి. 23.02, ఎస్.టి. 9.73 ఉంటే, తెలంగాణాలో ఎస్.సి. 13.20, ఎస్.టి. 5.86 ఉండగా, రాయలసీమలో ఎస్.సి. 15.83, ఎస్.టి. 11.16 ఉన్నది. తెలంగాణాలో ఎస్.సి.లలో చదువు మానేస్తున్నవారి శాతం కూడా చాలా ఎక్కువగా ఉన్నది. ఇది తెలియజేస్తున్నాయి.

పై వివరాలను చూస్తే ఇంకో విషయం బయటపడుతుంది. ఎస్.సి., ఎస్.టిల పరిస్థితి అధ్వాన్నంగా ఉన్నదనుకుంటే ఈ వర్గాలకు చెందిన ఆడపిల్లల పరిస్థితి అంతకంటే ఘోరంగా ఉన్నది. మరి ఈ పరిస్థితిని బాగు పరిచేది ఎలా? జాతీయ విద్యావిధానం (1986) ఏం చెబుతున్నదంటే "ఎస్.సి.ల విద్యాభివృద్ధిలో కేంద్రీకరిస్తున్నది ఏమంటే విద్యలో అన్ని తరగతులలోను అన్నిస్థాయిలలోను ఇతర కులాల స్థాయికి వారిని తీసుకురావటం, అన్ని ప్రాంతాలలోను, అన్ని రంగాలలోను -గ్రామీణ పురుషులు, గ్రామీణ స్త్రీలు, పట్టణ పురుషులు, పట్టణ స్త్రీలు - ఉన్నతుల స్థాయికి ఎస్.సి.లను తీసుకురావటం". ఈ లక్ష్యసాధనకు వారు చర్యలు తీసుకోవాలను కుంటున్నారంటే 14వ ఏడు వచ్చేవరకూ విడవకుండా తమ పిల్లల్ని పాఠశాలలకు పంపించటం కోసం పార్టీలుగాని బృందాలుగాని శ్రద్ధ చూపకపోయేసరికి మూడేళ్లలో ఈ పథకాన్ని మూసివేశారు. కార్మికులు, రైతులు, మధ్యతరగతి ప్రజలు, స్త్రీలు తమ హక్కులు సాధించుకోనేలా బలహీన వర్గాలకు చెందిన పిల్లలు తమ హక్కులను సాధించుకోలేరు. ఆ విషయంలో వీరు చాలా బలహీనులు. పిల్లల సమస్యను పట్టించుకొనేవారు కూడా ఎవరూ లేరు. ఆంధ్రప్రదేశ్‌లో వయోజనులు ఏమీ శ్రద్ధ చూపకపోయే సరికే మధ్యాహ్న భోజనం ఆగిపోయింది. పిల్లలు ప్రయోజనాలను దెబ్బకొట్టడానికి పెద్దవాళ్లంతా ఏదో కుట్రపన్నినట్టు ఉన్నది. ఇపుడు "కొత్త" ప్రభుత్వం వచ్చింది కాబట్టి బలహీన వర్గాలలో మరీ బలహీనమైన పిల్లల విషయంలో కనీసం ప్రాథమిక విద్య విషయంలో అయినా కొంత శ్రద్ధ చూపుతుందని ఆశిద్దాం.

**ఎం. శత్రుఘ్న.**

# కార్మికోద్యమం - కొన్ని పరిశీలనలు

**నేటి** కార్మికోద్యమంలో అనేక పెడ ధోరణులు వ్యాపించటం వల్ల అనైక్యత పెరుగుతూ ఉన్నది. ఈఅనైక్యతకు తోడు ఆర్థిక వాదం, కార్మిక ప్రయోజనాలకు విరుద్ధంగా పనిచేస్తూ పరిశ్రమల యాజమాన్యాలకు తొత్తులుగా చెలామణి అవుతున్న వ్యక్తుల ప్రాబల్యం పెరిగిపోయింది. కార్మికుల అనైక్యత మూలంగా పరిశ్రమాధిపతులు సంఘటితంగా మెలుగుతూ, కార్మికులు సుదీర్ఘ పోరాటాల వల్ల సాధించుకున్న అనేక చట్టపరమైన రాయితీలను హక్కులను అణగదొక్కి వేస్తున్నారు. కార్మికోద్యమ మౌలిక లక్ష్యాలకు విరుద్ధంగా పనిచేస్తున్న బి.ఎం.ఎస్. లాంటి మతతత్వ కార్మిక సంఘాల ప్రాబల్యం రోజు రోజుకు పెరిగిపోతున్నది. జాతీయోద్యమకాలం నాటి సంఘటితత్వం నేటి కార్మికులలో మచ్చుకు కూడ గోచరించడం లేదు.

గ్రామీణ ప్రాంతంలో అలుముకున్న దశాబ్దాల కరువు పరిస్థితుల వల్ల పనులు కోల్పోయి భూమి లేని పేద రైతు కూలీలు, వేలాదిగా పట్టణాలకు వలస వెళ్ళి చిన్న చిన్న పరిశ్రమలలో రోజువారి వేతన కార్మికులుగా స్థిరపడుతున్నారు. వీరి ప్రయోజనం కోసం ప్రభుత్వం తయారు చేసిన చట్టాలను ఈ పరిశ్రమాధిపతులు వేటినీ అమలు చేయడం లేదు. వీరిని కట్టు బానిసలకంటే హీనంగా పనిచేయిస్తున్నారు. దేశంలోనే పెద్ద కార్మిక సంఘాలుగా, వామపక్షాలుగా చెలామణి అవుతున్న ఎ.ఐ.టి.యు.సి., సి.ఐ.టి.యు. తదితర కార్మిక సంఘాలు వీరిని సంఘటితం చేయడంలో ఘోరంగా విఫలమయ్యాయి. ఇవి కేవలం ఉన్నత శ్రేణి కార్మికులకు వేతన జీవులుగా పరిగణింపబడుతున్న బ్యాంకు, తంతి తపాల, భీమా, రైల్వే ఉద్యోగుల ప్రయోజనాలు కాపాడడానికే పరిమితమయ్యాయి తప్ప అసంఘటిత కార్మిక శ్రేయస్సుకు కృషి చేయడం లేదు.

మరో వైపు ప్రభుత్వ రంగ సంస్థలలో కాంట్రాక్టు లేబర్ విధానాన్ని ప్రవేశ పెట్టి వాటి యాజమాన్యాలు కాంట్రాక్టు కార్మికుల ప్రయోజనాలకు తీవ్ర విఘాతం కలిగిస్తూ వారిని కట్టు బానిసల కంటే హీనంగా పని చేయించు కుంటున్నారు. కాంట్రాక్టు లేబర్ విధానాన్ని ప్రభుత్వ రంగ సంస్థలలో అమలు చేయడం వల్ల ప్రభుత్వం తాము కార్మిక శ్రేయస్సు కోసం రూపొందించిన చట్టాలను తానే కాలరాచి తన స్వభావాన్ని బయట పెట్టుకుంటున్నది. మరో వైపు కార్మికులు ఏ ప్రాంతంలోనైన సంఘటితంగా సమ్మెకు ఉపక్రమించినపుడు అనేక చట్టాలను, తీవ్ర నిర్బంధ కాండను ప్రయోగిస్తూ అణచివేయడానికి పూనుకుంటున్నది. దీనితో కార్మిక వర్గంలో స్తబ్దత, నిరాశ నిస్పృహలు, ఆర్థికవాదం విజృంభిస్తున్నది. కార్మికులు జీతాలు పెంచాలనే, కరువుభత్యం చెల్లించాలనే సమ్మెలు చేస్తున్నారు తప్ప రాజకీయ పరమైన సమస్యలపై నిర్బంధ చట్టాలకు వ్యతిరేకంగా ఉద్యమించడం లేదు.

## పెరిగిపోతున్న ఆర్థికవాదం

ప్రస్తుతం దేశవ్యాప్తంగా కార్మిక రంగంలో ఆర్థికపరమైన డిమాండే ప్రధానంగా ముందుకు వస్తున్నది.

ఈ ధోరణి బ్యాంకు తపాల, ప్రభుత్వరంగసంస్థలు భీమా, రైల్వే కార్మికులలో తీవ్రంగా వ్యాపించి ఉంది. ఈ వర్గపు కార్మికులలో కార్మిక లక్షణమైన సామాజిక పరివర్తన ఉన్నతప్రగతి సామూహిక చైతన్యం పూర్తిగా నశించింది. తమ జీవన పరిస్థితులను మెరుగుపరుచు కోవడానికి అధిక వేతనాల కోసం పోరాడుతున్నారు తప్ప, చుట్టూ సమాజంలో జరుగుతున్న అనేక సంఘటనలకు ఏ మాత్రం ప్రతిస్పందించడం లేదు. తాము పనిచేస్తున్న సంస్థలలో కాంట్రాక్టు లేబరులో భాగంగా అతి తక్కువ వేతనాలతో పనిచేస్తూ, కనీస అవసరాలైన వైద్య సౌకర్యం ప్రయాణ భత్యం లాంటి వాటికి నోచుకోని లక్షలాది మంది కార్మికుల గూర్చి ఏ మాత్రం పట్టించుకోవడం లేదు. ఈ వర్గపు కార్మికులకు నాయకత్వం వహిస్తున్న కార్మిక సంఘాలు ఇవే డిమాండ్లను ముందుకు తెస్తున్నాయి తప్ప ఆర్థిక పరమైన డిమాండ్లకు రాజకీయమైన డిమాండ్లను జోడించి కార్మికులలో చైతన్యాన్ని రగులుకొల్పడానికి కృషి చేయడం లేదు. ఈ కార్మికులు సంఘటితంగా ఉండడంవల్ల ప్రస్తుత పాలక వర్గాలకు చెందిన కార్మిక సంఘాలు వీరిని సమీకరించడం సులభమవుతున్నది. వీరి న్యాయకత్వం ఆర్థిక పరమైన డిమాండ్లకు పరిమిత మవడం వల్లనే కార్మికులలో ఉన్నతరాజకీయ చైతన్యంలోపించింది.

## నిర్బంధ చట్టాలు

కార్మికులు ఎక్కడయినా శక్తివంతంగా ఉద్యమించడానికి పూనుకున్నపుడల్లా ప్రభుత్వం పరిశ్రమాధిపతుల పక్షం వహిస్తూ కార్మిక ఉద్యమాల అణచి వేయడానికి తీవ్రంగా పూనుకుంటున్నది ఇందులో భాగంగానే ఎస్మా, పారిశ్రామిక సంబంధాల బిల్లు మొదలైన నిరంకుశ చట్టాలతో కార్మికుల సంఘటితశక్తిని నీరుగార్చడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఒక్క పారిశ్రామిక సంబంధాల బిల్లునే పరిశీలిస్తే, ఈ బిల్లును గత 1988 మేనెలలో గత కాంగ్రెస్ ప్రభుత్వం ప్రవేశ పెట్టింది. ఈ బిల్లు ఇంకా ఆచరణ రూపం దాల్చలేదు. ఒకవేళ ఆచరణలోకి వస్తే కార్మిక ఉద్యమానికి ఈ బిల్లు తీవ్ర విఘాతం కలిగిస్తుంది. ఈ బిల్లు ప్రకారం ఆసుపత్రులు, విద్యాసంస్థలలో వివాదాన్ని లేవనెత్తే హక్కుతో సహా అన్ని రకాల ట్రేడ్ యూనియన్ హక్కులను కాలరాచి వేస్తుంది. ఈ బిల్లు ప్రకారం కారణం లేకుండానే సర్వీసులోంచి తొలగించే అవకాశం ఉంది. ఇంతేకాదు రక్షణ రంగానికి చెందిన బి.డి.యల్., మిధాని లాంటి కర్మాగారాలలో పనిచేసే కార్మికులకు సమిష్టి చర్చల హక్కును నిరాకరించారు.

బోనస్‌కు సంబంధించిన చట్టాలలో అనేక పరిమితులు విధించడం వల్ల కార్మికులకు తీరని అన్యాయం జరుగుతున్నది. ఈ పరిమితి వల్ల 1600లకు పైగా వేతనం పొందుతున్న కార్మికులకు 1600 రూపాయలకు మించి(బోనస్ రాదు. ఈ చట్టాల వల్ల 2500 వేతనం పొందుతున్న కార్మికునికి బోనస్ చెల్లించరు. ఇంతేకాదు యాజమాన్యం గడిస్తున్న లాభాలలో 20 శాతం మించి బోనస్ చెల్లించరాదనే నిబంధన ఉన్నది. కాంట్రాక్టు లేబరు చట్టం వల్ల ప్రభుత్వమే పరోక్షంగా కార్మిక హక్కులను అణిచి వేస్తున్నది.

### పరిశ్రమాధిపతుల కుటిల పన్నాగాలు

'కార్మికులు' తమ సమస్యల పరిష్కారానికి నిరసన తెలియ చేయడానికి, సమ్మెకు ఉపక్రమించినప్పుడల్లా పరిశ్రమాధిపతులు లాకౌట్‌ను ఒక ఆయుధంగా ప్రయోగిస్తున్నారు. తమ పరిశ్రమలలో కొన్ని విభాగాలను ఖాయిలా పడ్డాయని ప్రకటించి కార్మికుల ఐక్యతను దెబ్బతీయడానికి ప్రయత్నిస్తున్నారు. ఇప్పటికే పరిశ్రమాధిపతుల స్వలాభాపేక్ష వల్ల 2 లక్షల అయిదువేల యూనిట్లు మూసివేతకు గురి అయ్యాయి. ప్రతిరోజు సుమారు 90 పరిశ్రమలు వివిధ రకాల విభాగాలు సిక్ యూనిట్లుగా మారిపోతున్నాయి.

ప్రభుత్వం పరిశ్రమలను ప్రోత్సహించ డానికి నూతన ఆర్థిక విధానాలను రూపకల్పన చేయడం వల్ల ప్రభుత్వం నుంచి వచ్చే రాయితీలు, సబ్సిడీల కోసం కొంతమంది పరిశ్రమాధిపతులు పరిశ్రమలను తెరువడం మూసివేయడం జరుగుతున్నది. ఇంతేకాదు పారిశ్రామిక చట్టాలలో ఉన్న లొసుగువల్ల కార్మికులకు న్యాయంగా రావాల్సిన ప్రావిడెంట్ ఫండు గ్రాట్యుటీ, తదితర సౌకర్యాలను పరిశ్రమాధిపతులు సక్రమంగా చెల్లించడంలేదు. లాకౌట్‌ను కార్మిక సమ్మెను నీరుగార్చడానికి కార్మికులు సమ్మెకు పూనుకోక ముందున్న పని పరిస్థితులకంటే అధ్వాన్న పరిస్థితులలో సమ్మె తరువాత పని చేయిస్తున్నారు. తమ పరిశ్రమలలో శాశ్వత నియమకాలు అవసరమై నప్పటికి, నియామకాలు జరపడం లేదు. ఆధునీకరణ పేరుతో దశాబ్దాలుగా పనిచేస్తున్న కార్మికులను అర్థాంతరంగా తొలగించి వేస్తూ వారి జీవితాలను అంధకారంలో ముంచెత్తుతున్నారు. పైగా శ్రామికులలో క్రమశిక్షణారాహిత్యం పెరిగి పోతున్నదని, ఉత్పాదకత పడిపోతున్నదని, ఫ్యాక్టరీల లాకౌట్లకు కార్మికులే కారణమని పరిశ్రమాధిపతులు ఆరోపిస్తున్నారు. అయితే ప్రభుత్వ వైఖరి పూర్తిగా పరిశ్రమాధిపతులకు అనుకూలంగానే ఉంటున్నది. వారు ప్రభుత్వ నియమ నిబంధనలను బహిరంగంగా ధిక్కరించినా, ప్రభుత్వం పట్టించు కోవడం లేదు. అయితే పరిశ్రమాధిపతుల కుటిల పన్నాగాలన్ని ఎక్కువ శాతం చిన్న చిన్న పరిశ్రమలలో అసంఘటిత కార్మిక వర్గంలోనే ఎక్కువగా చెలామణి అవుతున్నాయి.

### అసంఘటిత కార్మిక వర్గం

అసంఘటిత కార్మికుల్ని సమీకరించి ఐక్యం చేసి పటిష్టమైన కార్మిక ఉద్యమాన్ని నిర్మించడంలో ప్రస్తుత కుహన వామపక్ష కార్మిక సంఘాలన్ని విఫలం చెందాయి. దేశంలో 24 కోట్ల మంది కార్మికులలో 90 శాతం అసంఘటిత కార్మికులే. వీళ్ళు ఎక్కువగా ప్రభుత్వ రంగ సంస్థలలో కాంట్రాక్టు లేబరుగా, భవన నిర్మాణ కార్మికులుగా, చేనేత కార్మికులుగా, బీడి పరిశ్రమల్లో లఘుపరిశ్రమల్లో ఎక్కువగా పనిచేస్తున్నారు. ప్రస్తుత కార్మిక సంఘాలన్నీ సంఘటిత కార్మికుల ఉద్యోగుల ప్రయోజనాల పరిరక్షణకు పరిమితమయ్యాయి తప్ప అసంఘటిత కార్మికుల వేతనాలను పెంపొందించ డానికి ఎటువంటి కృషి చేయడం లేదు. అసంఘటిత కార్మికులతో పోలిస్తే సంఘటిత కార్మికుల జీవన పరిస్థితులు ఎన్నోరెట్లు మెరుగు. సంఘటిత కార్మికులకు ఉన్న చట్టపరమైన రక్షణలు రాయితీలు ఉద్యోగ భద్రత ఈ కార్మికులకు లేవు. అసంఘటిత కార్మికులు తమకు చట్టపరంగా లభిస్తున్న రక్షణలు కూడ పరిశ్రమాధిపతుల నుంచి (రక్షించుకోలేక పోతున్నారు. ప్రభుత్వాధికారులలో కార్మిక శాఖాధికారులలో పేరుకపోయిన అవినీతి వల్ల వీరి ప్రయోజనాలకు తీవ్ర విఘాతం కలుగుతున్నది. వీరిని రోజువారి కూలీలుగా కాంట్రాక్టు లేబరుగా ఎన్.ఎం ఆర్‌లుగా అనేక పేర్లతో పరిశ్రమాధిపతులు పిలుస్తూ దోపిడి చేస్తూ, కట్టు బానిసలకంటే హీనంగా చూస్తున్నారు. వీరి హక్కుల పరిరక్షణకు ప్రభుత్వ పరంగా ఎటువంటి చట్టబద్ధమైన రక్షణలు లేవు. నిర్దిష్టమైన వేతన విధానం లేదు. వీరిలో స్త్రీ పురుష వివక్ష పెద్ద ఎత్తున కొనసాగుతున్నది. అసంఘటిత కార్మిక రంగం సమస్యల వలయంగా తయారయ్యింది.

### ప్రస్తుత కార్మిక సంఘాల వైఖరి

ఇటీవల కార్మికుల ఉద్యమం వివిధ రాజకీయ పార్టీల ప్రయోజనాలకు అనుగుణంగా మలుపు తిరగడంతో అనేక చీలికలకు గురవుతున్నది. కార్మికుల ప్రయోజంకన్న వాటి రాజకీయ పార్టీల ప్రయోజనమే ముఖ్యంగా కార్మిక సంఘాలు ప్రవర్తిస్తున్నాయి. కార్మిక సంఘాలను వివిధ పాలకవర్గ రాజకీయ పార్టీలు తమ అధికారప్రాబల్యం కోసం వాడుకొంటున్నాయి. దీంతో చైతన్యానికి సామాజిక సంఘటిత శక్తికి మారు పేరయిన కార్మిక వర్గంలో ప్రాంతీయ కుల, మత, భాషా భేదాలు పొడసూపుతున్నాయి. ఈ భేదాలను రెచ్చగొట్టి కార్మిక స్పృహ ఏ మాత్రం లేని గూండాలు మతోన్మాదులు కార్మిక నాయకులుగా చలామణి అవుతూ తమ రాజకీయ అస్తిత్వాన్ని బలోపేతం చేసుకుంటున్నారు. ఇందుకు వామపక్ష కార్మిక సంఘాలు మినహాయింపు కాదు. పటిష్టమైన, చైతన్యవంతమైన వామపక్ష కార్మికోద్యమం నిర్మించడంలో వామపక్ష సంఘాలు విఫలమయినందువల్లే కులసంఘాలు, మత సంఘాలు ఏర్పాటు అవుతున్నాయి. అందుకే ప్రస్తుత భారత కార్మికోద్యమం తీవ్ర నిస్తేజంలో పడిపోయింది. దీని ప్రభావం వల్లనేమొ ప్రభుత్వం, పరిశ్రమాధిపతులు అనేక నిర్బంధ చట్టాలు, లాకౌట్లు, ప్రకటించినా, కార్మిక వర్గం నిస్తేజంగా పడి ఉంటుంది.

ప్రస్తుత కార్మికోద్యమంలో అలుముకున్న పెదధోరణులు, నిస్తేజాన్ని బద్దలు కొడుతూ ప్రత్యామ్నాయంగా పటిష్టమయిన సంఘటిత, అసంఘటిత కార్మిక ఉద్యమాన్ని నిర్మించకపోతే ప్రస్తుతమున్న పరిస్థితుల నుంచి కార్మికులు బయటపడే అవకాశంలేదు.

**యస్. జగన్‌రెడ్డి**

# రాయలసీమ వెనుకబాటుతనం – ఒక పరిశీలన

**గత** నలభై సంవత్సరాలుగా వెనుకబడిన ప్రాంతాలను గురించి ప్రత్యేకంగా పట్టించుకోడం ఎక్కువయింది. వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికిగాను ప్రత్యేక ప్రణాళికా రచన తయారవుతున్నది. ప్రభుత్వం, సామాన్య ప్రజానీకమే కాకుండా విద్యావేత్తలు కూడ దీన్నొక ప్రత్యేక అంశంగా గుర్తిస్తు వస్తున్నారు. ప్రాంతం ప్రాంతీయాభివృద్ధి, ప్రాంతీయ చరిత్ర, ప్రాంతీయ విశ్లేషణ, ఒక సిద్ధాంతంగా వెనుకబాటుతనం, ఉప జాతీయత, ఉపజాతుల మధ్యన ప్రాంతీయ వ్యత్యాసాలు, ప్రపంచ వ్యాప్తంగా ప్రాంతీయ అధ్యయనాల విశ్లేషణ ఈ మధ్యకాలంలో బాగా వ్యాప్తిలోకి వస్తు న్నాయి. పశ్చిమ దేశాల్లో ప్రాంతీయ సైన్సుగాను, సోషలిస్టు దేశాల్లో ప్రాంతీయ ఆర్థిక శాస్త్రంగాను ఈ అంశం ప్రచారంలో వుంది. అమెరికాలో ఆర్థిక శాస్త్రవేత్త వాల్టర్ ఇస్రాద్ చొరవతో 1954లో "ప్రాంతీయ సైన్సు సంఘం" కూడ ఏర్పాటయి వుంది. ఇస్రాద్‌ను ప్రాంతీయ అధ్యయనాల పితామహుడుగా పరి గణిస్తున్నారు. ప్రాంతాన్ని నిర్వచనంలో బిగించటానికి విద్యావేత్తలు ఇంకా కుస్తీలు పడుతూనే వున్నారు. ఈ సమస్య అటు పెట్టుబడి దారీ దేశాల్లోనూ, ఇటు సోషలిస్టు దేశాల్లోనూ వుంది. ఆ ప్రాంతాల అభివృద్ధికిగాను కొన్ని దేశాల్లో ప్రత్యేక సంస్థలే స్వయం ప్రతిపత్తితో పని చేస్తున్నాయి. అమెరికాలో టెన్నెన్ వ్యాలీ అభివృద్ధి కోసం ఒక సంస్థ పని చేస్తున్నది. ఇటలీలో 'కాసా', బ్రెజిల్‌లో, సుడెన్', శ్రీలంకలో 'గాల్ ఒయా' లాంటి సంస్థలు వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి కోసం ప్రత్యేకంగా ఏర్పాటయి కృషి చేస్తున్నాయి. మనదేశంలోనూ దామోదర్ వ్యాలీ కార్పొరేషన్, దండ కారణ్య ప్రాజెక్టు, నర్మద వ్యాలీ అథారిటీ, మహారాష్ట్రలో ఏర్పాటయిన బోర్డు కూడ దాదాపు ఇందులో ఉద్దేశించినట్టివే. ఆంధ్రప్రదేశ్ లోనూ వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి కోసం మండలాలు ఏర్పాటయిన సంగతి తెలిసిందే.

భారత దేశంలో ప్రాంతీయ వ్యత్యాసాలను ప్రణాళిక సంఘం గుర్తించింది. రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రాంతీయాభివృద్ధి తన లక్ష్యంగా ప్రకటించింది.

1964లో భారత-సోవియట్ సహకారంతో తయారుచేసిన తమ పుస్తకంలో డా॥ సేన్‌గుప్తా, డా॥ గలినసస్క్యూక్ రాయలసీమ "భారత దేశంలో ప్రకృతి సిద్ధంగా ఏర్పాటయిన ప్రాంతం" అని పేర్కొన్నారు.

ఆంధ్రప్రదేశ్‌లోని రాయల సీమకు భారతదేశంలోనే తనకంటూ ప్రత్యేకమయిన చరిత్ర ఉంది. సంస్కృతి వుంది. తొలి తెలుగు మానవ నివాస స్థలం రాయలసీమ అని చరిత్రకారులు తెలియజేస్తున్నారు. తుంగభద్ర, పెన్నానదీ పరివాహక ప్రాంతాల్లో తెలుగు బాషపుట్టి పరిమళించినట్టుగా భాషా శాస్త్రజ్ఞులు తమ పరిశోధనల్లో వెల్లడి చేస్తున్నారు.

విజయనగర రాజుల కాలంలో రాయలసీమ వైభవం ప్రపంచ ప్రఖ్యాతి గాంచింది. 1443లో విజయనగర సామ్రాజ్యాన్ని సందర్శించిన అబ్దుల్ రజాక్ "ఈ ప్రాంతం జన సాంద్రతతో క్రిక్కిరిసి వ్యవసాయపు సాగుతో వైభవంగా ముురిసిపోతున్నట్టు"గా అభివర్ణించినారు. ఇంకా ఇటలీకి చెందిన నికలోకాంటి, పోర్చుగల్ దేశీయుడయిన ప్యాన్ మొదలయిన వారు ఈ ప్రాంతాన్ని సందర్శించి ఇక్కడి పరిస్థితిని వ్యావసాయిక, నీటి పారుదల స్థితిగతులను ఎంతగానో ప్రస్తుతించినారు.

విజయనగర రాజుల తర్వాత అధికారం లోకి వచ్చిన రాజులెవ్వరూ కొత్తగా నీటి పారుదల పథకాలను చేపట్టలేదు. జనాభా పెరిగింది. అడవుల నిర్మూలన పెద్ద ఎత్తున మొదలయింది. వ్యవసాయ పద్ధతులు లోపభూయిష్టంగా తయారయినాయి.

తూర్పు ఇండియా కంపెనీ పరిపాలనా కాలంలో రైతాంగ పరిస్థితి మొత్తంమీద అధ్వాన్న పరిస్థితికి నెట్టి వేయబడింది. రాయలసీమ రైతాంగ పరిస్థితిని అర్థం చేసుకున్న మన్రో "కంపెనీ పాలన కింద వున్న ప్రాంతాల న్నింటిలో దత్తమండలాల ప్రజలే కడు బీదవారు" అన్నాడంటే రాయలసీమ ఆనాటికే ఎంతగా వెనకబడి పోయిందో అర్థం చేసు కోవచ్చు. మన్రో పరిశీలన ప్రకారం "అనువయిన ప్రతిచోటా ఈ ప్రాంతంలో చెరువులు, జలాశయాలు నిర్మించ బడ్డాయని, కొత్తగా వాటి ఏర్పాటు గూర్చి ఆలోచన చేయటం వృథా". ఆనాటి కడపజిల్లా ప్రధాన రెవిన్యూ అధికారి గ్రిబ్బిల్ ప్రకారం 3,574 చ.మై. విస్తీర్ణం గల కడప జిల్లాలో 4,194 పెద్దా, చిన్నా చెరువులు వున్నట్టుగా పేర్కొన్నాడు. ఒకనాడు రతనాల సీమగా వైభవోపేతంగా వెలుగొందిన ఈ ప్రాంతం 19వ శతాబ్దాంతానికి వలస పాలన వల్ల కోస్తా ఆంధ్రతో పోలిస్తే ఎంతగానో వెనుకబడి పోయింది. బ్రిటిషువారు తమ పెట్టుబడులను ఆంధ్రప్రాంతంలో కృష్ణ, పెన్నా, గోదావరి డెల్టాలలో ఆనకట్టల నిర్మాణంలో ఖర్చుపెట్టటం వల్ల ఆ ప్రాంతం వ్యవసాయకంగా అభివృద్ధి గావటానికి తోడ్పడింది. రాయలసీమలో 1870లలో కడప-కర్నూలు కాలువను రవాణా, నీటిపారుదల రెండింటికి ఉద్దేశించి నిర్మాణం ప్రారంభించినా అనేక అవకతవకల వల్ల నిర్మాణం పూర్తి కాలేదు. 1882 నాటికి పూర్తిచేసినారు. ఈ కాలువను

ప్రధానంగా రవాణాకు ఉద్దేశించటం వల్ల దీనికింద వ్యవసాయం అభివృద్ధి కాలేదు. కోస్తా ప్రాంతంలో నీటి పారుదల సౌకర్యాలు అభివృద్ధి కావడంవల్ల అక్కడ కరువు తీవ్రత తగ్గి, రాయలసీమ రైతాంగ జీవితంలో కరువులు అంతర్భాగమై పోయినాయి. గత శతాబ్దంలో వచ్చిన 30 పైగా కరువులు రాయలసీమ జీవనాడులను కృంగదీసినాయి. 1878, 1899నాటి ఫామిన్ కమిషన్ సూచనలను నాటి ఆంగ్ల పాలకులు బుట్టదాఖలా చేసినారు. ఆ కారణంగా మద్రాసు రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలతో పోలిస్తే సమస్త రంగాలలోను వెనుకబడి పోయిన రాయలసీమ కరువు కాటకాలకు నిలయమై ఇతరుల దయా దాక్షిణ్యాల మీద ఆధారపడ వలసిన పరిస్థితికి నెట్టివేయబడింది. రాయలసీమ దక్షిణ భారతదేశంలో కరువు ప్రాంతంగా మారిపోయింది.

మొత్తం 276.70 లక్షల హెక్టార్ల వైశాల్యం వున్న ఆంధ్రప్రదేశ్‌లో రాయలసీమ వైశాల్యం 75.30 లక్షల హెక్టార్లు.

ఆంధ్రప్రదేశ్ మొత్తం మీద క్షామ పీడిత ప్రాంతంలో 4.5 మిలియన్ హెక్టార్ల సాగు భూమి వుంటే అందులో 3 మిలియన్ హెక్టార్లు రాయలసీమలోనూ 1.5 మిలియన్ హెక్టార్లు తెలంగాణాలోనూ వుంది. దేశం మొత్తం మీద వున్న క్షామ పీడిత ప్రాంతాలు 99గా ప్రభుత్వం గుర్తించి ప్రకటించిందిం. వాటిల్లో 7 జిల్లాలు ఆంధ్రప్రదేశ్‌వి. ఇందులో నాలుగు రాయలసీమ జిల్లాలు. తక్కిన మూడు తెలంగాణా జిల్లాలు. ఆంధ్రప్రదేశ్‌లోని క్షామ పీడిత ప్రాంతాల్లో ప్రధాన భాగం రాయలసీమ. క్షామం ఏర్పడిన తర్వాత దాని ముందు 'వెనుకబాటుతనం' అనే మాట ఎందుకూ పనికి రాదు. ఇవ్వాళ రాయలసీమలో నిరంతర క్షామం కొనసాగుతోంది. ప్రతి రెండేళ్లకు ఒక్క మారు రాయలసీమలో కరువు కాటకాదులు రాజ్యమేలుతున్నట్టుగా ప్రభుత్వాధికారులే అంగీకరిస్తున్నారు. కరువు మీద కరువొచ్చి పడుతున్న దంటే ఆ ప్రాంతంలో ఎడారి పొంచి వుందన్నమాట.

కరువంటే ఏమిటో వివరించాలా? నిలువ నీడలేక పోవటం, కట్టుబట్టలేక పోవటం కరువుకాదు. తినడానికి పిడికెడు మెతుకులు లేకపోవటమే అసలు సిసలయిన కరువు. నిండు జీవితాలను నిట్ట నిలువునా మృత్యుముఖంలోకి పడనెట్టే వైపరీత్యమే కరువు. తిండిగింజలకు విపరీతమయిన కొరత ఏర్పడి, కొనడానికి డబ్బులేక, డబ్బున్నా కొనడానికి ఏమీలేక, జనసామాన్యానికి బతుకు దుర్భరమై, చివరికి ప్రాణనష్టం సంభవించే దుస్థితే - కరువు.

"మాటి మాటికి కరువులు వచ్చిపడే ప్రాంతం పేదరికపు విషవలయంలో అల్లాడవలసి వస్తుంది. ప్రజల జీవన విధానం వెనుకబడి పోతుంది. వెనుకబడిన తనం సాంప్రదాయమూ, వారసత్వమూ అయిపోతాయి. ఆ ప్రాంతం కేవలం ఆహారంలోనే కాదు, సామాజికంగా, సాంస్కృతికంగా కూడ వెనుకబడి పోవలసి వస్తుంది."

వ్యవసాయ వుత్పత్తులు పడిపోవటం కరువుకి తొలి లక్షణం. గ్రామాల్లో ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తమవుతుంది. సేద్యం ఏ మాత్రం లాభదాయకంగా వుండదు. నాగళ్లు మూలపడతాయి. కొడవళ్లు చిలుంపట్టి అటకెక్కుతాయి. చేద్దామని వుబలాటపడినా పని వుండదు. కరువు ఇనుప గజ్జెలతో పాదం మోపిందనటానికి ఇదే ప్రబల నిదర్శనం. నరమానవులకు ఇట్లా కష్టాలు మొదలయ్యిన తరుణంలో, పాడి పశువులు గ్రాసం లేక బక్క చిక్కి పది గడ్డిపరకల కోసం మైదానాలు వదలి కొండలమ్మట, బోదె తుప్పలమ్మటా తచ్చాడుతున్నాయంటే ప్రజల ఆశలు కొండెక్కుతున్నాయన్నమాటే! రెక్కాడని ఫలితంగా డొక్కాడని బీదా చిక్కి పట్టెడన్నం కోసం పరాయి ప్రాంతాలకు తరలి పోతున్నారంటే ఆ సీమ కరువు తల్లికి నిలయమయిందని అర్థం. గుక్కెడు మంచి నీళ్లు దొరక్కనే, వారం పదిరోజులయినా పట్టెడన్నం నోట పడకనే ఒక మనిషి కుప్పకూలి కన్ను మూసాడూ అంటే ఆ ప్రాంతంలో కరువు దేవత నిశ్శబ్దంగా వికటాట్టహాసం చేస్తున్నదని తాత్పర్యం.

ఒక కరువునుండి బయట పడీ పడకనే మరో కరువు ముట్టడి చేస్తున్న రాయలసీమ జనజీవితాన్ని వర్ణించ నలవి కాదు. ఆ భీభత్సం అంతా ఇంతా కాదు. ఆర్థికంగానే కాదు కరువు ప్రజల్ని మానసికంగా కృంగదీస్తున్నది. కరువు నోటబడి కోలుకున్నా పనిమీద మునుపటి వుత్సాహం, చురుకుదనం, చొరవ వుండటం లేదు. విధి మీద నమ్మకం పెరిగిపోతున్నది. ఆకలి చావులు సర్వవ్యాప్తం కాకపోయినప్పటికి, కరువు వాత బడిన ప్రజల జవసత్వాలు దెబ్బ తింటా యనటంలో ఏ మాత్రం సందేహం లేదు.

"మాటి మాటికి కరువులు వచ్చిపడే ప్రాంతం పేదరికపు విషవలయంలో అల్లాడవలసి వస్తుంది. ప్రజల జీవన విధానం వెనుకబడి పోతుంది. వెనుకబడిన తనం సాంప్రదాయమూ, వారసత్వమూ అయిపోతాయి. ఆ ప్రాంతం కేవలం ఆహారంలోనే కాదు, సామాజికంగా, సాంస్కృతికంగా కూడ వెనుకబడి పోవలసి వస్తుంది."

సరిగ్గా రాయలసీమ పరిస్థితే ఇది. రాయలసీమ వెనుకబటుతనాన్ని తరిమికొట్టాలంటే భారీ నీటి పారుదల పథకాలను చేపట్టటం మినహా మరో మార్గం లేని పరిస్థితి ఏర్పడింది. ఏ ప్రాంతంలోని మనిషికయినా, అతని మనుగడకయినా నీరే ప్రాణాధారం. నీరు నాగరికతకు, సంస్కృతికి చిహ్నం. ఏ ప్రాంతంలోనయితే నీటి సమస్య వుండదో ఆ ప్రాంతం సాంస్కృతికంగాను, ఆర్థికంగాను ఎదగగలదు, ముందుకు పోగలదు. మొదట నీటి సమస్య పరిష్కారమయయితే తక్కినవన్నీ ఆ తర్వాత వుండనే వుండవు. అపార ఖనిజ సంపద కలిగి రత్నగర్భగా గణుతి

కెక్కిన సీమ పారిశ్రామికంగా ముందుకు ఎదగాలన్నా నీరు తప్పనిసరి. నీటితో నిరుద్యోగమూ తీరుతుంది.

రాయలసీమలోని కృష్ణ, తుంగ భద్ర, పెన్నా, ఇతర చిన్న నదులద్వారా లభ్యమవుతున్న మొత్తం వుపరితల నీరు 167 శతకోటి ఘనపుటడుగులు. రాయలసీమలోని నాలుగు జిల్లాల భూగర్భ నీరు 216 శతకోటి ఘనపుటడుగుల వరకు వుంటుందని ఆంధ్ర ప్రదేశ్ భూగర్భ జల విభాగం అంచనా వేసింది. అన్ని సాధక బాధకాలు పోగా మొత్తం రాయలసీమ ప్రాంతంలో వుపరితల, భూగర్భ నీటి వనరులను కలుపుకుని సుమారు 275 శత కోటి ఘనపుటడుగుల నీరు లభ్యమవు తుందని అంచనా. తాగేందుకు, తదితర అవసరాలకు పోగా ఈ నీరు 75 లక్షల ఎకరాల సాగు భూమి అవసరాలను తీర్చటానికి ఏ మాత్రం సరిపోదు. ఈ 75 లక్షల ఎకరాల సాగు భూమిలో 69.6 లక్షల ఎకరాలు క్షామ పీడిత ప్రాంతంగా గుర్తించబడింది. ఇందులో సుమారు 14 లక్షల ఎకరాలకు నీటి వసతి కల్పించబడింది. ఇంకొక 5 లక్షల ఎకరాలకు వివిధ పథకాల ద్వారా నీటి వసతి కల్పించబడుతున్నది. ఇది పోను 52.5 లక్షల ఎకరాల భూమికి నీటి పారుదల ఏర్పాటు చేయవలసి వుంటుంది. సాంకేతిక ఇబ్బందులు పోను 35 లక్షల ఎకరాల సాగు భూమికి సేద్యపు నీరు అందజేయవలసి వుంటుందని ఇంజనీర్ల తీర్పు. అంటే ఈ భూమికి సంవత్సరానికి కనీసం ఒక్క మెట్ట పంటకు నీరు అందివ్వాలన్నా 350 శతకోటి ఘనపుటడుగుల నీరు అవసరమవుతుంది.

ఆంధ్రప్రదేశ్‌కు కేటాయించిన మొత్తం 2746 శత కోటి ఘనపుటడుగుల నీటిని రాష్ట్రంలో మూడు ప్రాంతాల మధ్య సాగు భూమి ప్రతిపాదికగా పంచినట్టయితే రాయలసీమకు తనవాటాగా 72.5 శతకోటి ఘనపుటడుగుల నీటిని కేటాయించవలసి వుంటుంది. ఇప్పుడు వినియోగంలో వున్న 257 శతకోటి ఘనపుటడుగుల నీటిని మినహాయిస్తే 75 శాతం అసలు వుపరితల నీటిలో రాయలసీమకు ఇంకా 466 శతకోటి ఘనపుటడుగుల నీరు ఇవ్వవలసి వుంటుంది.

రాయలసీమ నీటి అవసరాలను తీర్చటానికి కృష్ణ ఒక్కటే ప్రధానమయిన ఆధారం. భౌగోళికంగా కూడ తక్కువ ఖర్చుతో సీమకు నీటి పారుదల సౌకర్యం కల్పించటానికి కృష్ణ ఒక్కటే అనువయిన వనరు. ఈ నిజాన్ని సాంకేతిక నిపుణులు, ఇంజనీర్లు, ప్రభుత్వాధికార్లు, సామాన్య ప్రజానీకం అందరూ అంగీకరిస్తున్నారు. రాయలసీమ వెనుకబాటుతనాన్ని పరిశీలించి పరీక్షించిన ప్రతిఒక్కరూ సంఘాలూ, కమిటీలు ఈ అభిప్రాయాన్నే వ్యక్తం చేసినారు.

1901లో సర్‌కోలన్ సి.స్కార్ట్ అధ్యక్షతన ఏర్పాటయిన భారత నీటి పారుదల కమీషన్ తుంగభద్ర జలాల ద్వారా రాయలసీమలో 16 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలను కల్పించే మెకంజీ మహత్తర పథకాన్ని అమలు చేయమని ప్రభుత్వానికి సిఫారసు చేసింది. మెకంజీ పథకం గూర్చి సీమ ప్రజానీకం ఆశలు పెంచుకున్నది. అయినా కరకు గుండెల బ్రిటీషు ప్రభుత్వం ఖాతరు చేయలేదు. 1927లో మద్రాసు ప్రభుత్వం రాయలసీమ జిల్లాలకు ప్రత్యేకంగా "దత్త మండలాల నీటి పారుదల కమీషన్"ను నియమించింది. ఈ సంఘం "ఐర్లండ్" అనే ఇంజనీరు రూపొందించిన తుంగభద్ర - కృష్ణ ప్రాజెక్టును, సిద్దేశ్వరం ప్రాజెక్టును వెంటనే చేపట్ట వలసిందిగా ప్రభుత్వానికి సిఫారసు చేసింది. రాతి గుండెల తెల్లదొరలు ఈ పథకాన్ని అమలు చేయలేదు. కృష్ణానది మీద సిదేశ్వరం రిజర్వాయరును నిర్మించి 7 లక్షల ఎకరాలు సీమలో సాగులోకి తీసుకురావాలని 1952లో సంయుక్త మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం కృష్ణ - పెన్నార్ ప్రాజెక్టు పథకంలో సూచించినారు. కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టుకు ప్రత్యామ్నాయంగా కె.సి.కెనాల్‌లో మార్పులు చేసి 6000 క్యూసెక్కుల నీటి సరఫరాకు సరిపోయేట్టుగా దాన్ని మార్చాలని, కృష్ణ మీద +270 మీ (+886)ల రిజర్వాయర్ లెవల్‌తో సిద్దేశ్వరం డ్యాంను నిర్మించాలని 1953లో శోస్లా కమిటీ సిఫారసు చేసింది. మొద్దుబారిన బండ ప్రభుత్వం దీన్ని అమలు చేయలేదు. అటు తెల్లదొరల పాలనలోనయితే నేమి, ఇటు నల్ల దొరల పాలనలోనయితే నేమి సీమ బతుకుల్లో మార్పేమీ లేదు.

అమాట కొస్తే 1937లో కోస్తా, రాయలసీమ నాయకుల మధ్య కుదిరిన శ్రీభాగ్ ఒప్పందంలో కూడ రాయలసీమ నీటి సమస్యను ప్రధాన సమస్యగా గుర్తించినారు. "సీమ సత్వరాభివృద్ధికై పదేళ్ళు అవసరమయితే అంతకుమించి నీటి పారుదల పథకాలకు ప్రాధాన్యత నిచ్చి అమలు జరపాలి. ముఖ్యంగా ఈ ప్రాంతంలో తుంగభద్ర, కృష్ణ, పెన్నానదుల నీటి వినియోగానికి సంబంధించిన పథకాల పైన, పెద్ద ప్రాజెక్టుల పైన పదేళ్ళ పాటు ప్రత్యేక శ్రద్ధ పెట్టి అమలు జరపాలి."

శ్రీభాగ్ ఒప్పందం కాగితపు మడతల్లో చిరిగిపోయిన అనుభవం సీమ వాసులది. ఈ ఒప్పందం అమలు కాకపోవటంతో సీమ వెనుకబాటు తనం మరింత దుస్థితిలోకి నెట్టివేయబడింది.

రాయలసీమ కరువును పారద్రోలి వెనుకబాటుతనాన్ని నిర్మూలించటానికి ఈ ప్రాంతంలో ఇంకెన్నో ప్రయోగాలు జరిగినాయి. 1938లో రాజాజీ ప్రభుత్వం "ఫామయిన్‌కోడ్ రివిజన్ కమిటీ"ని వేసింది. ఇది రాయలసీమలో కరువును పారదోల

(తరువాయి 52వ పేజీలో)

*"సీమ సత్వరాభివృద్ధికై పదేళ్ళు అవసరమయితే అంతకుమించి నీటి పారుదల పథకాలకు ప్రాధాన్యత నిచ్చి అమలు జరపాలి. ముఖ్యంగా ఈ ప్రాంతంలో తుంగభద్ర, కృష్ణ, పెన్నానదుల నీటి వినియోగానికి సంబంధించిన పథకాలపైన, పెద్ద ప్రాజెక్టుల పైన పదేళ్ల పాటు ప్రత్యేక శ్రద్ధ పెట్టి అమలు జరపాలి."*

# అనారోగ్య పర్వం

"జాతస్య మరణం ధృవం" అన్నారు పెద్దలు. పుట్టినవాడు చావక తప్పదు. అతను పోయే వరకూ రోగాల్లేకుండా, ఆరోగ్యంగా బ్రతకాలని అందరూ కోరుకుంటారు. సాధారణంగా "ఆరోగ్యం" యొక్క విలువ అవి పోయినప్పుడే అర్థమవుతూంటుంది.

"కేవలం రోగాలు లేకుండుటమే కాదు. శారీరక, మానసిక, సామాజిక స్వాస్థ్యము ఉండటమే ఆరోగ్యమంటే" అని ప్రపంచ ఆరోగ్య సంస్థ చెప్పి చాల సంవత్సరాలైంది. ఈ "స్వాస్థ్యాలే"ంటో జనానికి అర్థం కావటం లేదు. రోజూ రోగాల్లో పుడుతున్నారు. రోగాల్తో పెరుగుతున్నారు. రోగాల్తో చనిపోతున్నారు. అందుకని "రోగాలు లేకపోతే ఆరోగ్యంగా ఉన్నట్లే లెక్క" అని జనం అనుకుంటు న్నారు. దీనికి వాళ్ళను తప్పు పట్టి ప్రయోజనం లేదు. నాలుగు దశాబ్దాల స్వాతంత్ర్యాన్ని నిలదీయాలంటే తిండి, మంచినీళ్ళు, పరిసరాల పరిశుభ్రత లోపించిన కారణంగా వచ్చే రోగాలే నూటికి 80 పైగా ఉన్నాయి దేశంలో. దేశంలో రోగాల విశ్వరూపం 1వ పట్టికలో చూడవచ్చు.

1987 లెక్కల ప్రకారం

| రోగం పేరు | రోగుల సంఖ్య |
|---|---|
| కలరా | 11,423 |
| రక్త విరేచనాలు | 87,41,081 |
| నీళ్ళ విరేచనాలు | 13,38,594 |
| మలేరియా | 16,63,284 |
| కుష్టు | 32,06,594 |
| సుఖరోగాలు | 4,66,512 |
| కంఠసర్పి | |
| కోరింత దగ్గు | 2,01,730 |
| ధనుర్వాతము | |
| నూగులమ్మ | 2,28,166 |
| పోలియో | 23,021 |
| క్షయ | 8,89,525 |
| టైఫాయిడ్ జ్వరం | 3,32,281 |
| ఫ్లూ జ్వరం | 41,19,996 |

లెక్కలకు ఎక్కని జబ్బులు ఇంకెన్నో.

ఇంతకీ ఆరోగ్యం కోసం ప్రభుత్వం పెట్టే ఖర్చు 'పెట్టుబడి'గా భావించ బడ్తుందా? భారంగా భావించ బడ్తుందా?

'ఆరోగ్యం' యెడల ప్రభుత్వం అవలంబించే "దృక్పథం" లోనే అసలు లోపముందనిపిస్తుంది.

**ప్రభుత్వం వైపునుంచి**

(1) జనం ఆరోగ్యంగా ఉంటే 'రోగం' పేరుతో పనులు ఎగగొట్టే వాని సంఖ్య తగ్గటానికి పునాదన్నా ఉంటుంది. ఆరోగ్యంగా జనం ఉంటే శ్రమ చేయగల్గుతారు. శ్రమ చేస్తే సంపద పెరుగుతుంది. అందుకే "ఈసురోమని మనుషులుంటే దేశ మేగతి బాగు పడునోయ్" అన్నాడు గురజాడ.

కాని ప్రభుత్వం ఆరోగ్యం కోసం కేటాయించే మొత్తం రోజు రోజుకూ తగ్గిపోతుంది.

చివరి నాలుగు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆరోగ్యానికి సంబంధించిన అంశాలు.

(2) ఇంకో ముఖ్యమైన సమస్య చూద్దాం.

"చిన్న కుటుంబము దేశాభివృద్ధికి దారి తీస్తుందా"? లేదా "దేశాభివృద్ధి చిన్న కుటుంబానికి దారితీస్తుందా?" అనేది

"చిన్న కుటుంబమే దేశాభివృద్ధికి దారి తీస్తుంద"ని ప్రభుత్వానికి సలహాలిచ్చే తాత్విక పండితులు భావించారు. వారి సలహాల ననుసరించి "కుటుంబ నియంత్రణ" ఒక మంత్రంలాగా మారింది.

"ఇద్దరు లేక ముగ్గురు చాలు" అన్నారొకప్పుడు.

**పట్టిక – 1**

| పంచవర్షప్రణాళిక | మొత్తం బడ్జెట్‌లో "ఆరోగ్యం" వాటా |
|---|---|
| 1వ పంచవర్షప్రణాళిక | 3.3% |
| 2వ పంచవర్షప్రణాళిక | 3.0% |
| 3వ పంచవర్షప్రణాళిక | 2.6% |
| 4వ పంచవర్షప్రణాళిక | 2.1% |
| 5వ పంచవర్షప్రణాళిక | 1.9% |
| 6వ పంచవర్షప్రణాళిక | 1.9% |
| 7వ పంచవర్షప్రణాళిక | 1.9% |

7వ పంచవర్ష ప్రణాళిక 'ఆరోగ్యం' మీద పరిశోధనకు పెట్టే ఖర్చు కూడా నికృష్టంగానే ఉంది.

**పట్టిక – 2**

| | |
|---|---|
| రక్షణ వ్యయం | 37% |
| అంతరిక్షం | 17% |
| అణుశక్తి | 10% |
| విద్య (UGC) | 2% |
| ICMR (వైద్య పరిశోధన మండలి) | 2% |
| గ్రామీణాభివృద్ధి | 0.1% |

"మేము ఇద్దరం. మాకిద్దరు" అనమన్నారు.

"ఆడపిల్ల అయినా మగబిడ్డ అయినా" ఒకరే చాలు" అనమంటున్నారు. ప్రణాళికల తర్వాత ప్రణాళికకు కుటుంబ నియంత్రణ కోసం పెట్టే ఖర్చు పెరిగిపోతూనే ఉంది. కాని జనాల సంఖ్య గత 20 సంవత్సరాలుగా

స్థిరంగా 1000కి 33గా ఉన్నది. కుటుంబ నియంత్రణ ఖర్చు పెరిగి పెరిగి 7వ పంచవర్ష ప్రణాళిక వచ్చేసరికి "ఆరోగ్య బడ్జెటంత" అయింది.

గ్యారంటి యివ్వటం లేదు.

- ఈ కుటుంబాల్లో ఒక్కోబిడ్డ ఇంట్లో "జమ" అయ్యారంటే అదనంగా ఆదాయం పెరిగినట్లే. చిన్న పిల్లవాడు కూడా "శ్రమ" చేసి వాడి తిండి వాడు

పట్టిక - 3

| పంచవర్ష ప్రణాళిక | కుటుంబ నియంత్రణ ఖర్చు మొత్తం (కోట్ల రూపాయలలో) | మొత్తం బడ్జెటులో శాతం |
|---|---|---|
| 1వ పంచవర్ష ప్రణాళిక | 0.1 | --- |
| 2వ " | 5.0 | 0.1% |
| 3వ " | 27.0 | 0.3% |
| 4వ " | 285.0 | 1.8% |
| 5వ " | 497.04 | 1.3% |
| 6వ " | 1429.2 | 1.3% |
| 7వ " | 3256.0 | 1.8% |

జనంలో తీసుకున్న అభిప్రాయ సేకరణ సారాంశం చూద్దాం.

మధ్య, పై స్థాయి ఆర్థిక స్తోమత కల్గినవారు కుటుంబనియంత్రణను బాగా అంగీకరిస్తున్నారు. ఎందుకని?

ఇద్దరు పిల్లలకే పరిమితం చేసుకొన్నా, ఆయిద్దరూ రోగాల బారి పడి చనిపోకుండా "ఆరోగ్యాన్ని" కొనగలిగే స్థాయి ఉంది వాళ్ళకు.

- అభివృద్ధిలో ఉన్న సుఖం వారికి తెలుసు. ఆ సుఖాన్ని పదిమందిని కని వారందరికీ పంచి, పలచన చేసి పిల్లలను క్రింది ఆదాయ వర్గాల్లోకి నెట్టటం వారికిష్టం లేదు. అందుకే ఇద్దరూ తప్పితే ఒక్కరికే కుటుంబాన్ని పరిమితం చేసుకోవాలను కొంటున్నారు.

తక్కువ ఆదాయం గల కుటుంబాలు అంతగా కుటుంబ నియంత్రనకు సుముఖంగా లేరు? ఎందుచేత?

- ఒక పిల్ల వానికి ప్రాణాపాయ రోగం వస్తే, ఆ రోగాన్ని నయం చేయించటం చాల ఖర్చుతో కూడుకున్న పని. ఇంతకంటే చాల తక్కువ ఖర్చులో "ఇంకొక బిడ్డ"ను కనగలరు. ఇకవేళ ఇద్దరు పిల్లలకే కుటుంబాన్ని పరిమితం చేసుకొంటే ఆ ఇద్దరినీ రోగాల బారి పడకుండా కాపాడుకోగల ఆర్థిక స్తోమత వీరికెటూ లేదు. ప్రభుత్వం కూడా అలాంటి

సంపాదించుకొంటాడు.

- అసలే పేదవాళ్ళు. ఉన్న ఆస్థిని పిల్లలంతా పంచుకొన్నందు వలన మరింత "పేద" అవుతారనే సమస్యా లేదు వీరికి.

ఇది గాక ప్రభుత్వం వైపు నుంచి కుటుంబ నియంత్రణ అమలు జరిగే తీరుకూడా విచిత్రంగా ఉంటుంది.

ఇక పిల్లల్ని ఎటూ కనలేని వయసు వారిని కూడా పట్టుకొని ఆపరేషన్లు చేసిన ఘటనలు కోకొల్లలు. మొత్తం మీద లెక్కకు వస్తుంది కాదా!

'పిల్లవానికి రోగం వచ్చింది బాగు చేయి మహా ప్రభో" అని ప్రైమరీ హెల్త్ సెంటర్‌కు వస్తే వాడికి వైద్యం చేయటం మాట అటుంచి, కుటుంబ నియంత్రణ గురించి ఉపన్యాసాలిస్తాడు డాక్టరు.

జిల్లా కేంద్రంలో, ప్రైమరీ హెల్త్ సెంటర్ల డాక్టర్ల సమావేశం నిర్వహించే డి.యం. హెచ్.ఓ. గార్కి "టార్గెట్స్" (ఎన్ని కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించావనే లెక్కలు) మీద ఉన్న శ్రద్ధ మరి దేనిమీదా ఉండదు.,

మొత్తం మీద అభివృద్ధి రాహిత్యము "కుటుంబ నియంత్రణ" యెడల ఉదాసీనం ప్రదర్శించటానికి దారితీస్తుంది.

'మహమ్మదీయులు అసలు కుటుంబ నియంత్రణకు వ్యతిరేకులు. హిందువులం మనమంతా యిలా తరిగిపోతే కొన్నాళ్ళకు హిందువులే మిగలరు" అనే హిందూ అభిమానులు కనపడుతూంటారు. కర్నూల్లో నిర్వహించబడిన పరిమితమైన, ఒక సర్వేలో ఒక విషయం స్పష్టమైంది. మధ్య, పై తరగతి ఆదాయ వర్గాల్లోని వారు మహమ్మదీయులైనా కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించు కొన్నారు. పేద తరగతి వాళ్ళు మహమ్మదీయులు, హిందువులూ అందరిలోనూ నిరాదరణ ఉన్నది. మినహాయింపులు ఒకటి అరా మాత్రమే.

పేదరికం తొలగించకుండా కుటుంబ నియంత్రణ జయప్రదం కాదు. పేదరికం తొలగించకుండా పేదరికం గీతను సర్దుబాటు చేసి పేదరికం గీత క్రిందగల వాళ్ల సంఖ్యను ప్రభుత్వం తగ్గించింది. అలా తగ్గించితే ఆ సంఖ్య 40% ఉన్నది. గ్రామాల్లో నెలకు 49 రూపాయలు. పట్టణాల్లో 56 రూపాయలు నెలకు రావటం పేదరికం గీతకు గీటురాయి అన్నారు. ఈ ఆదాయం రోజుకు రెండు టీలు తాగితే అయిపోతుంది. కాని ఇంతకు మించిన ఆదాయంగల వాళ్ళంతా ఆస్థిపరులన్న మాట? కాబట్టి వాస్తవానికి పేదవాళ్ళ సంఖ్య నూటికి 40 కంటే ఎక్కువుంటుంది. వీళ్ళంతా కుటుంబ నియంత్రణ అంటే పట్టించుకోరు. పట్టించుకోలేరు కూడా.

(3) "రోగానికి వైద్యం మిన్న రోగ నిరోధానికి సున్న" : రోగ నిరోధమని ప్రభుత్వం గుండెలు బాదుకొని అరపటమే గాని, పెట్టే ఖర్చంతా రోగాల వైద్యానికే చాలదు.

పెద్ద హాస్పిటళ్ళ నిర్మాణం కోసం, మందుల కొనుగోలు కోసం, పెద్ద పెద్ద పరీక్షా సాధనాలు కొనుగోలు కోసం, శస్త్ర చికిత్స సామాగ్రి కోసం, హాస్పిటల్ బిల్డింగుల కోసం, సిబ్బంది జీతాల కోసం - వీటికి సరిపోతుంది ఆరోగ్య బడ్జెట్అంతా. వీటిలో అన్నీ దాదాపు 'రోగానికి వైద్యం" భాగాలే.

(4) పల్లెటూళ్ళపై నిరాదరణ : అనేక రంగాలలో ప్రభుత్వం యొక్క నిరాదరణ కన్పిస్తూంటుంది. ఆరోగ్య రంగం కూడా ఈ వైఖరికి

మినహాయింపు కాదు. 80% జనం పల్లెటూళ్ళలో నివశిస్తూంటే 80% డాక్టర్లు పట్టణాల్లో ఉంటున్నారు. ఇదే వ్యత్యాసము హాస్పిటళ్ళ సంఖ్యలోను, పడకల సంఖ్యలోను స్పష్టంగా కన్పడుతుంది.

పడటం లాంటివి నివారించగల్గే కారణాల వలననే ఏటా 1,34,628 మంది చనిపోతున్నారు.

మలేరియాకు కారణమైన దోమలను 'జయించాం" అని రొమ్ము విరుచుకొని తిరిగేలోపే "డి.డి.టి"ని తిని మరీ దోమలు యిబ్బడి ముబ్బిడిగా తయారయ్యాయి. మలేరియా మరోసారి విజృంభించింది.

**పట్టిక – 4**

| విషయం | పట్టణాలలో | పల్లెల్లో | మొత్తం |
|---|---|---|---|
| జనాభా | 23.3% | 76.7% | 100% |
| హాస్పిటళ్ళు | 6732 (68.6%) | 3099 (31.4%) | 9831 (100%) |
| పడకలు | 492820 (84% | 93039 (16%) | 585859 100%) |

దేశంలో కోటిన్నర మంది క్షయ రోగులున్నారు. వారిలో 60 లక్షల మంది ప్రక్కవారికి జబ్బు అంటించగల స్థితిలో ఉన్నారు. ఏటా 5 లక్షల పైగా జనం కేవలం క్షయ రోగంతోనే చనిపోతున్నారు.

**విద్య :** ఆరోగ్యంగా ఉండటానికి ఆరోగ్య విద్య తోడ్పడుతుంది. ఆరోగ్య విద్య కావాలంటే ముందు విద్య ఉండాలి. విద్య ఎక్కువగా ఉన్న కేరళలో ఆరోగ్యం కూడా మెరుగ్గా ఉంది. కాని స్కూల్లో చేరిన పిల్లలు చివరి దాకా అకనీస చదువును కొనసాగించలేక పోతున్నారు.

**చేయటానికి పని ఉంటే** ఆదాయ ముంటుంది. ఈ ఆదాయంలో కొంత భాగాన్ని తిండికి, మరికొంత

5) ఆరోగ్యంగా జీవించడానికి ముందుగా సమకూర్చుకోవలసిన అవసరాలు కొన్ని ఉన్నాయి. అందులో తిండి, నీళ్ళు, పరిశుభ్రత, విద్య, పని ముఖ్యమైనవి.

తిండి సరిపడా ఉంటే "తిండి లేక వచ్చే రోగాలు" దూరమవుతాయి. ఆహారంలోని మాంసకృత్తులు రోగ నిరోధక రక్షక పదార్థాలు (యాంట్ బాడీస్) తయారు కావటానికి తోడ్పడ్తాయి. వీటిలో రోగ నిరోధక శక్తి పెరుగుతుంది. 1951 నుంచి 1987 వరకు పరిశీలిస్తే ఈ మాంసకృత్తుల వాడకం రోజు రోజుకూ తగ్గిపోతూ ఉన్నది. 50 కిలోల బరువుండే పెద్ద వాళ్ళు రోజుకు కనీసం 50 గ్రాములు మాంస కృత్తులు తినాలి. అదే ఎదిగే పిల్లలకు, 53 కిలోల బరువు పిల్లలు 20 గ్రాములు 10 కిలోల బరువు పిల్లలు 20 గ్రాములు రోజూ తినాల్సి ఉంటుంది. ఆహార లోపం వలన "మెరాస్మస్", "క్వాసియార్కర్", రక్త హీనత జబ్బు విటమిను లోపాలతో రేచీకటి, నంజు, రికెట్సు, స్కర్వీ మొదలగు జబ్బులు కూడా వస్తాయి.

మంచినీళ్ళ పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉన్నది. అసలు నీళ్ళే దొరకని గ్రామాలున్నాయి. పరిశుభ్రమైన నీళ్ళ గురించి మాట్లాడటం అనవసరం యిక.

పరిసరాల పరిశుభ్రత కూడా లోప భూయిష్టంగానే ఉన్నది. వరదలు, వడదెబ్బలు, చలిగాడ్పులు, తుఫానులు, కొండ చరియలు విరిగి

**పట్టిక – 5**

| సంవత్సరం | కాయధాన్యాల వాడకం రోజుకు గ్రాముల్లో | పప్పుధాన్యాల వాడకం రోజుకు గ్రాముల్లో |
|---|---|---|
| 1951 | 334 | 61 |
| 1961 | 400 | 69 |
| 1971 | 418 | 51 |
| 1981 | 416 | 38 |
| 1982 | 415 | 39 |
| 1983 | 397 | 40 |
| 1984 | 436 | 42 |
| 1985 | 416 | 38 |
| 1986 | 434 | 42 |
| 1987 | 430 | 36 |

**పట్టిక – 6**

| అంశం | గ్రామాల సంఖ్య | మొత్తంలో శాతం |
|---|---|---|
| మొత్తం గ్రామాలు | 5,57,137 | 100% |
| మైలు (1.6 కి.మీ) లోపు అసలు నీళ్ళు దొరకని గ్రామాలు | 1,57,895 | 28% |
| ఫ్లోరైడు, ఇనుము, అవణాలు ఎక్కువగా గల నీళ్ళు మాత్రమే దొరికే గ్రామాలు | 46,602 | 8.4% |
| కలరా, నారికురుపు మొదలగు జబ్బులు రాగల ప్రమాదమున్న నీరు దొరికే గ్రామాలు | 26,227 | 4.7% |
| పరిశుభ్రమైన నీరు కాకపోయినా, ఏదో ఒక నీరు మొత్తంమీద ఉందనిపించే గ్రామాలు | 3,26,353 | 58.9% |

పట్టిక – 7

| సంవత్సరం | 1-5 క్లాసుల్లో చేరుతున్న సంఖ్య (లక్షల్లో) | 6-10 క్లాసుల్లో చేరుతున్న సంఖ్య (లక్షల్లో) | మధ్యలో చదువు ఆపేస్తున్న సంఖ్య (లక్షల్లో) | మొదట చేరిన వారిలో, మధ్యలో ఆపేస్తున్నవారి శాతం |
|---|---|---|---|---|
| 1980-81 | 738 | 200 | 538 | 73% |
| 1981-82 | 761 | 219 | 542 | 70.7% |
| 1982-83 | 770 | 222 | 548 | 71.2% |
| 1983-84 | 811 | 248 | 563 | 69% |
| 1984-85 | 839 | 260 | 579 | 69% |
| 1985-86 | 865 | 281 | 584 | 67.5% |

చదువుకూ, ఇంకొంత మంచి వరిసరాల్లో యింటికోసం ఖర్చు పెట్టుకోగలరు. ఇవన్నీ తిరిగి ఆరోగ్యానికి దారి తీస్తాయి. ఇన్ని జాగ్రత్తలు తీసుకొన్నా రోగాలు వస్తే, రోగాలు వదిలించుకోటానికీ, అవిధంగా ఆరోగ్యం కొనుక్కోటానికీ తమ ఆదాయంలో యింకొంత కేటాయించుకోగలరు.

పట్టణ వాతావరణంలో పనులు ఉండాలంటే వివిధ పరిశ్రమలు, వృత్తులూ ఉండాలి.

పల్లెటూళ్ళలో పనులు ఉండాలంటే, ఆ పనులు చేసుకోవటానికి మూలాధారమైన భూమి ఉండాలి. ఒక్క మాటలో చెప్పాలంటే "సమగ్ర భూ సంస్కరణలు" అమలు చేయాలి.

అందువలన ప్రభుత్వ విధానాలే అనారోగ్య వర్యానికి బలమైన కారణాలుగా భావించాల్సి ఉంటుంది.

2000 సంవత్సరానికి అందరికీ ఆరోగ్యం అందించాలనే ప్రపంచ ఆరోగ్య సంస్థ నినాదానికి వత్తాసు పలికి "ఆ డిక్లరేషన్" మీద సంతకం పెట్టిన మన ప్రభుత్వము, మన విధానాలు "అందరికీ అనారోగ్యం" అందించే దిశలో ప్రయాణం చేస్తున్నాయని గుర్తించాల్సి ఉంటుంది.

డా॥ బ్రహ్మారెడ్డి

(48వ పేజీ తరువాయి)

టానికి కొన్ని ఖచ్చితమయిన ప్రతిపాదనలు చేసింది. 1941లో దత్త మండలాల అభివృద్ధి బోర్డు ఏర్పాటు అయింది. నిధులుగాని, అధికారంగాని లేని ఈ బోర్డు నామమాత్రంగా మిగిలి పోయింది. 1947ల రాయలసీమ అభివృద్ధి కమీషనర్‌గా వున్న శ్రీ పి.వి. సుబ్బారావుగారిని మద్రాసు ప్రభుత్వం ఒక క్రమబద్ధమయిన కార్యక్రమాన్ని రూపొందించమని నియమించింది. శ్రీ పి.వి. సుబ్బారావు గారి రిపోర్టులో తక్షణం చేపట్టవలసిన 96 ప్రతిపాదనలు వున్నాయి. నిధులు లేవనే సాకుతో ఈ ప్రతిపాదనలు వెలుగు చూడలేదు. 1954లో రాయలసీమ అభివృద్ధి కమీషనర్ శ్రీ యాగా పిచ్చిరెడ్డిగారు ఒక రిపోర్టును తయారు చేసినారు. ఈ ప్రతిపాదనలూ నిధులు లేక మురిగి పోయినాయి. రాయలసీమ అభివృద్ధి బోర్డు 1954లో రద్దయింది. రాయలసీమ అభివృద్ధికి పెద్ద గండిపడింది. సీమ ప్రజల నిరంతర ఆందోళన ఫలితంగా 1969లో తిరిగి రాయలసీమ అభివృద్ధి బోర్డు ఏర్పాటయింది. దీనికి శ్రీ బి.వి. సుబ్బారెడ్డిగారు అధ్యక్షులు. ఈ బోర్డు శ్రీయాగా వేణుగోపాలరెడ్డిగారి అధ్యర్యంలో "వెనుకబడిన ప్రాంతాల ప్రణాళిక అభివృద్ధి రాయలసీమ ప్రత్యేకాధ్యయనం" పేరిట మూడు వాక్యాలు ప్రచురించబడినాయి. ఇందులో రాయలసీమ సమగ్ర చిత్రపటం వుంది. సీమ అభివృద్ధికి గాను తగు సూచనలు, ప్రతిపాదనలు వున్నాయి. తిరిగి ఇంకొకరు చేయవసరం లేనంత పకడ్బందీగా కొనసాగింది వీరి కృషి. చాల కాకతాళీయంగా జరిగిన తమాషా ఏమిటంటే శ్రీ వేణుగోపాలరెడ్డిగారు ఇంతకు మునుపు సీమ అభివృద్ధి కోసం ఒక రిపోర్టు తయారు చేసిన శ్రీ యాగా పిచ్చిరెడ్డిగారి కుమారులు. వీరి కృషి కాగితాలకే పరిమితమయి పోయింది. ఆ తర్వాత రాయలసీమ అభివృద్ధి బోర్డు రద్దయి పోయింది. నిజానికి ఇంకా కమిటీల, సంఘాల, బోర్డుల అవశ్యకత ఏమీ లేదు. రాయలసీమకు సంబంధించిన సమగ్ర చిత్రం ప్రభుత్వం బల్ల మీద వుంది. సమస్య సీమ జనావళి గుండెల్లో రగులు కుంటూనే వుంది. వెనుకబడిన రాయలసీమ ప్రాంతం సమగ్ర ఆంధ్రప్రదేశ్‌లో ఒక భాగం. ఒక అవయవం. తన వాటాగా రాష్ట్ర బడ్జెట్టుగా చెందవల్సింది అందుతూనే వుంది. హక్కుగా తనకు రావాల్సి మాత్రం మిగిలిపోతూనే వుంది. ప్రభుత్వాల నిర్లక్ష్యం, చేతగానితనం వల్ల మాత్రమే రాయలసీమ వెనుకబడి పోతుందనటంలో ఏ మాత్రం సందేహం లేదు.

రాష్ట్రంలోని 2746 శతకోటి ఘనపుటడుగుల నీటి వనరులు ఇంకా పూర్తిగా వినియోగంలోకి రాలేదు. క్షామపీడిత, వెనుకబడ్డ రాయలసీమకు న్యాయం చేయటం కోసం రాష్ట్రంలో నీటి పారుదల విషయంలో వివిధ ప్రాంతాల మధ్య వున్న అసమానత్వాన్ని సరి దిద్దటం కోసం అంతర్గతంగా ప్రాధాన్యతలను సవరించి రాయల సీమ కరువు ప్రాంతాలకు కనీసపు అవసరాలను తీర్చేటందుకు ఇంకా అవకాశం వుంది. సీమకు నీరందే మార్గం రాజ మార్గంలా వుంది. స్తన్యం దక్కని శిశువులా రాయలసీమ అల్లాడి పోతున్నది. వెనుకబాటుతనం నిర్మూలించుకోవటానికి ప్రణాళికా రచన, వ్యూహాలు మాత్రమే కాదు ఆచరణ కావాలి ఈ దిక్కున సీమవాసులు పయనించిన నాడు సీమ వెనుకబాటుతనం పరిష్కరింపబడుతుంది. ఆ బాధ్యత సీమవాసులదే.

భూమన్




# స్వతంత్ర దేశం



**గొంగడి** కోలాటవేసుకొని ఒక్కొక్కటి కిలో బరువున్న తోలు చెప్పు లీడ్చుకుంటూ గొర్లమంద లేపటాని కెళ్తున్న గట్టయ్య "గట్టన్నా అట్లాగె" అన్న సుంకరి సాయిలు మాటలు విని ఆగాడు.

"ఏందే సాయన్న ఎందుకో పిలిత్తివి...?" అని వెనుకకు తిరిగాడు.

"దొర పిలుత్తండే నిన్ను." అన్నాడు సాయిలు.

"నాతోనేం పనే దొరకు...? అయితే మాయెపా..." అని సాయిలు వెంబడి దొరిల్లు చేరుకున్నాడు గట్టయ్య. కచ్చేరింట్లో పడక కుర్చీలో కూర్చున్న దొరను చూసి "దండాలు దొరా..." అన్నాడు గట్టయ్య.

దొర ప్రతి నమస్కారం చేయకుండానే

"ఏమిర గట్టు అంత మంచిగున్నావుర?" అన్నాడు.

"ఏం మంచిగనె ఇగ గట్లున్న దొర..." అన్నాడు గట్టయ్య.

"నీకేందిరో పెద్ద గొల్లోనివి. ఏందెమొ వేదాంతం మాట్లాడవట్టివి" వ్యంగ్యంగా అన్నాడు దొర.

"గా కారెడ్డా లెందుకేత్తరు గన దొర.. మంద లేపే యాల్లయతంది... నన్నెందుకు పిలిసింర్రో సెప్పకపోతిరి.."

"ఏం లేదుగని గాకుంట కొమ్ము సేండ్ల మందల పెట్టాలని.."

దొర పిల్చిన పని అర్ధమయింది గట్టయ్యకు. కాని డబ్బులు తీసుకోకుండా మందలు పెడితే దొరనుండి డబ్బులు వసూలు చేయడం కాని పనని గట్టయ్యకు తెలుసు. అందకే మెల్లగా అన్నాడు దొరతో.

"సేండ్ల మందలు మా పెడ్తంగాని దొర. నాయక్క పైసలు బాగక్కెరున్నయి. మంద బత్తెం కిందికి కొన్నయితే ముందు గియ్యంర్రి?

గట్టయ్య మాటలకు దొరకు కోపమొచ్చింది.

"ఏందిర గట్టు బాగ కావురమచ్చినాదిర. ఎనకట్నుంచి గట్లనే ఉందార. మొదలే పైనలియ్య మనవడితి వేందిర." అన్నాడు

"కాద్దొర కాలం ఎనుకటి తీరు గనే గిప్పుడుందా సెప్పుంర్రి. ఎనుకటగేమీది మోటర్లుండెనా? గిప్పుడుండె.. ఎనుకటిలవర్సె తీరుగనె గిప్పుడుందా సెప్పుంర్రి? ఎనుకట గొర్రెమాకె తిరుగుటానికెంత భూముండె. గిప్పుడన్ని పట్టాల్లేకుండిని. కాదా దొర" అన్నాడు గట్టయ్య.

ఆమాటలకు చిర్రుకొచ్చాడు దొర.

"నాకే కతల్జెప్పుతన్నావుర గొల్లోడ . బాగ మత్తచ్చిందిరా." కళ్ళెర్ర జేస్తూ అన్నాడు.

"ఏమో దొర... ఎండల్ల, ఆనల్ల, నాత్రిపగలు కట్టపడ్డా పొట్ట కెల్లుడే కట్టమయితంది. నా అసొంటోనికి మత్త త్తదాదొర" నెమ్మదిగా అన్నాడు.

"గొల్ల గాడిదికే గురిమరియాద లేకుంట మాట్లాడుతన్నవు. ఇన్ని రోజుల్నుంచి గిట్లనే మాట్లాడినావుర..." కుర్చీలోంచి లేస్తూ అన్నాడు దొర.

"నేనేమన్న దొర పైసలియ్యంర్రి మంద పెడత నన్నందుకే గంతగనం కోపానికి రావడితిరి... నీయక్క మీరయితే దినుసట్టిగనే ఇత్తంర్రా??" 'ఎడ్డిగొల్ల గాడ్దులు గూడ

బాగనే తెలిపి కచ్చింగ్రురర.. ఐతె మానాయెగని మంద పెడుతవా లేదా?"

"పైసలిత్తె మా పెడుత.."

"మొదలే ఇయ్యన్నాగ.."

"పైసక్కర బాగుంది దొర... ఇత్తనే మంచిది..."

తోక తొక్కిన పాములా బుస్సు బుస్సుమంటూ తిరుగుతున్నాడు దొర. గొర్లు కాసుకొని బ్రతికే గొల్లలు కూడా తనను ప్రశ్నిస్తున్నారని మండి పడుతున్నాడు. కళ్ళు చింత నిప్పుల్లా ఎర్ర బడినాయి. దొర అకారం చూసి కొంత జంకినా స్థిరంగానే వున్నాడు గట్టయ్య.

"సరె పోర గొల్లోడ. మీరు గా పడుసు పోరగాండ్ల బలం సూసుకొని మాట్లాడుతుండ్రుగాదుర. గీ బిర్రెన్ని రోజులుంటదో సూత్తపో... మీకు బుద్ధచ్చేటట్టు సెయ్యకుంటె, నా కాళ్ళ మీన పడెటట్టు సెయ్యకుంటే నా పేరు... దొరనేకాదు పోర.." అన్నాడు గట్టిగా.

"మాగ్గా రంపాట్కాలన్ని తెలువయిదొర. బీడువేయిన సేండ్ల మేసినందుకు మీరు మందలు వెట్టిచ్చుకుంట్రి... మరి మీ కుత్తగనే మందలు వెడితె మేమేందిని బతుకాల్నో సెప్పుండ్రి." అన్నాడు గట్టయ్య.

"పోరా కొడుక నీ సంగజ్జాత్త పోరా..." అని రుసరుసలాడుతూ లోపలికెళ్ళాడు దొర.

* * * *

వారం రోజుల క్రితం దొరతో జరిగిన సంభాషణ గూర్చి ఆలోచిస్తున్న గట్టయ్య "బా బా.." అని అరుస్తున్న గొర్రెల అరుపు విని లేచి కూచున్నాడు. ధోతి కంటుకున్న తడి మట్టిని చేతితో తుడుచుకున్నాడు. తూర్పు దిక్కు చూసాడు. తెల్లవారబోతుంది. గొంగడక్కన్నే వుంచి కట్టె చేతిలోకి తీసుకొని

"చొచ్చొ.. అయ్ అయ్.. నీ యవ్వ గొర్లు పాడుగాను.. దొడుకొడుతందాగుత లెవ్వు..." అంటూ దూరంగా పోతున్న గొర్లను మర్లేసాడు.

"అరె కొంరెల్లి.. బీరిగా పాలు పిండ్కుంర్డి. జెప్పున నేను సెంబట్క పొయ్యత్త.." అని మంద దగ్గరున్న కాలువకెళ్ళాడు. పని పూర్తి చేసుకొని వచ్చి గొంగడి భుజం పై వేసుకొని

"అరె బీరిగా కొంరెల్లి.. గొర్లా గమైతయి.. సూసుకుంటుండ్రి. సద్ది కట్టుకొని గంగన్ని తీసుకత్త..." అన్నాడు గట్టయ్య.

"సీయవ్వ.. నేను కావలుండ పో.. ఈ నేనే మంద కావలుండన్నా.." అన్నాడు పదేళ్ళ కొంరెల్లి.

"ఎవ్వలుంటేంది బిడ్డ.. ఉండు.. మనంద్ల మనం ఒగలకొగలం కాకుంటె ఇంకెవ్వల్జేత్తరు? రాజిగాడు పెండ్లాన్ని తోలుకొత్తనని అటేపాయె.. మూడెద్దులాయె ఇంకా రాపాయె.. కొత్త మురిపెం కొన్నెద్దులుంటది.. ఎంకటిగాని పెండ్లం బాగలేక అదు సక్కగత్త లేపాయె.." అన్నాడు గట్టయ్య కొంరెల్లిని బుదురకిస్తూ..

"ఐతె మాయెగని జెప్పన సద్ది కట్టుకరా..? కడుపులంత గావరగావరైతంది.. బాగ పొద్దెక్కె రాకుండకు.." అన్నాడు కొంరెల్లి.

"నాకూళ్ళెం పని బిడ్డ. జెప్ప జెప్ప నాలుగు బొక్కెండ్లు నీళ్ళు సేదుకొని నెత్తి మీద పోచకుంట.. ఇంతంత తినత్తె ఐపాయె... సుట్టుపక్కల సేండ్లు న్నయి. గొర్లు పడజిక్క పైలం.." అని కొంరెల్లితో చెప్పి

"ఎమాయెర బీరిగ పాలు పిండుదయిందార.." అన్నాడు

"ఐపేయిందే గట్టన్న" అని నాలుగు తెల్ల చెంబుల్లో పాలు తీసుకొచ్చి గట్టయ్య కిచ్చాడు బీరయ్య. ఆ చెంబులకు కట్టిన తాళ్ళతో కట్టెకు అటు రెండు, ఇటు రెండు తగిలించాడు గట్టయ్య. గొంగడి కోలాటం వేసి నెత్తిపై ఉంచుకొని కట్టెను భుజంపై పెట్టుకున్నాడు.

"పైలం పైలం" అని వాళ్ళకు హెచ్చరించి నాలుగడుగులేసినగట్టయ్య ఆగిపోయాడు, "అరే బీరప్ప గా ఉత్తరేని పండ్లపుల్లోటి పీకియ్యరా" అని దగ్గరున్న ఉత్తరేణి తుప్పను చూపాడు. బీరయ్య ఓ చిన్న తుప్ప పీకి ఆకులన్నీ తీసేసి వేరును గట్టయ్య చేతికిచ్చాడు. ఎడమ భుజంపై కట్టె పెట్టుకొని కుడిచేత్తో పుల్లతో పండ్లు తోముకుంటూ ఊరు దిక్కు నడుస్తున్నాడు గట్టయ్య. తన తండ్రులు, తాత కాలం నుంచి కూడా గొర్లకాపర్లుగానే బ్రతుకుతున్నారు. తన యాభై ఏళ్ళ గొర్లకాపరి జీవితాన్ని గూర్చి ఆలోచించుకుంటూ ఊరు చేరుకున్నాడు గట్టయ్య. మూడు పాల చెంబులు వాళ్ళ ఇండ్లలో ఇచ్చి తన చెంబుతో ఇంటికొచ్చాడు. పాలచెంబు భార్య వెంకమ్మ కందించి వాకిట్లో ఉన్న నులక మంచం వాల్చుకొని అందులో కూర్చున్నాడు. పండ్లపుల్ల మరీ చిన్నది కాగా దాన్ని విసిరిపారేసి "హాక్ థూ" అని కాండ్రించి ఉమ్మివేసాడు. మాసిన తెల్ల గడ్డంతో మంచంలో కూర్చున్న గట్టయ్యను చూసి వెంకమ్మ

"బావాజోని లెక్క ఎట్ల పాడయింది సూడా గడ్డం. గా మంగలోనింటికి పొయ్యి కొరిగిచ్చుకచ్చు కోలేవు" అంది

" ఉంటే మంటుంది తియ్యలేవె? ఓ దిక్కా నలుపడుతన్నయి. ఊరవు తల సేండ్లల్ల పంటె గడ్డముంటె ఎచ్చగుంటది. లేకుంటె మొకం పలుగుద్ది. ముసల్తనానికి దసల్రైకని గిప్పుడు గావన్నా సొకులు" అంటూ

"గిప్పుడెవ్వలన్న పిల్లనిచ్చేదుందా తియ్యలేవు" అని హాస్యమాడాడు.

"ఇత్తె సేసుకునేటట్టే వున్నవ్ గదా" అంది వెంకమ్మ.

"ఎనుభయేండ్ల ముసలోన్ని లగ్గం జేసుకుంటవా తాతంటె నాకిచ్చేటోళ్ళువ్వలన్నదంట. నా కరువయేండ్లన్న రాకనేపాయె" అని మంచంలో నడుం వాల్చాడు.

"ముసల్తనానికి మాటలు బానే నేర్తన్నవుగని ఏందెమొ పండవర్తివి? గానిలుకరాజనింటికి పొయ్యి ఓ సొంతాడు పట్టుకరాపో. తాడంత పొట్టు పొట్టు తెగింది" అంది వెంకమ్మ.

"నీ యవ్వ సాతనయిత లేదు గొదాగ లేవె. తెల్లందాక గొర్లు పాడుగాను లేసి లేసురుకుడు. అశొంగాని దోమ గొట్టుడాయె. కట్టెమీన్నే నిల్సుండి పంటె మంట్లె నిదురవడుతదా?"

"ఇగ గొల్లోడు కట్టెమీన గాకుంటె పట్టెమంచమ్మీన పంటడా? నూతిల బొక్కనేత్త తాడు తెగె తట్టున్నది. మెల్లె మెల్లెంగ పొయి తేపో"

"పొల్లగాల్లేదా అన్ని తోలలేవు" అలాగే పడుకొని అన్నాడు.

"జెండవందునమటియ్యల్ల. పొద్దుగాల్నే నన్నిల్లతోని పెయ్యిగడుక్కొని అంగిలాగు తొడుక్కొనురికిండు. నువ్వే పొయ్యితే" అంది వెంకమ్మ.

ఇక తప్పేట్టు లేదని లేచి గొంగడి కప్పుకున్నాడు గట్టయ్య.

"వహ తెత్తగని జెవ్వన బువ్వండు. పొద్దుగాల మందలేపాలె" అన్నాడు.

"పొయ్యిపాడుగాను ఎంతూదినా మండి సత్తలేదు. పిడుకలు తడిసి

నయ్. గాంచునూనె పోసంటు వెడుత నంటె ఎక్కల ముత్తెమంతే వుంది"

"అనరాక ముందు పిడుకల్దిసి ఇంట్ల పొయ్యద్దానె. పొయ్యిల కంది పొరుక పెట్ట పొయినవేంది?"

"గిన్ని రోజులున్నాది కంది పొరుక. ఎప్పుడో ఐపాయె. పిడుకలింట్ల పోత్తామంటె ఇంట్ల జాగేదుంది? ఉన్నెదు గజాలింట్ల అటు దిక్కు పెద్దావరాయె, ఇటు దిక్కు సుక్కురారపు దేవుడాయె. ఓ మూలకు ఎల్లవ్వతల్లాయె. ఇంకో మూలకు మైసవ్వ తల్లాయె. ఉన్నెక్క అర్రల్నెమొ వుల్లన్నదేవుడాయె. అందుక తినుటానికే కట్టంగావట్టె. గిన్నేండ్లవట్టి ఒక్క సిన్నిల్లన్న కట్టక పోతివి. గిది పెద్ద మనుషులిచ్చి పోయి నిల్లేనాయె. ఓ దిక్కు గూలి పోనే వట్టె" కొలుపులా చదివింది వెంకమ్మ.

"ఇగ నువ్వు నేరు తెరిత్తె కొలు బ్బెట్టినట్టె. నీయక్క. నేనేంజెయ్యన్నే. పొద్దుందాక, తెల్లందాక కట్టపడనే వడితి. గీ కట్టన్నమ్ముకొనే బతుక వడితి. ఎన్నొద్దుల్లేసినా గిట్లనే ఉండ వట్టిమి. ఇంకేం సంపాదించన్నే. దొంగ తనం గిట్ల సెయ్యన్నా సెప్పలేవు. రెక్కల కట్టంతోటి నలుగురాడి పొల్ల గండ్ల లగ్గాలు మనిషికి పదకొండు నగల (గ్రౌరెలు) అర్నమిచ్చి సేత్తి. గా ఒక్క మొగపోరడు పైకత్తె సాలు. గందుకనే అన్ని సదివిత్తన్న గాదె" తన నిస్సహాయతను వెళ్ళగక్కాడు గట్టయ్య.

"ఐతె మాయె పటు ఎట్లగావన్నే గట్టయితది. బువ్వ మా అందుత గని తాడు తేపో" అని ఇంట్లో కెళ్ళింది వెంకమ్మ.

గట్టయ్య హరిజన వాడ కెళ్ళి ఈతనారతో పేనిన తాడుతెచ్చాడు. దాని కున్న ముళ్ళన్నీ పీటతో రాకాడు. బావి దగ్గరకెళ్ళి బొక్కెనకున్న పాతతాడు విడిచి క్రొత్తతాడు కట్టాడు. బక్కెట్టుతో నీళ్ళు చేదుకొన్ని అక్కన్నే పెట్టాడు. దోసిలితో నీళ్ళు నోట్లో పోసుకొని హాక్ హాక్ అని ఉమ్మివేసాడు. ముఖం కడగడం అయిందని పించుకున్నాడు. తర్వాత నాలుగైదు బొక్కెండ్ల నీళ్ళు చేదుకొని నెత్తిపై నుంచి పోసుకున్నాడు. స్నానం కూడా అయిపోయింది. "గా ధోతిటియ్యే" అని కేకేసాడు. వెంకమ్మ కందుబట్టిన దొడ్డు ధోవతి తెచ్చి గట్టయ్య కిచ్చింది. దాన్ని విప్పి చూసాడు. చినిగుంది. మలిచి దగ్గరకు కట్టు కున్నాడు. బొక్కెంతో నీళ్ళు చేది విడిచిన ధోవతి నుతుకుతున్నాడు.

"సాకల్దాని కెయ్యలేవు, తెల్ల గుత్కుత్తది. ఎట్ల కందువట్టిందో సూడు" అంది వెంకమ్మ భర్త ప్రయత్నాన్ని చూసి.

"సాకల్దాని కేత్తె బండకేసు తుకుద్ది. జెప్పన్నే సినుగుద్ది. నాకు తుక్కోరాద తియ్యలేవు. ఇన్నేండ్ల వట్టుతుక్కుంటలేన, ఇయ్యల్లేమొ కొత్తగ జెప్పవడితివి" అని ధోతిని బొక్కెంల్లే ముంచి పైకి తీసాడు.

"కాపాయెం గట్టి కడుపులొట్టని ఎంత జేసినా ఏదే మాన్కలు గావట్టె. అంటూ ఇంట్లోకెళ్ళింది వెంకమ్మ.

ధోతిని పిండి పందిరిపై వేల్లాడేసి ఇంట్లోకొచ్చాడు గట్టయ్య. "ఈకెందు కంటవె నన్ను. నీకెరుక లేకుంట నేనేం దింటి సెప్పలేవె. నీయక్క అడోల్ల మాటలకు తోక తలకాయుండది" అని పొయ్యి దగ్గరున్న వెంకమ్మ దగ్గరి కెళ్ళి కూరుడికినాదె" అన్నాడు.

"ఏమెత్తి పోతంది కొద్దిగాగలేవు" కసురుకుంది వెంకమ్మ. పొయ్యి ముందక వంట జేయడానికి సతమతమౌతుం దామె.

"ఏందేమొ సిర్రుబుర్రులాడ వట్టివేమె. సెప్పితిగాదె పొద్దుగాల మంద లేపల్నని. పొద్దుందాక తిరుగంది కడు పులు నిండుత లెవ్వు"

"గడియ రికాము లేదు గవ్వ రాకల్లేదని బాగనే ఉండెవారం. ఎన్ని జేత్తేమత్తుంది? మొన్న సిటుకు రోగ వచ్చిరువై నగల్జచ్చె. సూదులే యించిండ్రా లేదా?" అంది పప్పుతెడ్డుతో రుద్దుతూ వెంకమ్మ.

"మా ఏయించినం. సూదులేసు టానికి మనిషికాభై తీసుకున్నడు డాకు దారి. సరుకారు డాకుటరని పేరేకని మళ్ళ పైసలిచ్చుడేనాయె"

"ఏదో తియ్యి సదువుకున్నోల్ల రాతలు మంచియి. కూసుంటె పైసలత్త యాల్లకు. మన సొంటోల్లు పైసమొకం సూడన్నంటెంత కట్టం" అంటు పప్పు ఎసుల దించింది వెంకమ్మ.

"అందుకనే మన పొల్లగాన్ని ఎంత కట్టపడ్డా పెద్ద సదువులు సది వియ్యాన్నే" అన్నాడు గట్టయ్య. చదువు కుంటే తన కష్టాలు ఈడేరుతాయన్న అమాయకత్వంతో.

కంచుతలెలో మొక్కజొన్న గడుక, పెసరుపప్పు వడ్డించింది వెంకమ్మ. గొంగడి ముద్దగా చేసి నేలపై వేసి దానిపై కూర్చున్నాడు గట్టయ్య. గిన్నెను ముందు కనుకున్నాడు గడుకన్నం పప్పు కలుపుకొని తింటు న్నాడు.

"పప్పుల తాలుబ్బెట్టినావె" అన్నాడు గట్టయ్య

"సెంసెడంత అడుగు బొడుగు నూనుండంగ తాలుబ్బెట్టిన. కోమటోని దగ్గరకివోతె కాత పైనలియ్యమంటండు" అంది వెంకమ్మ.

"రొండు పాడి పిల్లలమ్మితె సిల్లర బాకీలు తీరుతయ్ పటు" అంటూ అన్నం తినసాగాడు. పప్పుతో అన్నం తినడం పూర్తి చేసి మరింత అన్నం పెట్టించుకొని తలెనిండా చల్ల బోసుకొని ఉప్పేసుకొని జుర్రసాగాడు. చల్లతాగడం పూర్తిచేసి భోజనం చేయడం పూర్తి చేసాడు. వాకిట్లో వాల్చున్న మంచంలో కూర్చొని మోతుకాకును ఈనెలు తీసి చుట్టగా మలిచాడు. అందులో పొగాకు మలిచిపెట్టి చుట్టను సగంలో వంకగా మలిచాడు. ఆ చుట్టను మంచంలో పెట్టి రుమాల్లో నుంచి చెకుముకి రాయి దూది తీసి నిప్పు చేసాడు. దాన్ని చుట్టలో పెట్టి తాగుతూ లేచాడు. ఇంతలో ఓ పేగులో భార్య కుక్క కొరకై కట్టిచ్చిన అన్నం తీసుకున్నాడు. గొంగడి కోలాటం వేసుకొని కట్టెకు కుక్క చద్దన్నం తలిగించుకొని చుట్ట దాగుతూ "అళ్ళకు సద్దులు వట్టుకొని పోత" అని భార్యతో చెప్పి బయట కెళ్ళాడు. గంగయ్యంటికెళ్ళి అతన్ని తీసుకొని కొంరెల్లింటి కెళ్ళారు. కొంరెల్లి తల్లి కట్టిచ్చిన అన్నం మూటను తీసు కొని బీరయ్యంటికెళ్ళారు. అక్కడ కూడా అన్నం తీసుకొని అన్నమున్న తెల్లడబ్బ గిన్నెలను చెరోటి చేతిలో పట్టుకొని మంద లేపడాని కెళ్తున్నారు.

ఊళ్ళో స్వాతంత్ర్యదిన వేడుకలు జరుగుతున్నాయి. పాఠశాల విద్యా ర్థులు దేశభక్తి గేయాలు పాడుతూ ఊరే గింపు తీసి వెళ్ళిపోయారు. పంచాయ తాఫీసు ముందు మూడు రంగుల జెండా ముచ్చటగా ఎగురుతుంది. మందలేపడాని కెళ్తున్న గట్టయ్య, గంగయ్యల కెదురయ్యాడు సాలె రంగయ్య.

"ఏందే గట్టన్న! గియ్యాల్ల గూడ మందకాడి కోవుడేనాయె" అన్నాడు నవ్వుతూ రంగయ్య.

"ఇయ్యాల్లేందె? ఇసిత్రంగ

మాట్లాడవత్తివి?" అన్నాడు గట్టయ్య.

"ఇయ్యాల్ల ససంత్రదినం గాదె"

"అంటేందే?" గంగయ్యడి గాడు.

"ఇన్నూరేండ్లు మన దేశాన్నేలిన ఇంగిలీసోడు ముప్పై ఐదేండ్ల కింద గిదినం నాడే దిగిపోయిండు. అప్పట్నుంచి మన రాజ్యాన్ని మనమే ఏలుకుంటున్నం" అన్నాడు రంగయ్య.

"అంహా! అయితే గప్పటి గిప్పటికేం పరుకుందే" అడిగాడు గంగయ్య.

"గవ్వేం మాటలు?? ఒగడు మన రాజ్యాన్నేలిందానికి, మనది మనం ఏలుకున్న దానికి పరకుందదా?"

"నా సిన్నప్పుడనుకోంగిన్న. గాంధి మారాజు ససంత్రం కొరకు కొట్లాడుతండ్రున్నరు. అటెనుక ససంత్ర వచ్చిందన్నరు. కని నాకయితె గప్పటికన్న గిప్పటికి పరుకేం కనవడుత లేదు. గప్పుడు మేంగొర్రె ముడ్డికి మూతి తుడుసుకుంటనే బతికినం గిప్పుడు గట్లనే బతుకుతున్నం. గప్పుడు మా అడోల్ల మీన గింతంత బంగారం, ఎండుండె. గిప్పుడది గూడ లేకుంటయింది. గప్పుడు గిప్పుడున్న దొరయ్య ఊర్నే లేది. గిప్పుడు దొరేలుతండు" అన్నాడు గట్టయ్య.

"బలెటోనివె గట్టన్న. ససంత్ర మచ్చినంక ఊళ్ళెకు బడి రాలేదానె" రంగయ్య.

"బడచ్చింది నిజమే కని గండ్ల మా అసొంటోల్ల పోరగాండ్లెంతమంది సదువుతండ్రే. మనూళ్ళో మాకులపోల్ల దెనుభై కదుపుంటె సదివేది నలుగురే కాదె. ఐదారేండ్ల పొల్లగాండ్లతోని పనిజేపియ్యందెల్లకనే పాయె. కొంచెమంతెదుగుతె తీసి గొర్లకు పెట్టుడే నాయె. ఇగ సదువులేం జెప్పిచ్చుడయితది సెప్పె. అదే అన్ని తీర్ల ఉన్నోల్ల పొల్లగండ్ల కయితె సదువు సెప్పిచ్చుటానికి అయితది" అన్నాడు గట్టయ్య అరిన చుట్టను రుమాల్లో చెక్కుకొని.

"ససంత్ర మచ్చినంక ఊళ్ళెకు సడుకువడె. కరెంటచ్చె మాటలానె"

"ఊళ్ళెకు కరెంటచ్చింది నిచ్చమేకని మా యిండ్లల్ల సూడుపోయె. సీయక్క కటిక సీకటేనాయె. కడుపుకే సక్కంగెల్లకుంటె ఇగ ఐదారు నూర్లు ఖర్సుపెట్టి కరంటేం బెట్టించుకుంటమే. మల్ల సాపెలుపన్న లేని కొంపల్ల ఏం కరెంటు పెట్టించు కునుడే. ఇగ గా బస్సులల్ల ఎప్పుడన్న రోగమత్తె పట్నం మా పోతన్నం. నేనయితె పుట్టిగెన్నేండ్ల యింది గని దూరం నుంచి నూసుడేగని రైల్నెయితెక్క లేదె" తనకు తెలిసిన స్వాతంత్ర్య ఫలితాన్ని గూర్చి చెప్పాడు గట్టయ్య.

"నైజామోని కాలంల ఎంత గోరంగుండెనే. నీకు తెల్వదాకని. బజార్ల కోడి కనవడ్డదంటె సుంకరోడెత్తుక పోవుడేనాయె. అడిగె దిక్కులేపాయె. గిప్పుడు గంతధ్యాన్నంగుందానె" అన్నాడు రంగయ్య.

రంగయ్య తల్లిదండ్రులు మగ్గం నేసుకుంటూ బ్రతికేవారు. పొట్టగడవడమే గగనమయ్యేది. రంగయ్య అదిలాబాద్ దిక్కుల్లి బట్టలమ్ముతూ కొంత మెరుగ్గా బ్రతుకుతున్నాడు. తాను కొంచెం బాగా బ్రతుకడానికి స్వాతంత్ర్యం రావడమే కారణమని అతని నమ్మకం.

"తురుక రాజు కాలంల దేశముఖులకు, గిరుదవార్లకు అళ్ళకీల్లకు ఎట్టి గొర్లిచ్చినం. ఎట్టిమందలు పెట్టినం. మొన్న మొన్నటిదాక దొరకియ్యలేదా? పట్వారి కియ్యలేదా? పటేలు కియ్యలేదా? పెద్దల్లిండ్లల్ల లగ్గాలయినా, ఏ బోజనమయినా మేం గొర్లట్టిగనే ఇచ్చుడాయె. ఊళ్ళెకు బస్సు దిప్పిచ్చినప్పుడు దసురనడు డ్రైవర్లకో గొర్రె అట్టిగనే ఇత్తిమి. లేకుంటె బస్సు బందయితదని సరుపంచచ్చి కొంటవాయె. ఎట్టి మందలు మన్ను మసానం మొన్న బాక పెట్టలేదానె. గీ రొండు మూడేండ్ల వట్టి ఊళ్ళె పడుసు పొల్లగండ్ల మర్లవడుడు మొదలుపెట్టినంక అన్ని బందాయె గీ మాట నిజమంటవా కాదంటవే" అన్నాడు గట్టయ్య.

"ఎందుకంటవే గట్టన్న! ససంత్ర మచ్చినంక కొంత కొంత మారుపు మా అచ్చిందె" అన్నాడు రంగయ్య.

"అత్తెరావచ్చుగని మా అసొంటోల్ల బతుకులయితె ఎక్కడేసిన గొంగడక్కడేసినట్టే వుందె. లాబపడ్డోల్లు వడ్డింద్లిచ్చు. గివ్వన్నెందుగ్గని మంద లేపే యాల్లయితంది పోతమే అన్నాడు గట్టయ్య. రంగయ్య నెదిలి ఇద్దరూ వెళ్ళిపోయారు. మంద దగ్గరకు చేరుకున్నారు. కొంరెల్లి, బీరయ్య నీళ్ళు తీసుకెళ్ళిన సద్దిమూటలు విప్పి దుత్తల్లో వున్న నీళ్ళు తాగుతూ అన్నం తినసాగారు. కుయ్ కుయ్ అంటూ వచ్చిన రెండు కుక్కలకు వాటికని తెచ్చిన అన్నాన్ని వేసాడు గంగయ్య. తోకాడిస్తూ అవి అన్నం తినడం ముగించి గట్టయ్యను వచ్చి నాకసాగాయి. కొంరెల్లి, బీరయ్య అన్నం తినడం ముగించారు. దగ్గరున్న కాలువలో దబ్బగిన్నెలుకడిగి పేగుల్లో కట్టి కట్టెకు తలిగించారు. నలుగురు కలిసి మందలేపారు. టర్ టర్ అయ్ అయ్ అంటూ గొర్ల మర్లేస్తున్నారు. అటూ ఇటూ పోతున్న గొర్లను దారి పట్టిస్తున్నారు. వాటిని మర్లేయడం కష్టంగా వుంది. "సీయక్క..... గొర్ల పెండ్లాం..." అని తిడుతూ తోవకు తెస్తున్నారు. దొంగ గొర్లు తప్పించుకొని చేండ్లలోకి పరుగిడుతున్నాయి. వాటిని చేండ్లలో పడనివ్వకుండా అవుతూ ఇరుకుగా వున్న త్రోవెంబడి నడుస్తున్నారు. గొర్లన్ని మందగా పోతున్నాయి. వాటి ముందు కొంరెల్లి దారి తీస్తున్నాడు. వెనుక మిగతా ముగ్గురు నడుస్తున్నారు.

"పొలాలన్ని దున్రిని. సేండ్లల్ల పునాన ఇత్తునాలేసిరి. ఏలువెట్ట సందులే కుంటంతట ఇత్తునాలేసిరి. ఇగ గొర్లేడ మెయ్యాన్నే" బీరయ్యన్నాడు.

"సేండ్లు గొర్ల కోసురముంచుతార్ర. పరంపోగు బూములల్ల, గుట్టల పొంటి మేవుకోవాలె" అన్నాడు గట్టయ్య.

'నిజమే కని గట్టన్న గా గుట్టల కోవన్నన్నా ఇరుకుటమేనాయె. దొరలు, పటేండ్లు తొవ్వలను గూడ తలింత కలుపుకుండ్రి. పరంపోగులను గూడ దున్నుకున్రి. ఇగ గొర్లేడ తిరుగన్నే" గంగయ్యన్నాడు.

"సీయవ్వ మా సిన్నప్పుడే నయ్యముండెరా. పెద్దగుట్ట, సిన్న గుట్ట. లాగెలబోరు, బోడగుట్ట, దుబ్బ బూములు నాలుగైదు నూర్లెకురాల భూమి పరంపోగుడుండెంది. గొర్ల మాకెలి దిని పెడితె సబ్బండ రాజ్జెం అటి కిట్టమున్నట్టు తిరిగచ్చేటియి. ఈ నవ్వ. పెద్దల్లంత తలింత బూదావెరనాగ వట్టుకున్రి. గుట్టలు గూడ కొంత కొంత పట్టాజేసుకుండ్రి. నాలుగైదు మార్ల పరంపోగు నూరెకురాలన్న మిగుల పాయె. పొలాలు సేండ్లు దుంతె గొర్రెమాలె తిరుగుడే కట్టం గావట్టె. తెలువులెక్కో అయినకొద్ది మనిషి సెడి పోతందర" అన్నాడు గట్టయ్య.

"నిజమేనే గీకలిగమంత సెడి పోతంద్రె గట్టన్న. మనిషి కేదిదిసాల్త లేకనేపాయె. గీ కలిగమిలవర్సె సూత్తె బమ్మంగారు సెప్పింది నిచ్చమే అనిపిత్తందే. ఎంపలి సెట్లకు నిచ్చెండ్లే సెటోళ్ళు పుడుతరట కద" అన్నాడు గంగయ్య పక్కకు పోతున్న గొర్రెను అదిలిస్తూ.

"అవు బిడ్డ మా తాత సేతులు మీదికెత్తినా అందకుంటుండెటోడట. తిన్నా తవ్వెడు గడుక బువ్వ తినెటోడట. పన్నెండు గుంచాల బండలసొంటి మక్కలు ఒల్లక్కాని కెత్తుకొని నడిసెటోడట. పన్నెండు పుట్ల మక్కల కల్లం మీదికెళ్ళి గుపుక్కున దునెకెటోడట. పొద్దందాక గొడ్డోలె పన్జేసినా గింతన్న అలిట్ట కచ్చెటోడుగాదట. నీయవ్వ! ఇప్పటి పోరగాండ్లు సూడు గడిసేపు పన్జేసెటాల్లకే అవ్వే అయ్యో అంటరు. తినుమన్నా కట్టమే" అన్నాడు గట్టయ్య.

ఒక గొర్రె ముందు నడిస్తే దానివెంట మిగతావి తలవంచుకొని నడుస్తూనే వుంటాయి. గొర్లన్నీ మందగా నడుస్తున్నాయి.

"మా అయ్య సెప్పంగిన్ననే గట్టన్న. అల్ల తాతట మోసెయ్యంత పొడుగుయి ఇరువై మక్క కంకులు తినెటోడట. నాకయితె సిన్న సిన్నయి పది పన్నెండు తింటెనే యాట్టకత్తది" అన్నాడు బీరయ్య అమాయకంగా తాను తినేది చాలా తక్కువే అన్నట్లు.

"మనేల్లేం తింటర్రా తిండి. గా వంధిని బామండ్లదయితె ఒక తిండిగాదు. నీయవ్వ. ఎంకటశాత్రని ఒగాయనుండె. అయినె బొత్తె అడ్డెడుడికే గడుక కుందంతుండె. అయినె పబోజ నాలల్ల కూసున్నడంటె బీవసేనుడు గూనున్నట్టె. పోటీవెట్టుకొని తింటె అయినె మీనెవ్వలు గెలిసెటోళ్ళుగాదట. కంకెడు కంకెడుండేటియి ముప్పైనలుపై లడ్డూలు, అరిసె తెలుపుయి పది పదిగేను బూరెలు, ఇంక బోంది గిట్ట తిని సారెడంత నెయ్యి పోసుకొని సోటిబియ్య పన్నందిని బేవ్ దీసెటోడట" తనకు తెలిసింది చెప్పాడు గట్టయ్య.

"అబ్బ ఈని కడుప్పొడుగాను. గా శాత్రి కతింటె మా తాత జెప్పిన కత యాది కత్తందే. జక్కడట అత్తగారింటికి పెయిండట. ఇసుర్రవుతంత గడుక పెళ్ళ, గుమ్మడి కాయంత మెతుకుల బువ్వ తిని, కడుముంతె దంబలి, ఎసిలెడు సల్లదాగి మారడుగుటానికి మా తల్లిగారిల్లా అన్నదట" చెపుతూ నవ్వాడు బీరయ్య.

"అవుగని గట్టన్న నువ్వు పెద్ద గొల్లగ దేశుముఖింటికి పొయ్యెటోనివి గద. ఏం బెట్టెటోలే దేశముఖుదొర" అన్నాడు గంగయ్య.

"తురుకరాజు కాలంల పెద్దపెల్లి దేశముఖు ఊరూరు పెద్ద గొల్లోల్లను దసుర పండుగ ముందుగాల పిలిపిచ్చెటోడు. కుప్పున పంచు రుమాలు నెత్తికి సుట్టెటోడు. ఓ పంచె పెట్టెటోడు. లడ్డూలతోని, అరిసెలతోని తిన్నంత బువ్వ పెట్టెటోడు. మా అయ్యతోన్నేను పొయ్యెటోన్ని. మా అయ్య తినెకాడికి తిని లడ్డూలు గొంగట్టేసుకచ్చెటోడు. సానేండ్లా యెగది బందయి" అన్నాడు గట్టయ్య.

"దసుర దసుర కయినె రుమాలు, పంచె పెడితె మనమేమి చ్చేదే?"

"ఆడట్టిగ పెట్ట టోడా ఏంది? పిల్లగండ్ల లగ్గాలయితె, ఏ పబోజనమయినా ఎట్టి గొర్లిచ్చెటోల్లం" అని ముందుకు చూసి "అరే కొంరెల్లి గొర్లెమొ పెచ్చెరువు మొకాన పోత న్నయి లాగేల బోరు దిక్కు మలుపు. అక్కడ వంచిగుంది వచ్చిగడ్డి. జెవ్వన బొత్తల్నిందుతయి" అని కేకేశాడు గట్టయ్య.

కొంరెల్లి గొర్లను లాగెలబోరు దిక్కు మలిపాడు. గొర్లు లాగెల బోరెక్కుతున్నాయి. అందీ అందని గడ్డిని బరుకు బరుకున మేస్తున్నాయి. సగం వరకు గుట్టెక్కారు. ఓ చిన్న చెట్టుకింద నల్గురూ కూచున్నారు. గొర్ల దిక్కు చూసుకుంటూ మాటల్లో పడ్డారు.

"ఎంతయిన గట్టన్న పాడు కాలానికచ్చిండె. నీయక్క నీ గొర్లంతోని బతుకుదిగ కట్టవేనె. గొర్నె దిరుగుటానికి జాగే లేపాయె. ఇగ గవ్వి ఎట్ల బతుకుతయే" అన్నాడు గంగయ్య ఆవేదనగా.

"నిజమే బిడ్డ. కని కుల కసివి వినిసిపెడుతాంర. మనం బతికినన్ని గాలాలు గిట్లనే ఎల్లదీసుకోవాలె. మన పొల్లగండ్లెట్లనే మా బతుకుతరు" వృత్తిపైని ప్రేమతో అన్నాడు గట్టయ్య.

"నీయవ్వేం బతుకు తియ్యి. కయికిల్జేనుకుంటె ఇంతకంటె నయ్యమే. తడుకలు సేసుటాని కక్కెర కొచ్చే ఆ ఖిలబిరిగెగ్గాడ పైసలే నాయె. కటికోడు మొద్దుకు మొద్దున్న గొర్రెకు ఇన్నూర్రుపాయెలు పెట్టటానికేడ్సె. అవుతల్నెమొ కిలకు ఇరువయ్యైదు కమ్మె. సేసినేనికేముందె దుబ్బా మారు బారెగాళ్ళె బతుక వట్టిరి" బాధతో అన్నాడు బీరయ్య.

"అరుగాలం జీవాల పొంటి తిరుగుతె మన్నత్తందా? నీయక్క కొయ్యకాల్ల వేమ్మకున్నందుకు మందలు పెట్టుమంద్రి. తుమ్మకాయ కొట్టు కున్నందుకు మంద లేనాయె. అవ్వన్ని పొంగ మంద బత్తెమంటత్తె మంద మీజ్జేసుకున్న దేవుళ్ళకు, దయ్యాలకు, తాగుటానికే సగానికెక్కనాయె. పాడిపిల్లలమ్ముకుంటె దుబ్బత్తందా? ఒక్కపారి సిటుకు రోగ మత్తె మందకు మందెడిసె" అన్నాడు గంగయ్య. పోయిన సంవత్సరం సగాని కెక్కువగా రోగాలొచ్చి చావడం జ్ఞాపకానికొచ్చి కళ్ళ వెంట నీళ్ళుగారాయతనికి.

"ఎందుకు బిడ్డ కండ్ల నీళ్ళు తీసుకుంటవు? పొంగ సిక్కనాటి తోనే ఎల్లదీసుకోవాలె. కాలం మంచి గచ్చిందంటె ఒరొందేండ్లు రోగాలు తలుగ కుంటె అవ్వే మస్తు పెరుగు తయ్" అని గంగయ్య నేదార్చాడు గట్టయ్య.

"ఏం లేసుడే కని గీ గొర్ల గాసుకుంట బతుకుడిగ కాని పనేనే. మల్లగొల్లోడంటె అందర్కి సల్లగనే కనవడ్డడు. ఆరి తోడి పిలుసుడేకని ఎవ్వలు మంచిగ పిల్వ పోయిరి. నీయవ్వేం బతుకుతే. మనెల్లకంటె గా అరిజనులు మంచిగ బతుకుతంద్రు" అన్నాడు బీరయ్య.

"గిండ్లెల్లు మానులేదనే మనెల్లు సానమంది కట్టకిందేసి కాలేర్ల పొంటి పోతంద్రు. అక్కడ కట్టవడ్డా నాలుగు పైసలన్నత్తయి" గంగయ్య.

"ఆ అక్కడపొయ్య సంపాయిత్త రప్పకందెను? ఎవ్వలో ఇద్దరో ముగ్గురో దప్పుతే ఎవ్వర్లా బొగ్గుబాయిల పన్జేసి పైనల్జంపాయించింది" అన్నాడు గట్టయ్య.

"ఎట్ల బతికెటోదట్ల బతుకు తడుగని మంద గొల్లోల్ల త్యాగెం తెగినాదె గట్టన్న" అన్నాడు బీరయ్య.

కొంరెల్లి గొర్లను మర్లేస్తున్నాడు.

"ఎర్రన్నది, కల్యానురాజు, కాటమరాజు కథ జెప్పంద్రు. ఒంటి కొమ్ము బొల్లావు కథేం జెప్పింద్రా రాయ

మల్లుగాడు. బొమ్మలు నిలవెట్టుట గూడ ఐపాయె. ఇంటికి యాభయేసి ఎయ్యి రూపాయల్సిన ఇగరొండు మూడు రోజులల్ల ఎల్లి పోతరు" అన్నాడు గట్టయ్య.

"జెప్పన్నెల్ల గొడ్టే అల్లను. ఉన్నన్దినాలు బువ్వ పెట్టాలె. కల్లు పోపియ్య మనెంబడి పడుతరు" అన్నాడు వీరయ్య.

"మనల నడుక్కోని ఐతికె టోళ్ళకు గాయింత బలిమవుండదిర. ఎల్లుండి పోతనన్నరు" అని గొంగడి పరుచుకొని జరిగాడు గట్టయ్య.

"ఐతె మాయొగని గట్టన్న మొన్న దొర నీ మీనికి కోపాని కచ్చిందటెందుకే" అడిగాడు గంగయ్య.

గట్టయ్య ముఖంలో విషాదం, కోపం కలగాపులగంగా వున్నాయి. ముడతలు పడ్డ ముఖాన్నొసారి చిట్లించి

"ఎందుకత్తదుగ కోపానికి. పుక్కాని కచ్చేటిమి రాపాయెటాల్లకు నీయక్క మండుతంది. నూర్లెకురాల బూములు, ఎడ్లవుసం, పెద్ద పెద్ద బొంగులాలున్నా ఇంకా మనసొంటోల్ల సొమ్ము ఉత్తగ తినన్ననే సూత్తరు దొరలు, ఛీ నీయవ్వ ఏం పుటుకులో" అని ఉమ్మివేసాడు గట్టయ్య.

"ఏమైందే సెప్పకనే పోతివ గాదె" అడిగాడు గంగయ్య.

"నసంత్రం నసంత్ర మన్ని. ఎట్టి సాకిర్లు లెవ్వన్ని. కని మన కండ్ల ముంగట్నే మొన్న మొన్నటి దాక దొర గడీలల్ల ఎట్టి సాగనే సాగె. మనెల్లు మనల్నే ఏలుతంద్రన్ని కనేమచ్చె. వడుసు పోరగాండ్లు సంగమంట వెట్టి ఎట్టిగొర్లు, ఎట్టి మందలు మామూల్లు బందు జేసెదాక దొరలు గట్లనే సాగిచ్చుకున్ని ఆ పొల్లగండ్లు సెప్పెరాక మనకు తెలువకనే పాయె. దసురపిల్ల, ఎట్టి మందలన్ని బందాయెవారకు దొరకు మంటకచ్చింది. మొన్న పిల్సి మందలు పెట్టుమంటె పైసలియ్య మన్న. తిట్టి ఎల్లగొట్టిండు. నా సంగ జ్ఞాత్త నన్నడు" అన్నాడు గట్టయ్య.

"మనమేం తప్పు సేసినమే. నరె తలదీసి మొలేత్తదా సూత్తాం" అని "గొర్లు దూరం బెయినయ్ మర్లేసు కత్తం" అని గంగయ్య, వీరయ్య లేచారు. కొంరెల్లి అంతకు ముందే లేచిపోయాడు.

"నాక్కాల్లు నెత్తన్నయి. ఒక్క కునుకుదీత్త గొర్ల సూసుకోంద్రి" అని వాళ్ళను పంపించాడు గట్టయ్య.

నిద్రపోదామని ఎంత ప్రయత్నించినా గట్టయ్యకు నిద్ర రావడం లేదు. ఎనిమిదేండ్ల వయ సప్పుడే తన చేతికి కట్టెరావడం గొర్ల కాస్తూ దొరలతో, పటేండ్లతో తాను తిన్న తిట్లు, దెబ్బలు పడ్డ అవమానాలు ఒక్కొక్కటే జ్ఞాపక మొస్తున్నాయి. తప్పిపోయి గొర్రె పొలంలో పడ్డందుకు రైతులు పెండ్లాన్ని, తల్లిని, అక్కను పేర్లుబెట్టి తిట్టిన బూతు మాటలు జ్ఞాపకం తెచ్చుకుంటున్నాడు. ఓసారి ఊరి పొలిమేరలో మేస్తున్నప్పుడు గొర్లు పక్కవూరి రెడ్డి కంది చేండ్లె పడితే ఆ రెడ్డి పిలిచి ముల్లు గట్టెతో గొడ్డును బాదినట్లు బాదడం కళ్ళ ముందు కదుల్తుంది. ఎన్నోసార్లు చెయ్యని నేరాలకు దండుగల రూపంలో కట్టిన డబ్బు అతని దృష్టి పథంలో కొస్తుంది. రోల్లు బ్రద్దలయ్యే ఎండల్లో తుమ్మ చెట్లెక్కి కాయ కొట్టడం రాళ్ళు రప్పలనకుండా తిరగడం జ్ఞాపక మొస్తుంది. కుండపోతవర్షాల్లో, ఎడ తెరపి లేని ముసుర్లో, తడిసి ముద్దైనా గడగడ వణుకుతూ గొర్ల వెంబడుండటం, బురదలో రొచ్చులో పడుకోవటం, ఒకొక్కసారి రాత్రంతా కట్టె నాధారంగా చేసుకొనే వానలో నిల్చోవడం యాదికొస్తుంది. ఎముకలు కొరికే చలిలో శరీరంపై అంగి కూడా లేకుండా గొంగలి మాత్రం కప్పుకొని మంద దగ్గరుండటం, పండుకొనడం గొర్లతో తిరగడం సినిమా రీళ్ళలా కళ్ళ ముందు అగుపడ్తుంది. తాను గొర్లలో గొర్రెగా మారి వాట్ని కాపాడుకున్నాడు. కాలభేదం లేకుండా రాత్రనకా, పగల నకా ఒళ్ళు హూనం చేసుకొని ఆ వృత్తితో జీవిస్తున్నాడు. యాభై ఏళ్ళుగా తానున్న చోటనే ఉన్నాడు. తన కళ్ళ ముందు వచ్చిన మార్పులు, వస్తున్న మార్పులాతనికి దృగ్గోచరమౌతు న్నాయి. తన దయనీయ జీవితాన్ని తలుచుకొని రెండు కన్నీటిబొట్లు రాల్చాడు. "మొన్న దొర నా సంగజ్ఞాత్త నని బెదిరించిండు. ఏం జేత్తదే. అన్ని నమ్మద్దు. అయితాయె ఏదయితె అద యితది" అనుకొని కళ్ళు మూసుకు న్నాడు. కొంచం కునుకులా వద్తుంది. "గట్టన్నే! గట్టన్నే" అన్న పిలుపు విన వచ్చింది. గట్టయ్య లేచి కూర్చున్నాడు. ధ్వని వినవచ్చిందిక్కు చూసాడు. తననే పిలుస్తూ సుంకరి సాయిలు గుట్టెక్కి పైకొస్తున్నాడు. కండ్లు పులపాడిని చూసాడు. సాయులే.

"గిప్పుడు సుంకరోడెందుకత్తండు" అనుకు న్నాడు. గొంగడి భుజమ్మీదేసుకొని, కట్టె చేతిలో పట్టుకొని సాయులు దిక్కు నడుస్తున్నాడు గట్టయ్య. కొద్దిసేపట్లో సాయుల్ను చేరుకున్నాడు. గంగయ్య కూడా వాళ్ళ దగ్గరికొచ్చాడు.

"గట్టన్నా! దొర నిన్ను జెప్పండీ సుక రమ్మన్నడు. నడువ్ నడువ్" అని తొందర చేసాడు సాయులు.

"ఎందుకు సాయులు దొరెందుకు రమ్మన్నడు" అడిగాడు గట్టయ్య.

"గవ్వన్ని నాకెర్కలే. ఎక్కడున్నా పట్టుక రమ్మన్నడు"

"ఏందో సెవ్వక పోతెట్ల సాయులె" అన్నాడు గంగయ్య.

"నాకెరుక లేదంజెప్పితిగద. దొరింటి ముంగట పటేలు, పోలీ సొల్లయితె ఉన్నరు. జెప్పన్నడువు" అన్నాడు సాయులు.

పోలీసులనేనరికి గట్టయ్య క్కొంత భయమయ్యింది. దొరేదో చేసేట్టుగా ఉన్నాడనుకొని 'గొర్ల మంచిగ సూ(రా)గంగులు. నేపొయ్యత్త" అని సుంకరి వెంబడి నడువసాగాడు గట్టయ్య. దొరిల్లు చేరుకునే సరికి వెంకమ్మక్కడ ఏడుస్తూ కూర్చుంది. గట్టయ్య కెదురుగా ఓ పోలీసొచ్చి 'ఏంర గొల్లోడ ముసలోని వైనవు. దొంగతనం జేత్తావుర. నడువ్ జీపెక్కు" అని గట్టయ్యపై చెయ్యేసాడు.

ఏడుస్తూ గట్టయ్య దగ్గర కొస్తున్న వెంకమ్మను గదమాయించి దూరం వంపించాడు పోలీసు. గట్టయ్యకు పరిస్థితి అర్థం కాలేదు. దొంగతనమేంటి? తనకు విలువడమేంటో తెలియలేదు.

"నేం దొంగతనం జేసిన్నా. నీయక్క గిదెక్కడన్నాయెం బాంచెను" అన్నాడు గట్టయ్య.

"నడువ్ బే నడువ్ దొరింట్ల నగలు పోయినయట. నీమీదున్న ఇంకిద్దరు పోరగాండ్ల మీద రిపోర్టిచ్చిండు. నడువ్ స్టేషన్‌కు జీబెక్కు. అని మెడలు పట్టి గెంటసాగాడు పోలీసు.

కచ్చీరింట్లో కూర్చున్న దొర ముసిముసిగ నవుతున్నాడు. గట్టయ్యకప్పుడు పరిస్థితి అర్థమయ్యింది. ఇన్నేజుల్లా కాకుండ తాను మందలకు డబ్బడిగినందుకు దొర పన్నిన పన్నాగమనుకుని తెలుసుకున్నాడు.

(పుస్తక సమీక్ష)

# అడవి ఉప్పొంగిన రాత్రి



"అడవి దట్టంగా అల్లుకు పోయింది/ అయినా ఇక్కడ చీమలు చేసిన బాటలు న్నాయ్/ శతాబ్దాల నిశబ్దాన్ని/ పొదివిన మౌనపు కొండలున్నాయ్."

'విమల' అడవిని కవిత్వం చేయడం ద్వారా అందరికీ పరిచయమైంది. అడవి గురించి రాయడమంటే ప్రజాపోరాటాల గురించి రాయడం. ప్రజా ఉద్యమంతో మమేకమై విమల 'అడవి ఉప్పొంగిన రాత్రి' కవితలు రాసింది. అడవికి పోరాట ప్రజలకు మధ్య ఉన్న సంబంధాన్నేకాక, పౌరహక్కుల గురించి, మహిళా సమస్యల గురించి, మతోన్మాదం గురించి చాల స్పష్టంగా కవితలు రాసింది.

విమల ఆలోచనల్లో, దృక్పథంలో స్పష్టత ఉంది కనుకనే ఆమె కవిత్వంలోనూ స్పష్టత ఉంది. సంక్లిష్టమైన సమాజంపట్ల స్పష్టతలేని వారే సంక్లిష్టంగా, అస్పష్టంగా రాస్తూ, కవిత్వానికి నూతన మార్గనిర్దేశకులమని డాంబికంగా దబాయిస్తుంటారు.

కవిత్వం రాసేవారు తమకు కవిత్వం ప్రాణం, బతుకని చెబుతుంటారు. కవిత్వంపట్ల తమకెంత ప్రేమ ఉందో కవిత్వం రాసే ప్రతి ఒక్కరూ ఎప్పుడో ఒకసారి తమ భావనను కవిత్వీకరిస్తారు. ఉద్యమం లోంచి వచ్చి, ఉద్యమం కోసం కవిత్వం రాస్తున్నది విమల. విమల కవిత్వానికి ఉద్యమమే ప్రాణం.

"పులి విసిరిన పంజాదెబ్బకి
నెత్తురు చిందించిన
చీకటి గండ్ల
ములుగు చుట్టూ...
ఎండా కాలంలో అడవిలో
ఎరగళ్ళు పడితే నేం
తిరిగి అది
పచ్చసముద్రం అవుతుంట".

అడవి నిశ్శబ్దంగా, భయంకరంగా ఉంటుంది. దారి తెలిసిన వారిని అడవి మోసం చేయదు. అడవి అమ్మలాంటిది. పోరాట శిశువుకు తప్పటడుగులు నేర్పింది అడవి. కంటిపాపలా కాపాడుతున్నదీ అడవే.

'అడవి ఉప్పొంగిన రాత్రి' దారులన్నీ తెలిసినా కొరియర్‌లా విమల మనల్ని అడవిలోకి తీసుకెళుతుంది. గుండెను దిటవు చేసుకొని ఒక్కో అడుగు వేయి కళ్లను టార్చిలైటు చేసుకో, నీ రక్తంలోని అణువణువు అడవిని సృజిస్తుంది. వేనవేల వత్సరాల ఆదిమ మహా మృదు తొలికేక వినబడుతుంది.

అడవి అమానుషంగా, చీకటిగా, నిర్దాక్షిణ్యంగా ఉన్నా ఉద్యమాల్ని ఆకర్షించే 'మజిలీ' అంటుంది విమల.

"మేం వస్తాం
నాగేటిచాళ్ళు మీదుగా
నగరాల్లోకి
మమ్మల్ని కొంచెం
నిలదొక్కుకోనివ్వండి
ఇక్కడ రాలిన విత్తనాలని
కాస్త మొలకెత్తనివ్వండి."

పల్లెల మధ్య బాటలను కలిపేది అడవి. పల్లెల్లోంచి పట్టణాల్లోకి ఉద్యమ బాటలను వేసేది అడవే అని విమల అభిప్రాయం.

ఉద్యమం రచయిత్రులను, కవయిత్రులను సృష్టించడం లేదని, రాసేవాళ్ళను ఎదగనీయడం లేదని ఓ అపవాదు ఉంది. విమల కవితలు ఈ అభిప్రాయాన్ని అవహేళన చేస్తున్నాయి. నిజమే, ప్రజా ఉద్యమంతో మమేకం అయినవాళ్లు కవిత్వం రాసులు పోయలేకపోవచ్చు, తీరికా లేకపోవచ్చు. టెక్నిక్ గురించి అతిగా పట్టించుకోటానికి రాస్తున్నదంతా ప్రజల కోసమే ననే అవగాహన ఈ కవితల్లోని ప్రతి అక్షరంలోనూ చూస్తాం.

స్త్రీ ఉద్యమం మొత్తం ప్రజా ఉద్యమంలో భాగమనే అవగాహన విమలకు ఉంది. 'తెగపడిన మా కలల ప్రపంచం', 'వంటిల్లు', 'సౌందర్యాత్మక హింస' 'వేశ్యా శిశువు' కవితలు స్త్రీ సమస్యల్ని ఎట్లా అర్థం చేసుకోవాలో తెలియచెబుతాయి.

"ధ్వంసం చేద్దాం రండి
ఇక గిన్నెలపై ఎవరి పేర్లూవద్దు
వేరు వేరు స్వంత పొయిలను
పునాదులతో సహా తవ్వి పోద్దాం రండి
మళ్ళీ మన పాపలు ఈ వంటరి
వంటిళ్ళలోకి
అడుగిడబోతున్నారు
మన పిల్లల కోసం
వంటరి వంటగదులు కూల్చేందుకు
రండి"

ఇందిరాగాంధీ హత్యానంతరం ఢిల్లీ అల్లర్లల్లో అమాయకులెందరో ఆహుతయ్యారు. ఢిల్లీ అల్లర్ల వెనుక రాజకీయ కుట్రలను 'కన్నతల్లి' కవితలో చీల్చి చెండాడింది విమల.

"కాలి మసైన వేలది సిక్కుల బతుకులపై / ఆమె చితిని పేరుస్తున్నారు / తొణికిన సిక్కుల స్వప్నాల తైలంతో / తల్లి దాహాన్ని తీరుస్తున్నారు" అని

గతం జ్ఞాపకాల స్మృతుల్ని కూడా / కాటేసిన చల్లటి నెత్తుటి కుట్ర"

పౌరహక్కులను రక్షించు కోవాలని 'సెప్టెంబర్ 3' పునరావృతం కాకూడదని ప్రజాస్వామిక శక్తులను హెచ్చరిస్తున్నది విమల.

'సెప్టెంబరు మూడుల
పునరావృతాన్ని
సమాధి చెయ్యందే
నల్లటి చిత్రాల వెనుక
విషాదాన్ని సమాధి చెయ్యందే
మరెవ్వరం మిగలం"

ఉద్యమం ఆటుపోట్లకు గురయినప్పుడు విశ్వాసాన్ని నిలుపుకోవడం కోసం రాసుకున్న కవితలు "జీవితం కోసం మరణిద్దాం" "కలలు పగులుతుంటాయ్"

వర్తమాన ప్రజా ఉద్యమం ప్రతిబింబం "అడవి ఉప్పొంగిన రాత్రి" కవితా సంకలనం.

— ఎస్. మమత

| అడవి ఉప్పొంగిన రాత్రి |
|---|
| వెల : 5రూ. |
| ప్రతులకు : నవయుగ బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్. |

# వ్యవస్థపై రక్తరేఖ



జీవితంలో నిజాయితీ, నిబద్ధత ఉన్నప్పుడు వచ్చే కవిత్వం పాఠకుడి హృదయాన్ని కదిలిస్తుంది. ఉద్దీప్తం చస్తుంది. అలాంటి కవిత్వం పాఠకుడికి గాఢమైన అనుభూతిని కలిగించడమే గాక ఆలోచనలను కలిగిస్తుంది. ఒక కొత్త స్ఫురణను, చైతన్యాన్ని రేకెత్తిస్తుంది. జీవితానికి ఆలోచనలకు అనుభూతులకు మధ్య విభజన రేఖలు లేనప్పుడు మాత్రమే బలమైన ఫీలింగ్‌తో కూడిన కవిత్వం వస్తుంది. కవి అన్నతను ఏ సంఘటనయినా, ఏ అంశాన్నయినా అనుభవించి, కలవరించి, పలవరించినపుడే సజీవమైన కవిత్వం రాయగలుగుతాడు. అలిశెట్టి ప్రభాకర్ రక్తరేఖ కవితా చిత్రాల్లో ఈ జీవం ఉట్టిపడుతుంది. ఆయన కవితాచిత్రాలు, సామాన్య జనాల్లో ఎంతో ప్రాచుర్యం పొందాయి. సామాన్య పాఠకులకు సైతం, బోధపడే రీతిలో ఆయన కవిత్వం ఉంది. ఈ కవితల్లోని పదచిత్రాలు ప్రజాజీవనానికి దగ్గరగా ఉండమే ఇందుకు కారణం తమకు సన్నిహితంగా వచ్చే కవిత్వాన్ని ప్రజలు తప్పక ఆదరిస్తారనడానికి ప్రభాకర్ కవిత్వమే సాక్ష్యం. అందువల్లే ఆయన కవితా చిత్రాల ప్రదర్శనలు సామాన్యులను సైతం ఆకట్టు కొంటున్నాయి.

"శిలాసమాధిలా అంగుళం మేరకన్నా కదలకుండా పడుంటే ఎలా/కొన్నాళ్ళు పోతే నీ మీద నానా గడ్డి మొలిచి నీ ఉనికే నీకు తెల్సి చావదు." అని సామాన్యుడ్ని హెచ్చరిస్తున్న ప్రభాకర్ కవిత్వం జీవితంలో మార్పు వస్తుందనే ఆశను ఆత్మ విశ్వాసాన్ని కలిగిస్తుంది. కోట్లాదిమంది జీవితాలను శాసించే పరిస్థితులు మారటం సాధ్యమనే విశ్వాసాన్ని ఇంపాసిబుల్ కవితలో "సూది మొన మీద ఆవగింజను మోపటం వృథాశ్రమ నియంతృత్వపు తుపాకీ, గొట్టం పైన భూగోళాన్నీ ఆపటం భ్రమ" అని నొక్కి చెప్తాడు. "నీ శ్రమ ఫలం నీ సమక్షంలోనే పాతిపెట్టిన విత్తనం" దాన్నే డబ్బు చెట్టుగా పెంచి దక్కించుకున్న వాడిదే పెత్తనం" అని ఈ దేశంలో ధనస్వామ్యపు నైజాన్ని వ్యక్తీకరిస్తాడు. అంతేగాక "నువ్వు ఉరిమి చూసినపుడేమో ఊరంతా పాలేర్లే, వాళ్ళే ఊరి నుంచి తరిమి కొడితే నీ బ్రతుకుంతా పల్లేర్లే" అని ప్రజల తిరుగుబాటు శక్తి ముందు దొరతనం గడ్డిపోచ వంటిదనే చారిత్రిక సత్యాన్ని ప్రకటిస్తాడు.

సమాజంలో మహిళల జీవితాల్లోని విషాదాన్ని పురుషాధిపత్యం కింద అణిచివేతకు గురయ్యేవారి ఆవేదనలను కూడా ప్రభాకర్ అక్షరీకరించారు. "తనుశవమై ఒకరికి వశమై, తనువు పుండై ఒకరికి పండై, ఎప్పుడూ ఎడారై ఎందరికో ఒయాసిస్సై" సాగుతున్న అభాగ్యస్త్రీల జీవితాల్లోని బరువైన విషాదాన్ని ఆయన కవిత్వీకరించిన తీరు కళ్ళు చెమ్మగిల్లేట్లు చేస్తుంది. "వధ్యశిల" "నాగరికతా సౌధం నువ్వే" వంటి కవితల్లో సమాజంలో దైన్యస్థితిని, స్థానాన్ని చిత్రీకరిస్తున్నాయి. సమాజంలో మార్పు కోసం జరిగే పోరాటాల్లో భాగస్వాములు కావడం ద్వారానే స్త్రీలు విముక్తిని సాధిస్తారని ప్రభాకర్ అంటారు. ప్రభాకర్ కవిత్వం సునిశితమైన పదునైన ఆలోచనలతో కూడి ఉంటుంది. ఆయనకు సమాజం పట్ల, జీవితం పట్ల ఉన్న అవగాహన ప్రతి కవితలోను వ్యక్తమవుతున్నది. సంక్షిప్తంగా చెప్పినట్లు కనిపించినా, అనల్పమైనా భావాలను వ్యక్తీకరిస్తాయి ప్రభాకర్ కవితలు. కవిత్వం గాని మరే సాహిత్య ప్రక్రియగాని వస్తువేది తనకు తగిన శైలినీ శిల్పాన్ని రూపొందించుకుంటుంది. వస్తువు శిల్పం వేరు వేరు అనే భావనలు సరైనవి కావు. వస్తువును బట్టి శిల్పం రూపొందు తుంది. ప్రభాకర్ కవిత్వం పదునుగా ఉండడానికి కూడా ఇవే కారణం. శిల్పం దెబ్బతినకుండా సంక్షిప్తంగా రాయడం అందరికి సాధ్యం కాదు.

కవితాత్మ, కళాత్మకత అనేవి కొరవడినపుడు వస్తువు సమాజ మార్పును ఆశించేదయినా ఆ కవిత్వం నిలబడదు. పాఠకుడ్ని చదివించలేదు. ఎనభైలలో అనుభవంలోంచి, ఉద్యమంలో భాగంగా రాసిన విప్లవ కవిత్వం ఆదరణను పొందింది. సృజనాత్మకత, హృదయంతో స్పందించే లక్షణం పున్నపుడే కవిత రాసినా, పాఠకులను మెప్పించ గలుగుతాడు. ఆయనలోని కళాత్మకత సృజనాత్మకతలే ఆయన కవిత్వాన్ని నిలబెట్టాయి. మంచి కవిత్వాన్ని తప్పని సరిగా ఆదరిస్తార్న అంశాన్ని ప్రభాకర్ కవిత్వం నిరూపిస్తుంది.

**— గుడిపాటి.**

**రక్తరేఖ,** వెల=10
ప్రతులకు : స్టూడియో చిత్రలేఖ
చిక్కడ్‌పల్లి. హైద్రాబాద్

(58వ పేజీ తరువాయి)

'నేం దొంగతనం జేసిన్నా' పుట్టినుంచెవ్వల సొమ్మయిదు పైసలన్న తెలువయ్ నేం దొంగను గాద్దొర" అన్నాడు దీనంగా.

"అవ్వన్ని పోలీసు స్టేషన్ల చెప్పుకుందువు పా" అయి బలవంతంగా దొబ్బుకెళ్ళి జీపులో వడేసాడు గట్టయ్యను. గుడ్లనిండా నీళ్ళతో నిస్సహాయంగా చూస్తుంది వెంకమ్మ. దొర పరమ సంతోషంగా పున్నాడు. గట్టయ్యను తీసుకొని పోలీసు జీపు ప్రక్కూర్లోవున్న పోలీసు స్టేషన్ చేరుకుంది, ఎన్నడూ పోలీసుస్టేషన్ ముఖం చూడని గట్టయ్య బెదిరిబెదిరి చూస్తున్నాడు. మెడమీద కట్టబెట్టి ఎన్.ఐ. దగ్గరకు తోసుకెళ్ళారు గట్టయ్యను. ఎన్.ఐ గట్టయ్య మోకాళ్ళపై, మోచేతులపై, వీపుపై శరీరమంతటా లాటీలతో కొడుతూ బూటు కాళ్ళతో తంతూ స్వాతంత్ర్యం రుచి చూపిస్తు న్నాడు. దేశమంతటా స్వాతంత్ర్య దినోత్సవ కార్యక్రమాలు సాగుతునే , ఉన్నాయి. సాయంత్రం జెండా దించే కార్యక్రమంలో గట్టయ్య కొడుకు బడి దగ్గర జనగణమన గీతం పాడు తున్నాడు. పోలీసు దెబ్బలకు తట్టు కోలేక అవ్వే అయ్యో అంటూ గట్టయ్య కేకలేస్తున్నడు. కొట్టీ కొట్టీ అతన్నొక చీకటి కొట్లో పడేసారు. తర్వాత మిగతా ఇద్దరు యువకుల వంతయింది. స్వాతంత్ర్యం రంగు, రుచి, వాసన లేంటో అదెవరికొచ్చిందో, దాని అసలు స్వరూప మేంటో నిరక్షరాస్యులైన అనాగరికుడు గట్టయ్యకూడా ఇప్పుడు నగ్నంగా అగుపడు తుంది.

**— కాలువ మల్లయ్య**

ఆప్కో వస్త్రవాహిని:

- సిల్కు చీరెలు
- నేతచీరెలు
- బ్లౌజ్ మెటీరియల్స్
- డ్రస్ మెటీరియల్
- పురుషుల కోసం వస్త్రాలు
- పిల్లలకోసం వస్త్రాలు
- గృహోపకరణ వస్త్రాలు
- రడీమేడ్స్
- గృహాలంకరణ వస్త్రాలు

ఆంధ్రదేశపు వివిధ ప్రాంతాల చీరెలు. సాదా లేదా గళ్ళ జరీ బోర్డర్లలో గుంటూరు చీరెలు. పేటు, టై & డై జరీ బోర్డర్లలో బందరు చేనేతలు. జరీ, బూటాలలో వెంకటగిరి చీరెలు. రాజమండ్రికి చెందిన, బూటా, టై & డై జరీ నేతలు, సిల్క్ మిక్స్ (చందేరి టైపు) చీరెలు. ఇంకా ఎన్నో రకాల అందాల చీరెలు మీ కోసం.

నేడే మీ సమీప ఆప్కో షోరూంను దర్శించండి.




ఆంధ్రప్రదేశ్ ఔన్నత్యపు నిలువుటద్దాలు ఆప్కో చేనేతలు

AKSHARA/APCO

BK

**NALUPU** Fortnightly Regd: as N.P. 45022/89 Regd. H/Sd- 173/RNP

ప్రజాసేవలో

జన్మదిన ప్రత్యేక
సంచిక వెల రు: 6/-

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాస్త్ర, సాంకేతిక మండలి

# A.P. STATE COUNCIL OF SCIENCE AND TECHNOLOGY (APCOST)

**ఉద్దేశ్యాలు :**

1. ప్రజల్లోకి శాస్త్రవిజ్ఞానాన్ని తీసుకొని పోవటం.
2. గ్రామీణాభివృద్ధికి ప్రజల సమస్యల పరిష్కారానికి శాస్త్రసాంకేతిక విజ్ఞానాన్ని విరివిగా ఉపయోగించడాన్ని ప్రోత్సహించటం.
3. ప్రణాళికా రచనకు కావల్సిన శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని అందివ్వటం.

**కార్యక్రమాలు :**

1. ఎంపిక చేసిన మండలాల్లో శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించి వివిధ రంగాల్లో అభ్యుదయాన్ని సాధించుట.
2. సమీకృత గ్రామీణ ఇంధన శక్తి ప్రణాళికలో పొగలేని పొయ్యి, బయోగ్యాసు, ఘర్షణ రహిత పుట్‌వాల్వులను, సౌరశక్తిని ఉపయోగించే కార్యక్రమాలను అమలు చేయుట.
3. ప్రాంతీయ, జిల్లా స్థాయి విజ్ఞాన కేంద్రాలను స్థాపించుట.
4. ప్రజల్లో ముఖ్యంగా విద్యార్థుల్లో శాస్త్రీయ అవగాహనను పెంపొందించుటకు శాస్త్ర విజ్ఞాన ప్రదర్శనలను ఏర్పాటు చేయుట.
5. "రిమోటు సెన్సింగు" ద్వారా రాష్ట్రంలో గల సహజవనరులను గుర్తించుట.
6. స్వచ్ఛంద సంస్థల సహకారంతో శాస్త్ర విజ్ఞానాన్ని గ్రామీణ ప్రాంతాలకు విస్తరింపజేసి ప్రజా బాహుళ్యంలో గల మూఢ నమ్మకాలను తొలగించి శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించుట.

**ANDHRA PRADESH STATE COUNCIL OF SCIENCE AND TECHNOLOGY (APCOST)**
Plot No. 38, Nagarjuna Hills,
Punjagutta, Hyderabad - 500 482.
Ph. No. 38587

Edited by B. Tharakam, and published by Cyril Reddy on behalf of
Hyderabad Book Trust printed at Gayatri Enterprises Hyderabad for Hyderabad Printers.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KLVA102M293 |
| --- | --- |
| పుస్తకం పేరు | వలుపు |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |